శృంగార వీరరసాత్మకమైన
పౌరాణిక చిత్ర ప్రబంధము

కౌముదీ వారి

# శ్రీకృష్ణవిజయము



హరిజనుల్ని నీచంగా చూసే వ్యక్తుల్ని ఏమని ప్రశ్నించ దలచారో! శ్రీ జగన్నాథంగారు రాసిన లేఖ సారాంశం తెలీక పాపం చాల మంది అవస్థ పడుతున్నారు. దీనికి తోడు హరిజనుల కిచ్చిన ప్రత్యేక సౌకర్యాలను చూడలేని చాల మంది ఇదే సమయమని— తమ కడుపు మంట వెళ్ళగక్కుతున్నారు.

కాని— ముఖ్యంగా సోదరి లక్ష్మీజగన్ లాంటి వారు తెల్సుకోవల్సింది, హరిజనులసౌకర్యాలు ఇతరుల్ని ఇబ్బంది పెట్టడానికిచ్చేవి కావు. తర తరాలుగా వారికి జరిగిన అన్యాయాల్ని—రూపు మావడం కోసం మానవతా వాదులు విశాలదృష్టి గల మేధావులు పోరాడి సాధించిన పవిత్రఫలం.

కాబట్టి – ముమ్ముందు యిలాంటి సవాళ్ళుచేసే ముందు కొంత పూర్వపరాలు తెల్సుకోవటం అవసరమని సోదరి— లక్ష్మీ జగన్ గారిని కోరు తున్నాను.

కారెం ఆనీరోజ్ చలం, [కాకినాడ].

## సి ని మా

ముఖ్యంగా సిప్పాపిటీ శీర్షికలో మనతెలుగు చిత్రాలు ఆర్థికంగా ఎందుకు నష్టపడుతున్నాయో మోహన్ కుమార్ చాలా బాగా వివరించారు. విదేశాలలో తెలుగు చిత్రాల ప్రదర్శనలను అభి వృద్ధి పరచాలనే భావంతో నిర్మాత శ్రీ రాజేంద్ర ప్రసాద్ తన బ్యానర్ క్రింద నిర్మించిన తెలుగు చిత్రాలను 'మారిషస్'లో ఉచితంగా ప్రదర్శిస్తా మని నిర్ణయి గైకొని . లుగు సినిమా జగతికే ఆదర్శభూతులైనారు. వారెంతో అభినందనీయులు! మిగిలిన నిర్మాతలు కూడ ముందుకు వచ్చి తగినంత కృషి సల్పి మన తెలుగు చిత్రాలు విదేశాలలో విశేషంగా ప్రదర్శింప బడేం దుకు తోడ్పడతారని ఆశిద్దాము!

తమ్మా ఆదినారాయణ [ఊబలంక]

* * *

తే. 25—12—70 దీ పత్రికలో స్వప్న గారు విజయవాడనుంచి వ్రాసిన ఉత్తరము చదివి ఎంతో విచారిస్తున్నాము. ఒక నటుడు ప్రజా సేవ చేస్తామనగానే ప్రచురించడము ఒక విజ్ఞాని సాహిత్యాభిలాషను గూర్చి ప్రచురించక పోవడమునకు చాము చింతిస్తున్నామని వ్రాసినారు. ఆ నటుడు పద్మశ్రీ రామారావు సంక్షముగా) ప్రజాసేవ యింకా మొదలు పెట్టనేలేదు అని వ్రాసినారు. చైనా — యిండియా యుద్ధ సందర్భములో ఆయన చందాలువేసి స్వర్గీయ లాల్ బహదూర్ శాస్త్రికి 10 లక్షలు అందజేసినది, నిన్నగాక మొన్న విశాలాంధ్ర తుఫాను (ఎక్కువ విజయ వాడకే బాధితులకు ఎండలో ఎండి నాటకాలు వేసి, శ్రమించి యిచ్చినది (యిలా ఎన్నెన్నో బహుశా వారి ప్రజాసేవకు లెక్కరాలేదు కాబోలు.

.. ఇక మీకు తెలుసా అనే శీర్షిక కేవలము మాకు సంబంధించినదే. వారి కిది తెలియ ., వెంటనే ఈ విషయము మీకు తెలుసాలో రింపఁ గోర్తాను. బహుశా స్వప్నగారు

## ఉత్తరాలు

స్వప్నములో వ్రాసి ఉత్తరము పోస్టు చేసి యుంటా రను కొంటాను. వారన్నట్టు ఆం. ప. పాఠకులు నాతో ఏకీభవిస్తున్నారను కొంటాను.

పి. వి. రావు, (విశాఖపట్నం)

* * *

బ్యాలెట్ ఫలితాలు చూశాము. మీరు అన్యథా భావించక పోతే ఒకచిన్న సలహా. ఇక మీదట ఈ క్రొత్తపద్ధతిని అనుసరించ కండి. పాత పద్ధతి వల్లనే ఇంతకంటే మంచి ఫలితాలు వచ్చాయి. 'బ్యాక్టు వోల్డ్ మెథడ్ ఎగెయిన్'. మాకో చిన్న అనుమానం. బహుమతి పొందిన వ్యాసాలకూ, ఫలితాలకూ ఎక్కడ పొంతన లేదు. మీరు పూర్తిగా వ్యాసాలమీద ఆధారపడ్డారా? లేక కేవలం కూపన్ల మీద ఆధారపడ్డారా? కూపన్ల మీదనే ఆధార పడినట్లు మాఅనుమానం. మాఅనుమానం తీరు స్తారా?

కోనేరు సుబ్బయ్య [విజయవాడ]

జవాబు:—

* పాఠకుడి అనుమానం మాకు పూర్తిగా అర్థం కాలేదు. కాని బాలట్ ఫలితాలు బాలట్ పత్రాలని బట్టి నిర్ణయించడం, వ్యాసాలకి బహుమతులు, నిర్ణేతల అభిప్రాయాలనుబట్టి ఇవ్వడం జరిగిందని ఇంతకుముందు మేము చేస్తూవచ్చిన ప్రకటనలి బట్టి తెలుసుకోవచ్చు. —సం.

* * *

25—12—70 ఆంధ్రపత్రికలో సిని మాలో తెలుగు నవల స్థానం, అన్న విషయమై చర్చిస్తూ చక్కని సూచన చేశారు. అయితే తెలుగు నవలలో కామెడీ లేకపోవడం వల్ల అది ప్రత్యేకంగా తాము తయారు చేసుకో వలసి వస్తుం దని అన్నారు. ఈ పద్ధతి మన తెలుగు చిత్రా ల్లోనే కనిపిస్తుంది.

ప్రతి చిత్రంలోనూ ఓ కామెడీ పాత్ర ఎలాగో లా యిరికించేస్తుంటారు. దీనికి కథతోఎక్కడా సంబంధం వుండదు. కథతో సంబంధం లేన ప్పుడు ఈ కామెడీ ప్రతి చిత్రంలోనూ ఎందు కుండాలను కుంటారో అర్థం కాదు.

అంతగా నవరసాల్లోని ఒకటైన హాస్యంకూడా చిత్రాల్లో వుండాలనుకున్నప్పుడు అందు కనుగ ణంగా ప్రధాన పాత్రలకే కొన్ని సంభాషణలద్వారానో, లేక ఏ సన్నివేశం ద్వారానో కామెడీ సృష్టించవచ్చుగా. ఆ మాత్రం దానికి కామెడీ అని చెప్పి కథతో సంబం ధం లేకుండా ఏ కాకమ్మ కథల్లాంటివో ఉపకథలు సృష్టించి బోరు కొట్టించడం అనవసరం. దయ చేసి మన దర్శక నిర్మాతలు యిటువంటి అనారోగ్య కరమైన ఆలోచన్లు దరికి రానియ్యకపోవడం, ఆరోగ్యకరమైన లక్షణం.

— శివరాట్నే బలాశా, (ఖర్గపూర్).


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 15—1—'71

శ్రీసాధారణనామ సం॥ పౌషమాసం॥ బహుళ చవితి

సంపుటము : 64 సంచిక : 20

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టివీథి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: శ్రీ గెనిశెట్టి


ఆమె ఆలోచనలు మనకెలా తెలుస్తాయి?




ప్రధాని అనుకున్నది తప్పు. నేను గొర్రెపిల్లనే!


ఆంధ్రప్రదేశ్ లో కొత్త కాంగ్రెస్ కోట
సంజీవ రెడ్డి


ప్రజాస్వామ్యాన్ని రక్షించండి
పాతయోధుల బృందం

# పంటల పండుగ—సంక్రాంతి

వస్తూవున్న పండుగులే మళ్లీ మళ్లీ తిరిగి వస్తూ ఉంటాయి. అయినా ఏడాదికవి కొత్తవే కాబట్టి ఎప్పటి ప్పుడే కొత్తగా కనబడుతూ ఉంటాయి. యస్సు మళ్లినవారు ఎక్కువ ఉత్సాహం పకపోయినా, పిల్లలూ, యువకులూ, లూ ఎక్కువ ఆసక్తిని చూపుతూ టారు.

నువది వ్యవసాయం ప్రధానంగా ఉన్న ం. కర్షకుల శ్రమకు ఫలితంగా టలు పండి తిండిగింజలు ఈ సంక్రాం గాదెలు చేరుకుంటాయి. ఏడాదిపాటు పునిండా తిండి తినగలమనే ధైర్యో హాలు కలుగుతాయి. తర్వాతనే యీ డుగ వస్తుంది కాబట్టి యిది పంటల డుగ అని చెప్పవచ్చు. ఈ సమయం రే అర్థించే వాళ్ల సంఖ్య అధికంగా టుంది. ఉత్సాహంతో ఉన్న ప్రజలు ఇత కు ఇవ్వడానికి వెనుక తీయరు.

పండుగ వస్తున్నదనగా చాలా రోజులకు ందే గృహాలంకరణ ప్రయత్నాలు జరుగు యి. ఇళ్లకు అవసరమైన చిన్న చిన్న మ్మతులు చేయించడం, సున్నాలు ట్టించడం, రంగులు వ్రాయించడం పూర్తి చెయ్యబడుతుంది. పనికి మాలిన పాతవస్తువులన్నీ ఒకచోట చేర్చబడతాయి భోగిమంటలకోసం!

ఈ పండుగ మూడురోజులు! మొదటి దినం భోగిపండుగ. నాటిదినం తెల్లవారుజామున ఇళ్లముందర మంటలువేసి, వాటిలో పాతవస్తువులను పడవేసి అగ్నికి ఆహుతి చేస్తారు. తర్వాత అభ్యంజన స్నానంచేసి కొత్త బట్టలు కట్టుకుంటారు. ఆ దినం విందు భోజనాలతోనూ, వినోదాలతోనూ ఆనందంగా గడిచిపోతుంది. ఈ పండుక్కి కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ పిలిచి కట్నాలివ్వడం, కొత్త వస్త్రాలివ్వడం పరిపాటి. జనసామాన్యం ఆనందంగా జరిపే పండుగ యిది!

మర్నాడు సంక్రమణం. సూర్యుడు దక్షిణాయనంనుంచి ఉత్తరాయణంలోకి సంక్రమించే దినం! అంటే న్యాయంగా సౌరమాన ప్రకారం సంవత్సరానికి ఆది. చాంద్రమానంలో చైత్రశుద్ధ పాడ్యమి సంవత్సరాది. ఆనాడు పంచాంగం చెప్పే సిద్ధాంతులవల్ల ప్రజలు పంచాంగ శ్రవణంచేసి ఆ సంవత్సరంలోని ఫలాఫలాలను తెలుసుకోవడం పరిపాటి. ఆసిద్ధాంతి స్థానాన్నే యీనాడు సంక్రాంతి పురుషుడు ఆక్రమిస్తాడు. మన పంచాంగాల్లో సంక్రాంతి పురుషుని చిత్రం కూడా ఉంటుంది. లక్షణమూ వ్రాయబడి వుంటుంది. ఆ సంక్రాంతి పురుషుణ్ణి బట్టి నాటినుండి సంవత్సరంవరకూ కాలమాన పరిస్థితులు ఎలావున్నదీ తెలుసుకోవచ్చు. ఇది పితృదేవతలకు సంబంధించిన పండుగ. తర్పణాదులు నెరవేర్చడం. కర్షకులు మున్నగువారు పెద్దల పేర్లు చెప్పి స్వయంపాకాలు, గుమ్మడిపళ్ల దానాలు ఇవ్వడం ప్రధానంగా చూస్తారు. పొంగళ్లు వండి దేవుళ్లకు నివేదిస్తారు. అందువల్లనే యిది 'పొంగలి పండుగ' అని కూడా ప్రసిద్ధికి వచ్చింది.

మూడవదినం కనుమపండుగ. ఈ దినం పశువులను చక్కగా అలంకరించి, వాటికి మంచిమేతవేసి సంతోషం కలిగించడం సంప్రదాయం. ఈ మూడు దినాలూ వరుసగా మానవులకూ, దేవతలకూ, పశువులకూ పండుగలు కావడంవల్ల ఒక ప్రత్యేకత ఏర్పడి ఉన్నది.

ఈ సంక్రాంతికిముందు నెలరోజులు తెల్లవారుజామునే లేచి, పరిశుద్ధ హృదయాలతో భగవంతుని సంకీర్తనచేస్తూ భజనలు చేసుకుంటూ ఊరు తిరుగుతారు. ఇది దక్షిణదేశం అంతటా జరిగే ఆచారం. పెరియాళ్వార్ల పుత్రిక గోదాదేవి, ఊరుతిరిగి తోడి చెలికత్తెలను పిలుచుకుంటూ భగవత్సంకీర్తనచేస్తూ నియమంగా ఆరాధించిన పద్ధతిని ఇది సూచిస్తుంది.

దీనిబట్టి మరో విషయాన్ని కూడా ఊహించవచ్చును. అప్పటికి పొలాలు పండి చేలు కళ్లాలలో కుప్పలు కుప్పలుగా వెయ్యబడి ఉంటాయి. ఎంతో శ్రమపడి పండించిన ఈ పంటను— శ్రమ అక్కర లేకుండా సులభంగా రాత్రిపూట కాజేయవలెననే ఉపాయశాలులు కొందరు ఉంటారు గదా! అట్టివాళ్లు పండిన పంటను అపహరించకుండా అక్కడక్కడ నెగళ్లు



దానుకుని చలికాచుకుంటూ రాత్రిళ్లు మేలుకొని ఉండేవారట! భోగిమంటలు, భజనలు ఈ విషయాన్ని సూచిస్తున్నాయని అనుకోవచ్చును.

తెలుగునాట చాలా ప్రాంతాలలో కనుము పండుగ తర్వాతి దినం కూడా పండుగగానే జరపబడుతుంది. దీనినే ముక్కనుము అని అంటారు. ఆ దినం కొన్నిజాతుల స్త్రీలు పిల్లలతోకూడా ఊరుతిరిగి సాయంకాలానికి యిల్లు చేరుకుంటారు. స్త్రీలు స్వేచ్ఛావాయువులు పీల్చుకోడానికి ఇది అనుకూలమైన దినము!

ఈ పండుగ రోజుల్లో కొన్ని ప్రాంతాల్లో కొన్నికొన్ని వ్రతాలుజరుగుతూ వుంటాయి. వాటిలో గొబ్బి గౌరీవ్రతం ఒకటి. ఈ వ్రతం భోగినాడు ప్రారంభమవుతుంది. నాటి సాయంకాలం—ఇంట్లో నిర్మించిన ఒక మండపంమధ్య బియ్యం పోసి, దానిపైని మట్టితోచేసిన గౌరి విగ్రహాన్ని నిలుపుతారు. ఆకాలంలో లభించే పళ్ళూ, కూరగాయాలూ ఆ మంటపంలో ఉంచబడతాయి. ఆరాత్రి నియమనిష్ఠలతో దేవీపూజ జరుగుతుంది. రాత్రి పాటలతో దేవిని పవ్వళింపజేసి, మర్నాడు తెల్లవారుజామునే మేలుకొలుపుతారు. మూడు దినాలూ సాయంకాలం ముత్తయిదువలను పేరంటానికి పిలుస్తారు. స్త్రీలందరూ కలిసి దేవీమండపం యెదుట పాటలు పాడుతూ గొబ్బి తట్టుదురు. నాల్గవదినం ఉద్వాసన జరుగుతుంది. అప్పుడు మండపంలో ఉంచబడిన కూరగాయలన్నిటినీ కలిపి కూరవండుతారు. అదే గొబ్బికూర. ఆ సాయకాలం గొబ్బి గౌరీదేవిని చెరువులోగాని, నదిలోగాని విడిచిపెడతారు.

భోగినాడు సాయంకాలం పసిబిడ్డలను అలకరించి రేగుపళ్లు, చెరకు ముక్కలు, పైసాలు మున్నగువాటిని స్నానంచేయించినట్లుగా తలమీద పొయ్యడం, హారతి యివ్వడం చాలచోట్ల అనుసరించబడే ఆచారం. అప్పుడు పేరంటానికి ముత్తయిదువలువచ్చి పాటలుపాడి పసిబిడ్డలను దీవిస్తారు. దసరా పండుగలలో పెట్టినట్లుగా బొమ్మలకొలువు పెట్టడంకూడా కొన్నిచోట్ల సంప్రదాయంగా ఉన్నది.

సంక్రాంతినాడు పొంగలి వండుకొనుట వైద్య శాస్త్రానుసరణాన్ని తెలుపుతూ ఉన్నదని వైద్యంతెలిసినవారు చెప్తున్నారు. వాగ్భటుడు మొదలైన ఆయుర్వేద గ్రంథకర్తలు ఆయాఋతువుల్లో భుజించవలసిన ఆహారాన్నిగురించి చెప్తూ చలికాలంలో ఉదయాన్నే ముద్గాన్నాన్ని—అనగా పెసరపప్పు, బియ్యం కలిపివండిన పొంగలిని—లేక పులగాన్ని భుజించాలని చెప్పారు. ఉదయమునయేసరికే ఎందుకు తినాలంటే—శీతకాలంలో రాత్రిభాగం ఎక్కువ పగటిబాగం తక్కువ. ఆరోగ్యంగా ఉన్నవారికి ఉదయం లేచేసరికి ఆకలిగా వుంటుంది. అందువల్లనే ఉదయాన్నే దాన్ని భుజించవలెనన్నారు. ధనుర్మాసం నెలరోజులూ కూడా మన దక్షిణదేశంలోని విష్ణ్వాలయాలలో తెల్లవారు జామునే పూజలు జరిపి పొంగలి తయారుచేసి నివేదనచేసి భక్తులకు పంచిపెడుతూ ఉంటారు. ఈ పద్ధతి వైద్యశాస్త్రాన్ని అనుసరించే ఏర్పడి యుండవచ్చును. అందరూ ప్రతి దినం పొంగలి చేసుకొనుట సాధ్యంకాదు. అది వ్యయభారమైనది. కొందరు వారానికి ఒకసారి చేసుకోవడం ఉన్నది. మరెప్పుడూ చేసుకున్నా, చేసుకోకపోయినా సంక్రాంతినాడు మాత్రం అందరూ తప్పక పొంగలిని వండుకుని. ఈ పండుగుపేరును సార్థక పరుచుతారు.

మనం చేసుకునే పండుగులకూ, పురాణగాథలకూ సంబంధం కలపడం జరుగుతూ ఉన్నది. అట్టి సంబంధంవల్ల పండుగులకు ప్రాముఖ్యం కలుగుతుందనీ. ప్రాశస్త్యం వృద్ధి అవుతుందనీ మనవారి అభిప్రాయం కావచ్చు. ఈ సంక్రాంతికీ, బలిచక్రవర్తి గాథకూ సంబంధం వున్నదట? త్రివిక్రమావతారం ఎత్తిన విష్ణువు బలిచక్రవర్తి శరస్సుపైమూడవ అడుగును పెట్టి పాతాళానికి అణచివేసినది ఇప్పుడేనట! విష్ణుదేవుని పాదత్రయానికి సూచకంగా మూడురోజుల పండుగ జరుపుకోవడం ఆచారమయినదట!

ప్రజలు పాడిపంటలకు లోపంలేనిస్థితిలో ఉన్నప్పుడు చేసుకొనే పండుగే రాణిస్తుంది. తక్కిన పండుగులు జరుపుకునే కాలంలో ఏదోఒక కొరత కానరావచ్చును. పంటలు పండి పశుగ్రాసం సమృద్ధిగా ఉండేటప్పుడు జరుపుకునే యీ పండుగ, పండుగలన్నింటిలోనూ మేలైనది! అందువల్లనే యీ పంటల పండుగ 'పెద్దపండుగ' అయింది.

—అంగీరస

## సంక్రాంతి సందేశం

పసిడిపంట పూచుకొన్న
కృషిక హృదయ మేమన్నది?
తనువు వంచి పనిచేసిన
దారిద్ర్యమె లేదన్నది!

రంజుగ పోరాడి కోడి
పుంజులు తుద కేమన్నవి?
అంతగికలహాలు జాతి
కంతె వేరు పురుగన్నవి!

పొగల సెగల నింగికెగయు
భోగిమంట లేమన్నవి?
అంతశ్శుచియైన బ్రతుకు
కాంతియుతమ్మగునన్నవి!

హరిదాసుని మధురగాన
తరంగాలు ఏమన్నవి?
బ్రతుకులోని పరమార్థం
వెదకి పట్టుకొమ్మన్నవి

కొప్పులలో పూలుముడిచి
గొబ్బెమ్మలు ఏమన్నవి?
కన్నెల తొలి వలపులలో
వన్నెలమే మేమన్నవి!

విరబూచిన బంతిపూల
చిరునగవు లేమన్నవి?
పరులకు నీ ఆనందం
పంచుటయే బ్రతుకన్నవి!

మణులవోలె తళుకులీను
మంచు చినుకు లేమన్నవి?
స్వచ్ఛమైన మనసుకన్న
సౌందర్యము లేదన్నవి!

కాంతితోడ వచ్చిన సం
క్రాంతి బాల ఏమన్నది?
ఎల్లకాల మీరీతిగ
పల్లెగ సాగాలన్నది!

—అపేరా

# ఆంధ్రప్రదేశ్ లో
# లలితకళలు: కొత్తదశ ప్రారంభం!

ప్రభుత్వం అప్పుడప్పుడు మంచి పనులు చేస్తూ ఉంటుంది. రాష్ట్రంలో జరిగే నాటక నృత్య ప్రదర్శనలను, సంగీత సభలను వినోదపన్ను నుంచి మినహాయించడం ఇటువంటి అరుదైన వాటిలో ఒకటని చెప్పవచ్చును. ఈ మినహాయింపు కావాలని ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం, ఇతర సంస్థలు చాలా కాలం నుంచి ఆందోళన చేస్తున్నప్పటికీ, ప్రభుత్వం ఈ మధ్యనే అందు కంగీకరించింది. ఐదారువారాల క్రితమే ముఖ్యమంత్రి ప్రభుత్వం ఇందుకు సమ్మతిస్తోందని ప్రకటించారు కాని అసలు జీ. వో. మాత్రం వారం క్రితమే జారీ చేసింది. ఇకముందు నాటకాలు వేసుకునే వారికి పోలీసుల బెడద, వాణిజ్య పన్నుల శాఖోద్యోగుల బాధ ఉండదు. గ్రామాల్లో వీధి నాటకాలు వేసుకునేవారు కూడా గ్రామ పంచాయితీకి ఏదో ముడుపు చెల్లించుకోవాలట. ఈ బాధ నుంచి రక్షించమని డిసెంబరు ఆఖరువారంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ రంగస్థల కళాకారుల ప్రథమ మహాసభలో కళాకారుల మంత్రి తోట రామస్వామిగారికి విన్నవించుకుంటే, మీ కోరికను తప్పకుండా మన్నిస్తామని, మంత్రి హామీ ఇచ్చారు.

వినోదం పన్ను బాధ అన్ని నాటక సంఘాలు, పట్టణాల్లో, గ్రామాల్లో కూడా పడినట్టిదే. కాని పంచాయితీ పన్ను బాధ ఒక్క గ్రామాల్లో నాటకాలు వేసుకొని, ప్రజలకు వినోదం కాలక్షేపం పంచి పెట్టే మన ప్రాచీన నాటక కళను సజీవంగా భద్రపరుస్తున్న నాటక బృందాలకే ఉంటుంది.

## సురభి కంపెనీ

ఒకప్పుడు దేశమంతటా చొక్కని పౌరాణిక నాటకాలు వేసి జీర్ణంగా నున్న ఆంధ్రరంగస్థలాన్ని ఉద్ధరించి కీర్తి నార్జించిన సురభి కంపెనీ వారు ఇప్పుడు 36 కుటుంబాలుగాను, అందులో ఒక్కొక్కటి ఒక్కొక్క నాటక సమాజంగాను మారి తమ కార్యక్రమాలను గ్రామాల వరకే పరిమితం చేసుకుని జీవనోపాధి చేసుకుంటున్నారు. ఈ 36 కుటుంబాలుకూడా సంవత్సరాని కొకసారి ఏదో ఒక గ్రామంలో సమావేశమై నాటకోత్సవాలు జరుపుకుంటారు. ఆ సందర్భంలోనే సురభి సంస్థకు నీరు పోసి పెంచిన వనారస గోవిందరావు వర్ధంతిని కూడా జరుపుకుంటూ ఉంటారు. ఈ సురభి సమాజాలన్నీ ఈ మధ్య ఒక సమాఖ్యగా ఏర్పడ్డాయి. ఈసారి తమ వార్షికోత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరంలో జరుపుకోవాలనుకొని. రాష్ట్ర నాటక సంఘంవారు ఏర్పాటు చేసిన రంగస్థల కళాకారుల మహాసభతో పాటు తమ ఉత్సవాలను కూడా వేడుకగా జరుపుకున్నారు. ఈ సందర్భంలోనే తోట రామస్వామిగారికి గ్రామాల్లో తమ ప్రదర్శనలకు గల ఇబ్బందుల గూర్చి చెప్పుకున్నారు. మంత్రిగారు కూడా ఉదారంగానే హామీ నిచ్చారు.



రాష్ట్ర విద్యామంత్రి పి. వి. నరసింహారావు విశ్వనాథవారి 'వేయి పడగలు'ను హిందీలో అనువదించినందుకు ఆయన్ను, కవిసామ్రాట్టును హైదరాబాదులో జరిగిన ప్రథమ అఖిలభారత హిందీయేతర ప్రాంతీయ హిందీ రచయితల మహాసభల సందర్భంలో సన్మానించారు.

సురభి కంపెనీవారి ప్రత్యేకతలు చాలా ఉన్నాయి. ప్రదర్శనం ఇవ్వదలచుకున్నచోట తమ హాలును వారే యేర్పాటు చేసుకుంటారు. స్వంత డైనమోలో విద్యుత్తును సృజించుకుని, రంగస్థలానికి అవసరమైన లైటింగ్ ఎఫెక్ట్సు వగైరా సమకూర్చుకుంటారు. కుటుంబంలోని ప్రతి వ్యక్తికి సాహిత్యంలోనో, నృత్యంలోనో లేక నాటక రంగానికి సంబంధించి ఏ ఇతర విభాగంలోనో అంతో ఇంతో నేర్పు ఉంటుంది. కష్టాన్ని సుఖాన్ని సమంగా పంచుకుంటారు. విగ్గులు, రంగాలంకరణకు కావలసిన సామగ్రి, సెట్టింగులు వగైరాలు, తామే తయారు

## రాజధాని కబుర్లు

చేసుకుంటారు. డిజైను చేస్తారు. [illegible] శిక్షణ కూడా [illegible]. నాయకుడి మాటకు తిరుగు ఉండదు.

## కీచక వధ

మొట్టమొదటిసారిగా 1889 లో వనారస సోదరులైన రామయ్య, వెంకోజీ, కృష్ణారావుగార్ల చే సురభి నాటక సమాజం అవతరించింది. వారి మొదటి ప్రదర్శన కీచక వధ కడప జిల్లాలోని సురభి గ్రామంలో జరిగింది కనుక ఆనాటి నుంచి సురభి నాటక సమాజం అనే పేరు శాశ్వతమైంది.

రాస్తాటి సుబ్బరామదాసు, మారేపల్లి రామచంద్ర శాస్త్రి, మల్లాది అచ్యుతరామశాస్త్రి, చిలకమర్తి, విశ్వనాథ కవిరాజు, కొప్పరపు సుబ్బారావు, హరి పురుషోత్తం, మల్లాది వెంకట కృష్ణశర్మ మొదలైన కవుల విరచితమైన సారంగధర, శకుంతల, హరిశ్చంద్ర, కీచక వధ, మైరావణ, సతీసావిత్రి, కాంతామణి, దశావతారాలు, రుక్మాంగద, సుభద్రాపరిణయం, వసంతసేన, జమీందారు,

ప్రతిజ్ఞ, మాయాబజారు, లవకుశ, కృష్ణలీలలు లాంటి నాటకాలను వీరు తరచు ప్రదర్శిస్తూ ప్రేక్షకులను ముగ్ధులను చేస్తారు. వీరి వైర్ వర్కు మొదలైన టెక్నిక్కులు, అధునాతన నాటక ప్రదర్శకులకు కూడా విస్మయాన్ని గొల్పుతాయి.

గత రెండు మూడు దశాబ్దాల్లో నాటక రంగంలోను, తరువాత సినీరంగంలో ప్రసిద్ధులైన నటీనటుల్లో పలువురు సురభి బృందానికి చెందిన వారే. ఈ వర్గానికే చెందిన వనారస గోవింద రావుగారు 1929 లో, స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ఆచంట సాంఖ్యాయనశర్మ గార్ల అండదండలతో ఆంధ్రనాటక కళాపరిషత్తును స్థాపించారు.

మొత్తంమీద 1970 వ సంవత్సరం, తెలుగు నాటక రంగానికి కొత్త ఊపు నిచ్చిందని చెప్ప వచ్చును. నాటక కళాభివృద్ధికి అంకితమైన నాటక సంఘం లాంటి సంస్థలు ఔత్సాహిక నాటక సమాజాల పరిధులను దాటి నటున. రంగస్థలాన్ని వృత్తిగా స్వీకరించిన వారి సమస్యల పట్లకూడా ఉత్సాహాన్ని ఆసక్తిని చూపుతున్నారు. ఆంధ్ర ప్రదేశ్ నాట్య సంఘంవారు మొట్టమొదటిసారిగా ఆంధ్రప్రదేశ్ రంగస్థల కళాకారుల మహాసభలను డిశంబరు ఆఖరులో హైదరాబాదులో ఏర్పాటు చేశారు. ఇక్కడ ఈ మహాసభలు జరిగిన తరువాతనే, అఖిల భారత స్థాయిని ఢిల్లీలో రంగస్థల కళాకారుల సమావేశం జరగడం సంభవించి, గిల్డ్ ఆఫ్ ఇండియన్ థియేటర్ ఆర్టిస్ట్స్ GITA అవతరించింది. గీటా సంఘానికి సినీనటుడు, రంగస్థలనటుడు, సి. నాగభూషణం అధ్యక్షుడుగాను, శ్రీ పోతుకూచి సాంబశివరావు కార్యదర్శిగాను ఎన్నికయ్యారు. నటులే కాక రంగస్థలానికి సంబంధించిన ఇతర కళాకారులు— నృత్యం, సంగీతం మొదలైన కళలకు, రంగస్థలం టెక్నిషియన్లు— అందరూ ఇందులో ఉంటారు. వీరందరికీ సంబంధించిన రిజిస్టరు ఒకటి రాష్ట్ర ప్రాతిపదిక మీద తయారు చేయడం, రాష్ట్రాన్ని ఐదు మండలాలుగా విభజించి ప్రతి మండలంలోను రిపర్టరీ థియేటరును ఏర్పాటు చేసి, స్థానిక నటీనటులకు, నాటక ప్రదర్శనముల ద్వారా అవకాశాలను కలిగించడం, వారి సాంఘిక ప్రతిపత్తి ఇనుమడించడానికి తోడ్పడడం, వారి యోగ క్షేమాల కోసం నిధి సేకరణ, వారికి వారి కుటుంబాలకు గృహవసతి, విద్యా వైద్య సౌకర్యాలు లాంటివి కలిగించడం ఈ సంఘ ధ్యేయాల్లో ముఖ్యమైనవి. నటీనటుల్లో క్రమ శిక్షణ, కళా ప్రావీణ్యం కలిగించడం కూడా ఈ సంఘాశయం.

## ప్రేక్షకులలో ఉత్సాహం

ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం కార్యనిర్వాహాధ్యక్షుడు శ్రీ ఏ. ఆర్. కృష్ణ, ఢిల్లీలో జరిగిన భారత నాట్య సంఘం సమావేశాల్లో పాల్గొని తిరిగి వచ్చిన తరువాత, ఈ రచయితతో మాట్లాడుతూ, ఆంధ్రదేశంలో నాటక రంగానికి అనుకూలంగా ఏర్పడిన అనుకూలమైన వాతావరణం పట్ల తమ సంతృప్తిని ప్రకటించారు. శ్రీ కృష్ణ భా. నా. సంఘానికి ప్రధాన కార్యదర్శి కూడా. మాండలిక నాటకోత్సవాల రూపంలో రాష్ట్ర నాట్య సంఘం ఒకటి రెండు సంవత్సరాలుగా కొనసాగిస్తున్న కార్యకలాపాలు ఫలిస్తున్నాయనీ, రాష్ట్రమంతటా కూడా అపూర్వమైన ఉత్సాహం, ఆసక్తి నాటకీయుల్లోను, ప్రేక్షకుల్లోను కనిపిస్తున్నదనీ, విశాఖ పట్టణం, రాజమండ్రి, విజయవాడ, గుంటూరు, తిరుపతి, వరంగల్లు, సికిందరాబాదు నగరాల్లో నూత్న సంవత్సరంలో అన్ని హంగులు ఉన్న థియేటర్లను నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, ప్రభుత్వ వైఖరి కూడా ఈ విషయంలో సహాయకారిగా ఉందనీ చెప్పారు. నాటక ప్రదర్శనముల ద్వారా వీటికై నిధి సేకరణ జరుగుతుందనీ, ఇవికాక ప్రతిజిల్లా కేంద్రంలో కూడా బహిరంగ రంగస్థలం, నాటక ప్రదర్శనకు వలసిన అన్ని సౌకర్యాలు కల నాట్యభవన్ ఏర్పాటు జరుగుతుందని కూడా కృష్ణగారన్నారు. ఉగాదికి ఈ భవనాలకు పునాది రాళ్ళు పడ్తాయని కృష్ణగారు తలుస్తున్నారు. నిజామాబాద్ జిల్లాలో కనిపించిన ఉత్సాహం కృష్ణగారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. తమ జిల్లా నాట్య సంఘం పట్టికలో లేకపోయినప్పటికీ, సర్వ సౌకర్యాలు కల రవీంద్రభారతి లాంటి హాలు తమ జిల్లా కేంద్రంలో నిర్మించేటందుకు ఐదు లక్షల నిధిని సేకరిస్తామని అక్కడి ప్రముఖులు ముందుకు వచ్చారట.

నాటకోత్సవాలు వికేంద్రీకృతంగా జరగడం ప్రారంభమైన తరువాత నాటకాల పట్ల కలిగిన క్రొత్త చైతన్యం పట్ల సంతృప్తిని ప్రకటిస్తూ కొత్త రచయితలు ఇప్పుడు కనిపిస్తున్నారనీ, క్రొత్త నాటకాలు కూడా వెలువడుతున్నాయనీ శ్రీ కృష్ణ చెప్పారు. ఆయన అభిప్రాయంలో మరో రాష్ట్రమెక్కడా కూడా నాట్య కళాభివృద్ధి ఇంత వ్యవస్థీకృతంగా జరగడం లేదన్నారు. ఎస్. ఆర్. నం... గారు తెలుగులో వ్రాసిన మరో మహెంజోదారో హిందీలోకి వారేణ్యస్సాన్ పేర రమేష్ మెహెత అనువదించారు. ఢిల్లీలో భారత నాట్య సంఘ సమావేశాల సందర్భంలో, దీన్ని ప్రదర్శించినప్పుడు అక్కడి ప్రేక్షకులు, విమర్శకులు ఎంతో అభినందించారని శ్రీ కృష్ణ అన్నారు.

## కొత్త నాటకాలు :

నాటకాల పట్ల పూర్వంలేని ఉత్సాహం ఆసక్తి ఇంతగా కనిపిస్తున్నప్పటికీ, కొత్తగా వెలువడుతున్న నాటకాలు కథావస్తువు విషయంలోకాని వాటి ప్రదర్శనముల స్థాయి కాని సంతృప్తికరంగా ఉన్నాయని చెప్పడానికి వీల్లేదన్నారు. శ్రీ కృష్ణ హైదరాబాద్‌లోనున్న నాట్య విద్యాలయం ఒక్కటే సక్రమంగా నిర్వహింపబడుతున్నదనీ, విజయవాడ, అనంతపురంలో ప్రారంభింపబడిన విద్యాలయాలు మూత పడ్డాయి. —వి. నాగేశ్వరావు








# ప్రశ్నోత్తరం

—కె. రామలక్ష్మి....

**వి. ఎన్. ఆర్, అనకాపల్లి**

ఎదుటివారిని విమర్శించే టప్పుడు ...వకు ఆత్మవిమర్శ అవసరం కదా? ...ట్లా ఆత్మవిమర్శన లేకుండా విమర్శించే ...రి జ్ఞానాన్ని ఏమనాలి?

తప్పు చేయనివాడే ప్రపంచలో ఉండడు. ...ళ్ళాన్ని కొట్టినందుకు ఎదుటివాణ్ని జైల్లో ...ట్టిన జడ్జీగారు యింటి దగ్గిర పెళ్ళాన్ని కొట్ట...ని నమ్మకం ఏమిటి? ఆత్మవిమర్శన చేసుకుని ...ందితుణ్ణి వదలమంటారా?!

**..., ఎస్ ఎన్, తెనాలి**

మీ జవాబులు చదువుతుంటే మీ నుండి ...లుసుకోతగ్గవి చాలా ఉందనిపిస్తూంది. ...కు ఉత్తరం రాస్తే జవాబిస్తారా? మీ ...డ్రస్ ఏమిటి?

పత్రిక చిరునామాయే నాదీను! ఇక తెలుసుకో...గ్గవి నా దగ్గరేం లేవు. మీ దగ్గిరలోనే—ఏలూరు ...ంచి ప్రచురిస్తూంటారు— 'తెలుసుకోతగ్గవి' ...న్న పుస్తకం. తెప్పించి చూడండి!

**...మణం. పెరంబూరు, మద్రాసు**

'విప్లవం కావాలని మీతో గొంతు కలుపుతున్నాను' అని రాసి 'అవునేమో ...దేమో' అన్నారట అరుద్ర. అంటే ...ను కన్ఫ్యూజ్ అవుతున్నట్టు అంతా ...నుకోవాలనా? మోసపోం మేం. అయినే ...టో మాకు బాగా తెలుసు.

అయితే తెలిసేనన్నమాట ఈ రాద్ధాంతం అంతా. రాసిన ముక్కలు తమకి సుముఖంగా విడకొట్టి రాసుకుంటే— ఎవరేం అనగలరు రవణగారూ, ఏందుకేనా మంచిది— ఈ కార్డు రాసే ముందర అరుద్రగారి సందేశం పూర్తిగా ప్రచురించమనండి మీవాళ్ళని!

శ్రీకాకుళమే ఆంధ్రదేశం కాదు ఆంధ్రదేశం అంతా శ్రీకాకుళంలోనే వుంది. ఈ నిజాన్ని మీరు గుర్తించారను కుంటాను. జ్వాలాముఖిని శ్రీకాకు ళాంధ్రదేవుని చేశారు. కృతజ్ఞత స్వీక రిస్తారా? అంతటి సంస్కారమా అని మిత్రులు ఆశ్చర్యపోతూంటే అనుమానం ...చ్చి అడిగాను—

...ర్థవాలేదు. కాని జ్వాలాముఖిని కాదు. శ్రీకాకు...ంధ్ర దేవుడన్నది. శ్రీనాధుని మాట ఆ సందర్భంలో శ్రీకాకుళ ఆంధ్రదేవుడు చెప్పి, కృష్ణదేవరాయలని రాయమని ఆదేశించాడని నేనన్నది. అయినా మీ అహంభావానికి హద్దుల్లేవు బాబూ!!.. ఇక కాంప్లి...ంటు తిరస్కరించడానికి నేనేం విరసం అధ్యక్ష...ం మీద ఉన్నానా?! హాయిగా స్వీకరిస్తాను. ...పెలవా?

**వి. డి. జి. ఆర్, అనకాపల్లి**

నే వేసిన ప్రశ్నకి జవాబు దొరక్క కామోసు నాపేరు పుస్తకంలో పడలేదు!

ఇప్పుడు పడిందిగా, మరింక ప్రశ్నించు.

**ఎస్. ఏ. ఆర్, తాడేపల్లిగూడెం**

రా. అ. గరూ. మీకు 'పద్మశ్రీ' యిస్తే, మీకుకల్గే ఆనందం వర్ణించ కలరా?

ఆనందం కాదు. దుఃఖం కల్గుతుంది. ఈ రోజుల్లో ఉట్టి అల్పసంతోషులు మినహా దీన్ని కోరుకోరు. ఇచ్చినా అదో పెద్ద ఘనతగా యెంచరు.

**సి. హెచ్ టి. కొత్తపాడు**

ప్రాణ స్నేహితురాలు దేవుని ఎదుట 'మన స్నేహం ఎప్పుడూ విడిపోదు' అని ప్రమాణం చేసింది. అటువంటి స్నేహం నిలుస్తుందంటారా అక్కయ్యా.

నిలుస్తుందనే అనుకోవాలి చెల్లెలా—దేవుడు కదా—సాక్ష్యం!

**కె. వి. ఆర్, బరంపురం**

మీరు వ్రతాలూ నోములూ చేస్తారా? మీరు ఇంట్లో మడికట్టుకొని వంటు తారా? వంటమనిషి ఉందా?

లాభసాటి అయితే వరలక్ష్మి నోముల్లాంటివి చేస్తాను! మడిసంగతి— వంటా వార్పూ ముగించి మడి కట్టుకుంటాను. నేనుండగా వంట మనిషి ఎందుకు— భలే వారే—మేం జమీందారుల మను కున్నారా? భూస్వాములమనుకున్నారా?

**టి. ఆర్. మొగలవల్లి**

ఎల్లప్పుడు పరులతప్పులనే విమర్శిం చుమా. తన తప్పులను సరిచేసుకోలేని వారిని ఏమనాలి సోదరీ.

రచ్చ గెల్చిన వారు!

**సి. ఆర్. టి. పి పార్వతీపురం**

రచయిత్రి పి. ఆనందారామంపై మీ అభిప్రాయం?

నా [illegible] రచయిత్రి—ఆనంద.

**కె. ఎస్. ఆర్, శ్రీకాకుళం**

మీ డాటర్ త్రయానికి సన్ త్రయాలను వెదకమని మా వూరి పేరయ్యకు రిక మెండ్ చేయమంటారా!

అంత రికమెండేషన్ కేసులు కాదు— నా డాటర్ త్రయం. మీరేం యిబ్బంది పడకండి.

**మూర్తి శ్రీ-జయిసౌజన్య. ఖమ్మం**

మిమ్మల్ని పోసుకోలమ్మగా మార్చిన మహానుభావుల నేమంటే బాగుంటుంది?. (తెలుగు వెలుగులో...)

పోసుకోలమ్మను గురించిన కబుర్లు వేసుకొంటే పేజీల నింపలేని, ప్రజలనీ పాఠకులనీ ఆకర్షించ లేని పత్రిక గురించి ఆలోచించడం అనవసరం.

**జి. వి. ఎస్. ఆర్, విశాఖపట్నం**

మానవునిలో గర్వం ఎక్కువ అయితే ఏం జరుగుతుందండీ?

అంతా మెత్తనివాడని మొత్తుతారు!

**ఎ. బి. ఆర్, వెల్దండ**

దేవుడనే వాడున్నాడా లేడా? ఇంట్లో సంపూర్ణ ఆస్తిక్యం బయట నాస్తి కత్వంతో ఎటూ చేరలేకుండా తికమక పడుతున్న మా జీవన నౌకను మీ దృఢ సమాధానంతో ఒడ్డుకు చేర్చకలరా?

దేవుడనేవాడు ఉన్నాడా? లేడా? అన్నది తేల్చడం అంత సులభమా? మానవాళిలో దేవుడు లేడని నిరూపించాలని, దేవుడున్నాడని నిరూపించాలని తాపత్రయ పడుతూండడం చూస్తూనే ఉన్నాం. నమ్మినవారికి ఉన్నాడు. నమ్మని వారికి లేడు. దాని కింత రాద్ధాంతం ఎందుకు? ఆస్తికత, నాస్తికత అన్నవి వ్యక్తిగతమైనవి. ఇంట్లో పెళ్ళాం ఆస్తికు రాలైతే భర్త నాస్తికుడు కాకూడదని రూలు లేదు, ఆవిడ భక్తిగా మీ నీడ కావాలన్న బాధ మీకుంటే తప్పు? ఆవిడ పూజా పునస్కారాలు మీకేం అడ్డు? మిమ్మల్ని చేయుమని వేధించ నంతవరకు మీరా స్వాతంత్ర్యం ఆమెకి యివ్వలేరా?

**ఎం. ఎ. ఎస్, అనంతపురం**

ఒక రచయిత మనస్సును ఎందుకు గాయపరచారండీ? దేవదాసు ఎందుకు నచ్చలేదు — మీరు ఎన్. టి. ఆర్. పార్టీయా?

బాగుంది వరస. మీబుర్ర ఇన్సూర్ చేయ వలసిందే. నేను ఎన్. టి. ఆర్. పార్టీ కనుక నాగేశ్వరరావు వేసిన దేవదాసు నచ్చలేదని— అంతేగా మీ ఊహ! ఏండొంక తిరుగుడు ఆలో చన?! అయినా ఒక పతితకు నచ్చలేదన్నంత మాత్రాన బతికున్న రచయితలయితే చేయి చేసు కుంటారు గాని పాపం సౌమ్య మూర్తిగా బతికిన శరత్ ఉదారుడు—హాయిగా విమర్శను స్వీక రిస్తాడు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# వనితాలోకం వ్యాసరచన పోటీ!

## 'కుటుంబ నియంత్రణ ఉద్యమం ఎలా సాగుతోంది?'

# మొదటి బహుమతి రు. 250
# రెండవ బహుమతి రు. 200
# మూడవ బహుమతి రు. 150

**ముగింపు తేదీ 30—1—1971**

భూగోళంమీద మానవజాతి సంఖ్య ఇప్పుడు పెరుగుతున్నట్లు పెరిగితే త్వరలోనే ఒకరినొకరు తినవలసి వచ్చేటంత భయంకర పరిస్థితి ఏర్పడగలదని నిపుణులు హెచ్చరిస్తున్నారు!

భారతప్రభుత్వం, దేశంలో ఎందరో ప్రముఖులు ఈ హెచ్చరింపుని పాటిస్తున్నారు. పెద్ద పెట్టున 'కుటుంబనియంత్రణ' పద్ధతులద్వారా జనాభా పెరుగుదలని అరికట్టడానికి ప్రయత్నిస్తున్నారు. 'పరిమిత కుటుంబం' ఉద్యమం మనదేశంలో కొంతకాలంగా సాగుతోంది.

* ఇది ఎంత బాగా సాగుతోంది?
* మన ప్రజలలో అధిక సంఖ్యాకులు కుటుంబ నియంత్రణ సిద్ధాంతాన్ని స్వీకరిస్తున్నారా?
* కుటుంబ నియంత్రణకోసం ప్రభుత్వం అవలంబిస్తున్న పద్ధతులు ప్రజలకి నచ్చుతున్నాయా?
* కుటుంబ నియంత్రణ ప్రచారం ఎలాగ ఉంటోంది?
* కొందరన్నట్లు కుటుంబనియంత్రణ ఉద్యమం పద్ధతులు ఎక్కువగా దుర్వినియోగానికి లోనవుతున్నాయా?
* కుటుంబనియంత్రణ ఉద్యమాన్ని మరింత విజయవంతం చెయ్యటానికి అవసరమయిన విధానాలు ఏమిటి?

ఈ ప్రశ్నలకి సమాధానాలు ప్రపంచాని కంతటికీ ముఖ్యమయినవే; అతిబీద దేశమయిన భారతదేశానికి మరింత ముఖ్యమయినవి! భారతదేశం వనితాలోకం వాటిని పరిశీలించాలి!

తగిన సమాధానాల సూచించాలి!

ఈ వీలు కల్పించటానికే ఆంధ్రసచిత్ర వారపత్రిక వనితాలోకానికి వ్యాసరచన పోటీ ఒకటి ఏర్పాటు చేస్తున్నాము.

వనితాలోకం ఈ పోటీలో పాల్గొని దానిని విజయవంతం చెయ్యగలదని ఆశిస్తున్నాము.

## నిబంధనలు

1. ఈ వ్యాస రచన పోటీ వనితలకే పరిమితము. పురుషులు ఇందులో పాల్గొనరాదు.
2. వ్యాసాలు రెండు అరఠావు పేజీలని మించరాదు. [ఒక అరఠావు అంటే రెండు ఫుల్‌స్కేపు కాగితాలకు పేజీకి రెండింతలు.]
3. కాగితానికి సిరాతో ఒకవైపు మాత్రమే రాయాలి.
4. వ్రాత ప్రతిమీద వనితాలోకం వ్యాసరచన పోటీకి అని స్పష్టంగారాసి ఉండాలి. రచయిత్రి పేరు, పూర్తి చిరునామా ఉండాలి.
5. కవరుమీద వనితాలోకం వ్యాసరచన పోటీ అని స్పష్టంగా రాసి ఉండాలి. పోటీవ్యాసాలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7 తంబుచెట్టివీధి, మదరాసు 1 కి పంపాలిగాని వ్యక్తుల పేర పంపరాదు.
6. వ్రాతప్రతులు ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపబడవు.
7. పోటీలో తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుప బడవు.
8. రచనలు స్వంతమయి ఉండాలి; అనుకరణలూ, అనువాదాలూ పంపరాదు.
9. ముగింపు తేదీ 30—1—1971.
10. వ్యాసరచన పోటీ ఫలితాలు .. 26—3—71 ..తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటిస్తాము.






నూటికి తొంభై అయిదు మంది 'బలపరుస్తున్నారు!!'



జాతీయం చేయడమంటే ఏంది మామా?

ముగ్గురు మూర్ఖులు

మహేష్

'ఒక ఊళ్లో' అంటూ చిదంబరం పంచ్రలావుతో ఏదో చెబుతున్నాడు మాడానుని వెళ్ళేసరికి.

ఒక ఊళ్లో రంగయ్య అనే ఆసామి ఉన్నాడు, అతనికి ఒక కూతురు ఉంది. ఆమెకు పెళ్లి యీడు వచ్చింది. పక్క ఊళ్లో అప్పారావు అనే కుర్రాడు ఉన్నాడు. అతని బంధువులు రంగయ్య వద్దకు వచ్చి, అతని కూతుర్ని అప్పారావుకు యిచ్చి పెళ్లి చేయుమని అడిగారు. 'ఆ విషయం ఆలోచించి చెబుతాను', అని రంగయ్య వారికి సమాధానం యిచ్చాడు.

తరువాత కొద్దిరోజులకు రంగయ్య పక్క ఊరు వెళ్ళాడు. ముందుగా అప్పారావు యింటికి వెళ్లకుండా, అప్పారావు స్థితిగతులను తెల్సుకుందామనుకొన్నాడు రంగయ్య. ఆ ఊళ్లో ఉన్న ఒక షావుకారును రంగయ్య కలుసుకొని యిలాగ అడిగాడు.

'అప్పారావును మీకు తెలుసా? అతను బుద్ధిమంతుడేనా?'

'అప్పారావును నాకు బాగా తెలుసును. అతను బుద్ధిమంతుడే. కాని అప్పుడప్పుడు కారాకిళ్ళీ మాత్రం వేస్తూ ఉంటాడు.' అని షావుకారు సమాధానం యిచ్చాడు.

'కారాకిళ్ళీ వేస్తాడా'?

'అబ్బే. అదైనా యెప్పుడూ వేయడు. ఎప్పుడైనా, సారా తాగినప్పుడే కారాకిళ్ళీ వేస్తాడు.'

'అతను సారా తాగుతాడా?'

'అది కూడా యెప్పుడైనా, లాడ్జిల్లో ఉండే అమ్మాయిల వద్దకు వెళ్లినప్పుడు మాత్రమే తాగుతాడు.'

'ఏమండీ అతను అమ్మాయిల వద్దకు వెడుతుంటాడా?'

'అది యెప్పుడూ ఉండదు లెండి. ఎప్పుడైనా జూదంలో బాగా డబ్బు వచ్చినప్పుడే అక్కడకు వెడతాడు.'

'అయితే జూదం కూడా ఆడతాడా?'

'ఆ! ఎప్పుడైనా, చేతులో బాగా డబ్బు ఉన్నప్పుడే జూదం ఆడతాడు.'

'అయితే అతని వద్ద యెప్పుడూ డబ్బు ఉండదా?'

'ఉండకేమండీ? దొంగతనం చేసినప్పుడల్లా కావలసినంత డబ్బు ఉంటుంది.'

'దొంగతనం కూడా చేస్తాడండీ అతను?'

'దొంగతనం చెయ్యడానికి మాత్రం ఖాళీ యెక్కడుంది? సంవత్సరానికి పది నెలలు జైల్లోనే ఉంటాడు కదా! అయినా కుర్రవాడు బుద్ధిమంతుడు లెండి.' అని షావుకారు రంగయ్యకు సమాధానం యిచ్చాడు.

రంగయ్య ఆ సమాధానం విని, అప్పారావును చూడకుండానే తిరిగి వచ్చివేశాడు.

'అప్పారావుకు అన్ని వ్యసనాలు ఉన్నాయి' అని ఒకేసారి షావుకారు చెప్ప

లేదు. 'అప్పారావు బుద్ధిమంతుడే కాని అప్పుడప్పుడు కారాకిళ్లీ వేసికొంటాడు' అని ప్రారంభించి క్రమంగా అతని వ్యసనాలను షావుకారు బయటపెట్టాడు.

'చూశావా ఆ షావుకారు తెలివి?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'ఒక్క అప్పారావును గురించే కాదు, ప్రస్తుతం మనదేశాన్ని పరిపాలిస్తున్న వారిని గురించి కూడా కొంచెం యించుమించుగా యిదే ధోరణిలో చెప్పవచ్చును?' అన్నాడు చూడామణి.

'మనదేశాన్ని పరిపాలిస్తున్నవారిని గురించి ఈ ధోరణిలో యెలాగ చెప్పవచ్చును?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

నువ్వు యిప్పుడు చెప్పిన షావుకారు దగ్గరకే ఒక విదేశీయుడు వచ్చాడు అనుకొందాం. అప్పుడు వారికి ఈ మాదిరిగా సంభాషణ జరగవచ్చును.

'మీ దేశంలోని పాలకవర్గం ప్రజల శ్రేయస్సుకోసం కృషిచేస్తున్నదా?' అని ప్రశ్నించాడు విదేశీయుడు.

'అబ్బే! మా దేశంలోని పాలకవర్గం ప్రజల శ్రేయస్సుకోసం కృషి చెయ్యకపోవడం యేమిటి? కాకపోతే కొంచెం అహంకారం మాత్రం ఉంది' అని సమాధానం యిచ్చాడు షావుకారు.

'అహంకారాన్ని గురించి అంతగా పట్టించుకోనక్కరలేదు. సమర్థులందరికీ అంతో యింతో అహంకారం ఉంటుంది.'

'అబ్బే, మాదేశపు పరిపాలకుల అహంకారానికీ సమర్థతకూ యేమీ సంబంధం లేదు. వీళ్ళు వట్టి అసమర్థులు.'

'ఒక్కొక్కసారి వివేకులు కూడా అసమర్థులుగా భావింపబడుతుంటారు. వివేకవంతులు ఒకే విషయాన్ని యెన్నో విధాలుగా ఆలోచిస్తుంటారు. అందుచేత తొందరగా యే విషయాన్ని గురించి ఒక నిర్ణయానికి రాలేరు. కాబట్టి వారిని ఒక్కొక్కసారి అసమర్థులుగా భావింపవచ్చును' అన్నాడు విదేశీయుడు.

'మీరు చెప్పినది యితరుల విషయంలో నిజం కావచ్చును. కాని మా దేశాన్ని ప్రస్తుతం పరిపాలిస్తున్నవారు పూర్తిగా వివేకహీనులు.'

'వివేకం లేకపోయినా, ఫరవాలేదు. తమ చేతిలో ఉన్న అధికారాన్ని కేవలం ప్రజల శ్రేయస్సుకే ఉపయోగిస్తున్నట్లయితే, వారిని సహించవచ్చును' అన్నాడు విదేశీయుడు.

'అబ్బే, అదేమీ లేదు. అధికార దుర్వినియోగం మా దేశపు పరిపాలకుల జన్మహక్కుగా పరిగణింపబడుతున్నది'. 'అయినా మా పరిపాలకులకు ప్రజాస్వామ్యంలో ప్రగాఢమైన విశ్వాసం ఉంది' అని సమాధానం యిచ్చాడు షావుకారు.

'ఇన్ని అవలక్షణాలు ఉన్న పరిపాలకులు

# ముగ్గురు మహార్షులు

ప్రజల శ్రేయస్సుకోసం యేమిటి కృషి చేస్తారు?' అని అనుకొంటూ ఆ విదేశీయుడు వెళ్లిపోయాడు.'

'ఇక్కడ కూడా ఒక్క అహంకారం మాత్రం ఉన్నది అంటూ షావుకారు ప్రారంభించి మిగిలిన అన్నింటిని గురించి చెప్పవచ్చునుగదా?' అని మన దేశాన్ని ప్రస్తుతం పాలిస్తున్న వారిని గురించి వివరించాడు చూడామణి.

'నీ వివరణ బాగానే ఉంది కాని మన పాలక వర్గానికి అహంకారం, అసమర్థత, అవివేకం, అధికార దుర్వినియోగం అనే నాలుగు అవలక్షణాలు ఉన్నాయి అని చెప్పావు. ఇటువంటి విషయాలను గురించి ఆషామాషీగా చెప్పడం సరియైనది కాదు. సరియైన ఉదాహరణలను యివ్వాలి' అన్నాడు చిదంబరం.

'మనదేశపు పాలక వర్గానికి అహంకారం ఉన్నది' అనడానికి ఉదాహరణ యేమిటి? అని చంద్రలాను ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఢిల్లీకి రాష్ట్ర ప్రతిపత్తి కావాలి' అనే కోరే నిమిత్తం కొంతమంది ఢిల్లీ పుర ప్రముఖులు 7—12—1970 తేదీని ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ వద్దకు వెళ్ళారు. 'ఢిల్లీకి రాష్ట్ర ప్రతిపత్తి కావాలి' అనే విషయాన్ని వారు ప్రస్తావించారు. వెంటనే ఇందిరాగాంధీ 'ఢిల్లీకి రాష్ట్ర ప్రతిపత్తి యివ్వకూడదని ప్రభుత్వం నిర్ణయించింది. మీరు ఆందోళన చెయ్యాలనుకొంటే ఆందోళన చెయ్యండి బెదిరింపులకు నేను జంకను' అని కోపంగా అన్నది.

'ఆందోళన విషయం మేము మాట్లాడలేదు. అయినా యీ ప్రభుత్వం ఆందోళనలకు లొంగి ఆంధ్రరాష్ట్రం, నాగాలాండ్, మేఘాలయ మొదలైనవాటిని యేర్పాటు చేయలేదా?' అని ఒక సభ్యుడు అన్నాడు.

దానితో ఆమె, మరింతకోపంగా 'మీకు యేమీ తెలియదు' అని అంది.

ఈ సంఘటన మనదేశపు పాలక వర్గానికి గల అహంకారానికి ఉదాహరణ కాదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'సరే, అహంకారం సంగతి విషయం. మరి అసమర్థతమాట యేమిటి? అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

ఈ పాలకవర్గం సుమారు యిరవై మూడు సంవత్సరాల నుంచి అధికారంలో ఉంది. ఈ కాలంలో ప్రజల జీవితం నానాటికి దుర్భరమై పోతున్నది. మన దేశపు సరిహద్దులను కూడా యీ ప్రభుత్వం కాపాడలేక పోయింది. ఇది ప్రభుత్వం యొక్క అసమర్థతకు ఉదాహరణ కాదా?

'అయినా వీటికన్నింటికంటె ముఖ్యమైన విషయం మరొకటి ఉంది. ప్రస్తుతం పశ్చిమ బెంగాల్లో యేమిటి జరుగుతున్నదో ఆలోచించు. అక్కడ రోజూ యెన్నో హత్యలు, బాకుపోట్లు, బాంబులు విసరడం జరుగుతున్నాయి. దీనికంతటికి బాధ్యత యెవరిది? పశ్చిమ బెంగాలు ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వ పరిపాలన లోనే ఉంది. అందులోను దేశ హోంశాఖను ప్రధానమంత్రిణి ఇందిరాగాంధియే నిర్వహిస్తుంది.

'పశ్చిమబెంగాల్లో యిటువంటి అరాజక చర్యలు కొన్ని నెలలనుంచి జరుగుతున్నా, వీటిని కేంద్ర ప్రభుత్వం అరికట్టలేక పోయింది. మనదేశపు పరిపాలకుల అసమర్థతకు యింతకంటే ఉదాహరణ వేరే కావాలా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'తరువాత అవివేకం సంగతి యేమిటి?' అని చంద్రలాను ప్రశ్నించగా చూడామణి మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

1968 వ సంవత్సరం జూలై 24 వ తేదీని ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ రాజ్యసభలో మాట్లాడుతూ 'ఒక దేశాన్ని నమ్మడం వల్లగాని ఆదేశపు స్నేహాన్ని విశ్వసించడం వల్లగాని మనకు హాని కలిగింది అనే వాదాన్ని ఆమె తిరస్కరించింది. ఆ సందర్భంలో ఆమె యిలాగ అంది 'చైనా మనకు ద్రోహం చేసింది' అని కొందరు అంటున్నారు చైనాతో మనం స్నేహంగా ఉండలేదు అని అనుకొందాం. అప్పుడు మాత్రం చైనా మన మీద దండయాత్ర చెయ్యదా?' అని ఆమె

ప్రశ్నించింది.

'ఇది యెంత అవివేకమైన ప్రసంగమో ఆలోచించు. చైనాతో మనం స్నేహంగా లేక పోయినట్లయితే మన సరిహద్దుల విషయంలో మనం మరింత జాగ్రత్తగా ఉండేవారం. ఆ పరిస్థితిలో చైనా మన సరిహద్దు మీద దండయాత్ర చేసే ప్రమాదం నిజంగా తగ్గి ఉండేది.

'పంచతంత్రంవంటి పుస్తకాన్ని చదివిన విద్యార్థికి కూడా యీ మాత్రం వివేకం ఉంటుంది. ఇటువంటి సామాన్యమైన వివేకం కూడా లేకుండా ఆమె ప్రసంగించింది.

'ఇంతేకాదు. 1969 వ సంవత్సరంలో ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ బ్యాంకుల్ని జాతీయం చేసింది. బ్యాంకుల్ని జాతీయం చేయడాన్ని ప్రజల్లో నూటికి తొంభై అయిదు మంది బలపరుస్తున్నారని ఆమె అంది.

'మన దేశప్రజల్లో సగం మందికి అక్షరజ్ఞానమే లేదు. అటువంటప్పుడు బ్యాంకుల్ని జాతీయం చెయ్యడం వలన కలిగే లాభనష్టాలను ఊహించగల శక్తి మన ప్రజలో నూటికి పదిమందికైనా లేదు. అసలు ఒక చర్య తీసికోవడం వలన కలిగే లాభనష్టాలను గురించి ఊహించే శక్తి కనీసం ప్రజల్లో సగం మందికి లేదుకదా! అలాంటప్పుడు నూటికి తొంభై అయిదుమంది, బ్యాంకుల్ని జాతీయం చెయ్యడాన్ని బలపరుస్తున్నారు' అని ఆమె అనడం అవివేకం కాదా? బ్యాంకుల్ని జాతీయం చెయ్యడం మంచిదా? చెడ్డదా అన్నది వేరే విషయం' అన్నాడు చూడామణి.

'సరే; యిక అన్నిటికంటే ముఖ్యమైన అధికార దుర్వినియోగం మాట యేమిటి?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు

ప్రధాన మంత్రిణి ఇందిరాగాంధీ కుమారుడైన సంజయ గాంధీకి చిన్న కారులు తయారు చేయడానికి లైసెన్సు యిచ్చేందుకు ప్రభుత్వం సిద్ధపడుతున్నది. దేశంలో ఉన్న యెంతో మంది పారిశ్రామికుల్ని కాదని ప్రభుత్వం సంజయ గాంధీకి యెందుకు లైసెన్సు యివ్వబోతున్నది. ప్రధాన మంత్రిణి

# ముగ్గురు మహార్షులు

కుమారుడు కావడం తప్ప సంజయ గాంధీకి వేరే అర్హత యేదైనా ఉన్నాదా? ఇది అధికార దుర్వినియోగం కాదా?

ఇంతకంటే ముఖ్యమైనది మధ్యంతర యెన్నికల విషయం. 'అసలు యింతకూ యిప్పుడు మధ్యంతర యెన్నికలు జరప వలసిన అవసరం యేమిటి వచ్చింది?' అని ప్రశ్నించాడు చూడామణి.

'ఇప్పుడు ప్రధాన మంత్రిణి ఇందిరా గాంధీకి ప్రజల్లో చాలా పలుకుబడి ఉంది. ఈ మధ్యను అక్కడక్కడ జరిగిన ఉప యెన్నికల్లో అధికార కాంగ్రెసుపార్టీ గెల వడమే దానికి నిదర్శనం' అంటూ చంద్రలావు తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఈ పలుకుబడి 1972వ సంవత్సరం వరకు ఉండకపోవచ్చును. అందు లోను 1971వ సంవత్సరం బడ్జెటులో పెద్దలోటు ఉండవచ్చును. ఆ లోటును భర్తీ చెయ్యడానికి అదనపు పన్నులను విధించవలసి వస్తుంది. ఆ పన్నులను విధించడం వలన ఇందిరాగాంధీకి ప్రజల్లో గల పలుకుబడి తగ్గిపోతుంది. ఈ విష యాన్ని అధికార కాంగ్రెసు నాయకులు పదేపదే చెబుతున్నారు?

ముఖ్యంగా యీ కారణం వల్లనే ప్రధాన మంత్రిణి ఇందిరాగాంధీ లోక్‌సభను రద్దు చేయించి, మధ్యంతర యెన్నికలను తీసికొని వచ్చింది. అయినా యిదేమీ తొందరపడి తీసికొన్న నిర్ణయం కాదు. మధ్యంతర యెన్నికలను జరపడంవలన కలిగే లాభనష్టాలను యెన్నో నెలలుగా ఆలోచించి ఆమె ఈ నిర్ణయం చేసింది' అన్నాడు చంద్రలావు.

'మధ్యంతర యెన్నికలను జరపడానికి గాను ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ యెన్నో నెలలపాటు ఆలోచించింది' అనగనే నాకు ఒక డాక్టరుమాట జ్ఞాపకం వచ్చింది' అన్నాడు చూడామణి.

ఏమిటి ఆ డాక్టరుమాట అని చంద్రలావు ప్రశ్నించాడు.

'ఒక డాక్టరు యెన్నో ఆపరేషన్లు చేశాడు. ఒకసారి ఆ డాక్టరే ఒక ఆప రేషను చేయించుకోవలసి వచ్చింది. తరు వాత ఆ డాక్టరు తన దగ్గరకు వచ్చిన వారితో యిలాగ అంటూ ఉండేవాడు'.

'నేను యెన్నో ఆపరేషన్లు చేశాను గాని నా ఆపరేషనుకు పొందినంత బాధ యే ఆపరేషనుకూ పొందలేదు' అని డాక్టరు మాటను వివరించాడు చూడామణి.

'నువ్వు చెప్పిన డాక్టరు మాటకు యిందిరాగాంధీకి సంబంధం యేమిటి?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఆ డాక్టరు ఆపరేషన్లు చేసినప్పుడు ఆ బాధను యితరులు పొందరు అందు చేత అప్పుడు బాధ సంగతి డాక్టరుకు తెలియలేదు. తనే స్వయంగా ఆపరేషను చేయించుకొన్నప్పుడు ఆబాధను తానే పొందాడు కాబట్టి బాధ సంగతి అప్పుడు డాక్టరుకు తెలిసింది.'

'ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ యిది వరకు గంటలమీద బ్యాంకుల్ని జాతీయం చేసింది. రాజభరణాలను రద్దుచెయ్యడానికి రాజ్యసభ తిరస్కరించింది. అయినా ఇందిరాగాంధీ నిమిషాలమీద రాజభరణాల రద్దు ఆర్డరును చేసింది. కాని మధ్యంతర యెన్నికలను జరిపే నిర్ణయం చేయడానికి ఇందిరాగాంధీ కొన్ని నెలలపాటు ఆలో చించింది. దీనికి కారణం యేమిటి?

'బ్యాంకుల్ని జాతీయం చెయ్యడం వల్లనూ రాజభరణాలను రద్దుచెయ్యడం వల్లనూ కలిగే లాభనష్టాలతో ఆమెకు వ్యక్తిగతంగా సంబంధం యేమీ లేదు. ఆ లాభనష్టాలను పొందేవారు యితరులు' కాబట్టి ఆ విషయాల్లో ఇందిరాగాంధీ చాలా చురుకుగా వ్యవహరించింది.

'మధ్యంతర యెన్నికల విషయం అటు వంటిది కాదు. ఈ యెన్నికల ఫలితాలమీద ఆమె భవిష్యత్తు ఆధారపడి ఉంది. అందుచేత ఈ యెన్నికలను గురించి ఒక నిర్ణయం చెయ్యడానికి ఆమె నెలల తరబడిని ఆలోచించింది. కాబట్టి యిది వరకు నేను చెప్పిన డాక్టరు మాటకు, యిందిరాగాంధీ ప్రవర్తనకు తేడా యేమిటి ఉంది ?

'1971వ సంవత్సరంలో మధ్యంతర యెన్నికలు జరిపినట్లయితే అధికార పక్ష కాంగ్రెసుకు యెక్కువ స్థానాలు లభించ వచ్చును. 1972వ సంవత్సరం వరకు ఆగితే యిన్ని స్థానాలు రాకపోవచ్చును',

అనే ప్రధాన కారణం వల్లనే కదా, ఇందిరాగాంధీ ఇప్పుడు మధ్యంతర ఎన్నికలు జరపడానికి నిర్ణయించింది.

'కేవలం పార్టీ ప్రయోజనం కోసం, కోట్లాది రూపాయలు ఖర్చు అయ్యే మధ్యంతర ఎన్నికలను దేశం మీద రుద్దడం అధికార దుర్వినియోగం కాదా?'

'సామాన్య పౌరులకు కావలసినవి శాంతిభద్రతలే కాని మధ్యంతర ఎన్నికలు కావుకదా! దేశంలో శాంతిభద్రతలను కాపాడడంలో విఫలమైపోయిన ప్రధాన మంత్రిణి ఇందిరాగాంధీ మధ్యంతర ఎన్నికలు జరిపి దేశాన్ని ఏదో ఉద్ధరిస్తాను అనడం హాస్యాస్పదం కాదా?

'1972 వరకు ఆగినట్లయితే ఆమె ఋచ్ఛ విధానాల బండారం బయట పడుతుంది. అప్పుడు ఆమె పార్టీ ఎన్నికలో గెలిచే అవకాశం ఉండదు. అందుచేత ఆమె 1971లోనే ఎన్నికలు జరపడానికి నిర్ణయించింది. ఇది ప్రజలను మోసం చెయ్యడం కాదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'ఇప్పుడు ఆమెకు లోక్‌సభలో మెజారిటీ లేదు కాబట్టి మధ్యంతర ఎన్నికలు జరపడానికి ఆమె నిర్ణయించింది. ఇది ప్రజాస్వామ్యానికి అనుగుణంగా లేదా?' అని ప్రశ్నించాడు చంద్రరావు.

'గత సంవత్సరం కాంగ్రెసుపార్టీ విడిపోగానే ఆమెకు లోక్‌సభలో మెజారిటీ పోయింది. ప్రజాస్వామ్య సూత్రాలను బట్టి అయితే అప్పుడే మధ్యంతర ఎన్నికలు జరిపి ఉండవలసి ఉంది. కాని అలాగ జరపలేదు'

'కేవలం తన స్వార్థంకోసం తన పార్టీ ప్రయోజనం కోసం దేశంమీద మధ్యంతర ఎన్నికలను రుద్దడం, అధికార దుర్వినియోగం కాదా? అవకాశం కాదా?' అని తిరిగి ప్రశ్నించాడు చూడామణి.

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన వాళ్ళూ అతన్ని అనుసరించారు. ●




## ప్రయాణం వికారం

ప్రయాణాలలో మీకు వికారం, వాంతి రావటం ఉందా?

ఉంటే, మీలో ప్రత్యేకత ఏదీ లేదన్న మాటే! అంతరిక్ష నావికులలో కూడా ఇటువంటి వారు ఉన్నారు. మిగతా మామూలు జనంలో 98 శాతందాకా నావలు, విమానాలు, కార్లలో వికారం, వాంతులు వచ్చే వారు ఉన్నారు.

అసలే ఈ ప్రయాణపు వికారం లేనివారి శరీరంలో ఒక ఇంద్రియం సరిగ్గా లేదన్న మాట. చెవులలో అర్ధచంద్రాకారంగా ఉండే ఇంద్రియాలు రెండు చెడిపోతే ప్రయాణం వికారం రాదు.

ఈ వికారం మగవారికన్నా ఆడ వారికి అధికంగా వస్తుంది, పెద్దవారికన్న పిల్లలకి ఎక్కువ వస్తుంది. వయసు పెరిగిన కొద్దీ వికారం తగ్గుతుంది కూడా!

ఎందుకని ఇదంతా?

మన నిలకడ ఇంద్రియాల ప్రయోజనం తగ్గిపోయింది. ఇవి నడిచి, పరిగెత్తి, చెట్లు ఎక్కే జంతువు కోసం ఉన్నవి. కాళ్ల మీద నడిచినంత సేపూ బాగా పని చేస్తాయి.

### తప్పేది ఏమిటి?

అయితే మనం ఏదయినా స్వారీ చేస్తే అంతా తప్పి పోతుంది.

మన దేహం అంగాల ప్రయత్నం మీదనే కదలిక ఉన్నంతసేపూ కంటిచూపుకీ, నిలకడని తెలిపే ఇంద్రియానికీ అన్వయం కుదురుతుంది.

కదలిక వాహనాలవల్ల అయితే అన్వయం కుదరక వికారం కలుగుతుంది.

కొందరికి కదులుతున్నవాహనంలో ఏదయినా చదువుతూ ఉంటే కళ్ళు ఇతరంగా పని చెయ్యటం వల్ల దేహం కదలికలని గమనించదు. దేహం మాత్రం కదిలి, చెవిలోపల ఇంద్రియం కదలికలని గమనించటంతో ఘర్షణ ఏర్పడుతుంది!

### భయం కాదు

సినిమాలో తల తిరిగించే దృశ్యాలని కూర్చుని చూసినా మనకి కొంత ఇబ్బందిగా ఉంటుంది. మనం కదలటం లేదని చెవిలో ఇంద్రియానికి తెలుసు. కళ్ళమాత్రం కదిలికలని ఒక విధంగా అనుభవిస్తాయి! మళ్లీ ఘర్షణ.....

అందుకనే, ప్రయాణం వికారం వచ్చేవారికి భయం ఎక్కువ అనుకోనటం పొరపాటు.

ఉదాహరణకి, బ్రిటిషు నౌకా నాయకుడు నెల్సన్‌కి నోడలో ప్రయాణం చేస్తే వికారం వచ్చేది! అతను పిరికివాడని ఎవరనగలరు?

### నియమం

ప్రయాణం వికారం లేకుండా ఉండా లంటే?

మాత్రలు వేసుకోవచ్చు. కాని, మరొక పద్ధతి ఉంది. వీలయినంత దాకా తలని ఆడించకుండా ఉంచాలి. కారులో అయితే తల ఆనించే హెడ్ రెస్ట్ బిగించుకోనవచ్చు. లేదా ముందు కనిపించే రోడ్డు మీదనే దృష్టిని లగ్నం చెయ్యవచ్చు. [కారునడిపే వారికి సాధారణంగా వికారం రాదు. గమనించారా?]

లేదా, పడుకోవచ్చు! అదీ వీలు కాకపోతే భూమ్యాకాశ మధ్యరేఖనే చూస్తూ కూర్చోవచ్చు.....

ఏదీ పని చెయ్యక పోతే మంచి విషయాలని గురించి ఆలోచించటం మంచిది. కడుపులో తిప్పటం గురించి బాధపడి లాభం లేదు.....

# అయ్యప్ప మహాత్మ్యం

కొట్టాయానికి చెందిన ముండకాయం గ్రామ వాసి పురుషోత్తమన్ అనే అతని కూతురు పుట్టుక నుంచీ మూగదట. ఇప్పు డామెకు ఏడేళ్ళట. ఈ ఏడేళ్ళూ ఆయనఅనేక వైద్యాలు, విఫలయత్నాలు చేసి, విసిగి, చివరికి శబరిమల అయ్యప్పన్‌కు మొక్కారట. వెంటనే ఆమెకు మాటలాడే శక్తి వచ్చేసిందట. కెన్ననూరుకు చెందిన 'నాను' అనే 12 ఏళ్ళ మూగ కుర్రాడికి కూడా ఆ దేవాలయంలోనే మాట్లాడే శక్తి వచ్చిందట.

## ఎం. ఎల్. ఎ. హాసల్‌లో అమ్మాయి అరెస్టు!

డిశంబరు నాలుగో తేదీన బొంబాయి యమ్మెల్యే హాస్టలు 418 వ నెంబరు రూములో



కె. ఎస్. పటేల్ అనే ఆయన దిగారట. మూడ్రో జయ్యాక, డిశంబరు ఏడో తేదీ రాత్రి గులాబ్ వ్ వోంకార్ పాటిల్ అనే ఆయన రాధాభాయి శివ్‌బావల్‌కు చెందిన వేశ్య అనే ఆమెను ఆ ముకు తీసుకువెళ్ళారట. కాపలాదార్లూ, టెలిఫోన్ పరేటరు ఇది చూసి ఏమిటి..... అని అడిగ టిల్‌గారు మండిపడ్డారట. 'అప్పటికి ఊళ్ళోని క వారి విషయం పోలీసులకు తెలియజేస్తే ?) అమెను అరెస్టు చేశారట. ఈ విష

# ఒక వారం విపరీతం
### ఫాలాక్షుడు

యాన్ని మహారాష్ట్ర ఎసెంబ్లీలో మంత్రి వైరేల్ తెలియజేశారట—ఆయుపిమ్మ 'ఏమయ్యిందో తెలీదు'

* * *

1970—71 వ సంవత్సరంమొదటి ఆరు నెలల్లో సిటీబస్సులు ఢిల్లీ నగరంలో నడిపినందుగ్గాను 78 లక్షల రూపాయలు నష్టం వచ్చిందట. ఈ విషయం ఆసంస్థ—ఢిల్లీ ట్రాన్స్‌పోర్టు యూనియన్ (డి. టి. యు.) డిప్యూటీ ఛైర్మన్ మదన్‌లాల్ ఆబ్సాన్ అన్నారట— దటీజ నాచురల్.

## కారులో 20 లక్షల బంగారం!

ఉత్తర బొంబాయి గోడ్‌బందర్ ప్రాంతంలో ఓ కారుని అనుమానించి పోలీసులు, కస్టమ్స్‌శాఖవారు తనిఖీ చేస్తే 20 లక్షల కిమ్మత్తయిన బంగారం బయటపడిందట.

## వేరుశనక్కాయలబస్తాలో విదేశీబంగారం!

వేలూరుకు చెందిన కలవై అనే గ్రామంలో జయమ్మ అనే ఆమె ఇంటి మీద పోలీసుశాఖ దాడి జరిపిందట. ఇల్లంతా వెతికినా అనుకున్న విషయం ఎక్కడా కనుపించలేదట. ఇదేమా అని ఆశ్చర్యంతో ఓ వేరుశనక్కాయల బస్తా విప్పి ఒలకబోస్తే అందులో 20 వేల ఖరీదు చేసే విదేశీ బంగారం వుందట. ఏ సంచిలో ఏమున్నాదో ఎవరికెరుక!! వెతికితే గాని తెలీదు.

## భార్యాబిడ్డలని భగవంతునికి నైవేద్యం

వెస్ట్ జర్మనీ శాంతాక్రజులో 59 ఏళ్ళ ఆయన తన కొడుకు సహాయంతో తన భార్యనూ, 15—18 ఏళ్ళ ఇద్దరు కూతుళ్ళను భగవంతునిక్కి నైవేద్యం పెట్టాడట. అదేమంటే, 'మేము భగవంతుని బిడ్డలు అనే జాతికి చెందినవారం. మా జాతిలో భగవంతుని కీవిధంగా నైవేద్యం (చంపడం) పెట్టినవారు నిజంగా దేముని బిడ్డలవుతారు. పైగా యీ పని నేను భగవంతుని కోర్కె ప్రకారమే చేశాను—యస్ ఐ డిడిట్'అన్నాడట.

## కాళ్ళ దగ్గరికొచ్చిన కరెన్సీ

మాన్‌చస్టర్‌లో రోడ్డు మీద నడుస్తున్న ఆంగ్లీ గ్రిఫెన్ అనే ఆమె వున్నట్టుండి శాంతాక్లజ నిజంగా చాలా గొప్పవాడు అని అబ్బురపడిందట. ఆమె, ఆమె సోదరుడు విథంగ్టన్ రోడ్డు మీద నడుస్తుండగా 5 పౌనుల కరెన్సీ నోట్లొచ్చి వారి పాదాల ముందు వాలిందట. హి: వాట్ జ్విన్ అని ఆశ్చర్యపోయేలోగా గలగల అలాంటి నోట్లే బోలెడు వచ్చేసి వాలాయట. ఆశ్చర్యానందాలతో ఆ నోట్లన్నీ ఏరి బొత్తి పెట్టేసరికి పోలీసులు వచ్చారట తీసుకుపోడానికి. ఓ కారు డ్రయివరు డబ్బు పెట్టి తన కారు నెత్తి మీద పెట్టి ఆ సంగతి మరచిపోయి, కారు తోలుకపోతుంటే పైనున్న పెట్టెలోంచి నోట్లు ఎగిరి ఆ అక్కా తమ్ముళ్ళ మీద వాలాయట. ఈ చర్యలో శాంతాక్లజ ప్రభావం, మహిమ ఏదీ లేదని పోలీసులు



పొల్లాడి చేసి, ఆ నోట్లు పట్టుకు వెళ్ళిపోయారట— వ్యాడ్లక్!!

## న్యూయార్కులో శ్రీ వెంకటేశ్వరాలయం

న్యూయార్కులో శ్రీవెంకటేశ్వర స్వామి, ఆలయం నిర్మించబోతున్నారని, ఆ సందర్భంలో తిరుమల తిరుపతి దేవస్థానం వో లక్ష రూపాయలు విరాళంగా ఇవ్వబోతున్నదని దేవాదాయశాఖ మంత్రి రామకృష్ణరాజా అన్నారట. అక్కడ సుప్రభాతం ఇంగ్లీషులో పాడతారా!!

* * *

కుటుంబ నియంత్రణ చెయ్యి అని చెప్తే వింటారు కనుక మనుష్యులకే చెప్తున్నారు గానీ, జంతు జాలాలకూ, పశుపక్ష్యాదులకూ ఎలా చెప్తారు! ఏం చేస్తారు!! ఎలుకలు!! నల్లులు, బొద్దింకలు— బాబో కోతుల్లు— భువనేశ్వర్ చుట్టుపక్కల అడవులలో ఏనుగు సంతతి మితిమీరిపోయిందని దానివల్ల అవి తమ స్థానాలను విడచి, యిష్టా రాజ్యంగా తిరగడం వల్ల పంటలు నాశనమవడమే గాక, వాటి కాళ్ళ క్రింద మనుష్యులు కూడా పడి ఘోరంగా చనిపోతున్నారని ఒరిస్సా ప్రభుత్వ అటవిక సంబంధంశాఖ ఎరుకపరచిందట— హఠాటు ప్లాన్!!

## లైట్స్ ఆన్

డిశంబరు 22వ తేదీన కోసిపూర్ కలకత్తాలో సి. పి. ఐ.కి చెందిన వారని అనుమానింపబడే ముగ్గురు వ్యక్తులు 21 ఏళ్ళ నిజామ్ షా అనే అతన్ని చంపేశారట. బహుశా ఓజాన్ఖికి నక్సలైటులకు చెందిన వ్యక్తి అయ్యుండవచ్చని పోలీసు అనుమానం. సెంట్రల్ కలకత్తా మహాత్మా గాంధి రోడ్డు, పోటువతోలా ప్రాంతంలో నక్సలైటు లనబడే వ్యక్తులు ట్రాముల మీద బాంబులు విసిరారట. 27 వ తేదీ రాత్రి తన డ్యూటీ ముగించుకుని గృహోన్ముఖుడైన రామచందర్ అనే పోలీసు సబ్ఇనస్పెక్టర్ను ఆయన జేబులో 15 రూపాయలు లాక్కుని పారిపోయారట. ఆయన కేక పెట్టేసరికి బీటు పోలీసులు వచ్చి, పోతున్న వారిలో ఒకర్ని పట్టుకోగలిగారట. రాజధాని వింత. కలకత్తా దురాపూరులో సెంట్రల్ ఇండస్ట్రియల్ సెక్యూరిటీ ఫోర్సు గార్డును నక్సలైటులని అనుమానింపబడే వ్యక్తులు 25వ రాత్రి చంపేశారట. నార్త్ కలకత్తా బుటో ప్రాంతంలో ఇంటికి తిరిగివస్తున్న శంకర్ భూగోస్వామి అని ఆయన్ను నక్సలైటులనబడే వారికి చంపేశారట. ●



# అతని లక్ష్యం

గుళ్లపల్లి సుందరమ్మ

### జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ల ముద్దుల మరదల సుధ. సుధ కుంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు. ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. సుధ తండ్రి యుద్ధానికి ఎలా బలి అయిపోయిందీ జానకమ్మ వివరించి చెబుతుంటే పార్వతమ్మ, వేణు ఆసక్తిగా విన్నారు. తండ్రి మరణాన్ని తలచుకుని బాధపడింది సుధ. రాజమ్మగారు సుధని చూసినప్పుడల్లా కుంటిపిల్ల అని ఎత్తిపొడుపుగా మాట్లాడుతుంది. సుద బాధపడుతుంది.

## 4

ఆ మధ్యాహ్నం భోజనానికి బాగా ఆలస్యంగా వచ్చిన రఘు, 'ఎప్పుడూ తన రాక కెదురుచూస్తూ సావిట్లోనే తచ్చాడుతుండే సుధ. ఇవాళ కనిపించదేం!' అనుకుంటూ కాళ్లూ చేతులూ కడుక్కుని లోపలికొస్తూ గదిలో పరుపు చుట్టలకి జేరబడి నిద్రపోతున్న సుధనిచూసి మెల్లగా లోపలికెళ్లాడు.

తడి మెరుస్తున్న కనురెప్పలూ! బుగ్గలమీది కాటుక చారికలూ, కంట తడిపెట్టడ మేవిటో ఎరగని సుధ ఇవాళ ఏడ్చిందీ, అంటే అందుక్కారణం ఏమై వుంటుందో, క్షణంలో ఊహించుకున్న రఘుకి కోపంతో ఒళ్లుడికి పోయింది. [illegible]గా హాల్లోకెళ్లి కూర్చుంటూ అక్కడే వున్న వేణు నడిగాడు. అన్నీ ఉన్నట్టు చెప్పకపోయినా రాజమ్మగారి విరగబాటుని గురించిమాత్రం తు.చా తప్పకుండా చెప్పేశాడు, పేపరు పట్టుకునున్న పళాన్నే కునికిపాట్లు పడుతూన్న దత్తుగారి పక్కని వో పుస్తకం పట్టుకు తనూ కూర్చున్నవేణూ. వేణు జరిగినవన్నీ పరకాయిస్తూన్నట్టు, అంతవరకూ ఎవ్వరికీ తెలియనే తెలియదు.

'భోజనానికి రాబానా?' ఏవీ జరగనట్టు మొహం తుడిచేసుకుని నవ్వుతూ వొచ్చిన సుధని చూడ్డంతోనే ఇక అప్పుడా ప్రసక్తితేవడం ఇష్టంలేక మామూలుగా భోజనం ప్రారంభించాడు రఘు.

ఈలోగా నిద్రకానిచ్చి లేచిన రాధ తనవాళ్లంతా ఇంకా నిద్రపోతూన్నందున ఏమీ తోచగ డాబామీద అటూ ఇటూ తిరుగుతూ యాదాలాపంగా, మండువాలోంచి కిందికి చూసింది. సరిగ్గా అదే సమయానికి వరండాలోని 'సిన్క్' వద్ద చెయ్యి కడుక్కుంటున్నాడు రఘు. తెల్లని బట్టల్తో, ఆజానుబాహువైన రఘుని చూడ్డంతోనే 'అబ్బ? రోహిణి చెప్పినట్టు ఇతనెంత అందగాడో?' అనుకుంది పరవశమయి పోతూ రాధ, దబ్బున మునిగోళ్లతో, రేగినజుట్టుని సరిచేసేసుకుని చీరే, పవిటే, మరోసారి సర్దుకున్నాక మళ్లీ వంగిచూసింది.

'చెయి తుడుచుకుందుకు తువ్వాలందిస్తూన్న సుధకి దగ్గరగా నిలబడి లాలనగా ఏదో అడుగుతున్నాడు రఘు. సమాధానం చెప్పడానికి సిగ్గుపడుతూ, తలొంచుకుని నవ్వుతూంది సుధ. ఆ దృశ్యం చూసేసరికి. అర్థంలేని అసూయతో సుధయందొక విధమైన ఈర్ష్య ప్రారంభయింది రాధ మనసులో...'తన కడ్డంగా ఈ కుంటిదెక్కడ దాపురించిందా' అనుకుని మొదట్లో అంతలా అసూయపడ్డా ఒకచోటే పెరుగుతూన్న మేనత్త మేనమామ పిల్లలు చనువుగా వుండడంలో తనకెందుకు మధ్య ఈ ఈర్ష్య' అనుకుంటూ మళ్లీ తనకి తనే సమాధానపెట్టుకుంటూ. వాళ్లు లోపలి కెళ్లిపోగానే తనూ చరచరా గదిలో కెళ్లిపోయింది రాధ.

రాధ గదిలో వెళ్లేసరికి — అంతకుముందే లేచి, మధ్యాన్నపు తమ ప్రవర్తనల్లో ఒకరిలోపా లొకరుచెప్పి వాదించుకుంటున్నారు దత్తూ, రాజమ్మగార్లూ. 'అబ్బబ్బ, ఆ అబ్బాయి తీరా మళ్లీ బయటకెళ్లిపోతాడో ఏవో, ఒచ్చినప వొదిలి వాళ్లకిప్పుడే దెబ్బలాటెక్కడ కావల్సొచ్చిందో?' అనుకుని రాధ మనసు తహతహ పడుతూంది.

'అయినా మనం వచ్చామని తెలిసుండీ, మర్యాదకన్నా రాలేదేం ఆ కుర్రాడూ,' వాదన అయ్యాక రాజమ్మగారే ప్రారంభించింది.

'చదివేది డాక్టరుకిగా. ఏదిన్నా అద్భుతమైన ఆపరేషన్ గనక వుందంటే అదంతా చూస్తేనేగని మరోపని కెళ్లరు. ఆదీగాక మనం ఈ విషయంగా వచ్చినట్టు అతనికేం తెలుసూ.

'బాగుంది మీరనడం. మనవద్ద పిల్లా వారివద్ద పిల్లాడూ వున్నప్పుడింకెందు కొస్తావనుకుంటారూ? అదీగాక మన మురళీ అన్నా చెప్పుండడూ అతనో టే!,

'అంతా నీలాగే సూక్ష్మంగా గ్రహించేస్తే వాళ్లే వుంటారా. రాజ్యం.'

'ఆఁ మీ బోలిబోలి మాటలకేంలెండి గానీ, ఎంతాలస్యమైనా ఈపాటి కతడు వచ్చేవుంటాడు గనక మీరోసారి కిందికెళ్లి పరిచయం చేసుకుని అతన్ని పైకి తీసుకు రండి. మాటల్లోబడి అక్కడే చతికిలపడకండేం?' అధికారధోరణితో అన్నారావిడ.

'ఆఁ! మనం కిందికెళ్లాలి గానీ. అతన్ని రమ్మనడం ఏం బాగుంటుందనీ.'

'అతనిందాకే ఒచ్చినట్టున్నాడు డేడీ!'

హెచ్చరిస్తున్నట్టుగా అనేసింది ఇక ఆగలేక రాధ.

'ఆ మీవన్నీ విడ్డూరపు ఆలోచనల్లే. అసలా ముసలావిడకే గోరాబెట్టినట్టు లేదు. మధ్య మీ బక్కురుకోవడం తప్ప. అతనున్నప్పుడే త్వరగా వెళ్ళారూ కాస్త. ఒచ్చిన పనేదో త్వరగా తేల్చేసుకుంటే తిరిగి స్టార్ట్ కాస్తన్నా చూడ్డానికి సావకాశం వుంటుంది మనకి.'

'అది కాదు రాజ్యం. మగబ్బాయిల పెళ్ళికి మనదే పై చెయ్యి. మనమ్మాయిల పెళ్ళికి వారిదే పై చెయ్యి. అంటే అదేం న్యాయం—'

'అబ్బబ్బ. మీతో వేవాదించలేను బాబూ.'

'సరి ఇదుగో వెళ్తున్నానుగా. ఏవీ కాసిన్ని మంచి నీళ్ళా.' చెయిజాస్తూ అన్నారు.'

'కూజాలో అయిపోయినట్టున్నాయి. వెళ్ళి తెస్తా' దొరికిందే వాలు ఛాన్సన్నట్టుగా దబ దబా మెట్లు దిగిన రాధ. సరిగ్గా అదే సమయానికి అటువెళ్తున్న రఘుని చూడ్డంతోనే ఆఖరిమెట్టుమీద ఆగిపోయింది.

'ఈవిడే మురళీ చెల్లెలు మిస్ రాధ రఘూ ఆవిడా మెడిసెన్ 'ఫర్డ్ ఇయర్' నట. ఈడు మా అన్న రఘు. ఇతనూ మెడిసెన్ మూడో ఏడే' అంటూ ఇద్దరికీ పరిచయం చేశాడు వేణు. 'నమస్తే.' అంటూ అతనికోసరం అవతరించిన సౌందర్య దేవతలా ఒయ్యారంగా నిలబడింది రాధ.

'మురళి...చెప్పాడుకాని త్వరగా రాలేకపోయాను. సాయంత్రం అందర్నీ పరిచయం చేసుకుంటా. సారీ' చేతిగడియారం చూసుకుంటూ స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు రఘు. రఘూ తనని చూడ్డంతోనే మైమరిచి పోతాడనుకుంటూ ఎంతో ఇదిగా ఒచ్చిన రాధకి రఘు తూమూలుకన్నా ముభావంగా మాట్లాడి మరోసారి వెనక్కి తిరిగి చూడనన్నా చూడకుండా వెళ్ళిపోవడంతో తొలిసారిగా రాధ అహం దెబ్బ తినింది.

'నీళ్ళయిపోయా యేవిటమ్మా నేవంపిస్తా. శంకరం పళ్ళరసం తీసుకొస్తున్నాడు, రెండూ పైకి పంపుతాలే'...లోపలి సావిట్లో కూర్చుని భాగవతం [illegible] పార్వతమ్మగారన్నారు. జవాబేమీ చెప్పకుండా గబగబా పైకెళ్ళి పోయిందిరాధ.

ఇదంతా చూస్తున్న వేణు తన అన్న మనోనిబ్బరాన్ని మనసారా ప్రశంసించుకున్నాడు.

'ఏవే నీళ్ళా' పక్కమీద పద్మాసనం వేసుకూర్చున్న రాజమ్మగారే ముందడిగారు.

'అయితే మీ నాన్న దిగొచ్చేసరికి లేడన్నమాట అతడు...'

'ఏవిటమ్మా, ఈ అడ్డదిడ్డపు వేళ్ళలూ నే వెళ్ళేసరికే లేడంటూంటే నాన్నొచ్చే సరికి, ఎలా వుంటాడనుకున్నావ్'.

'అందాక స్కూటర్ చప్పుడయినప్పుడే అనుకున్నా. అయినా, ఎంతసేపూ వాతో వాదన తప్పించి కదులేనా మనిషి !'



'ఆవిడే ఎప్పుడో పంపిస్తాదుట.'

'ఏం చోద్యమే—'

'బాగుంది ఒద్దంటూంటే [illegible]కి జోరబడమంటావా?' [illegible] తల్లిమీద చూపురూ అంది.

'ఇంతకీ, అతనొచ్చాడా.'

'ఏమో, అతనో ఎవరో, [illegible] వెళ్ళి[illegible].

అంత ఒళ్ళూ [illegible] దిట్టమే లేదంటావిడ.

'ఐనా [illegible] కింది[illegible]న [illegible] పత్తా ఇన్నాళ్ళూ [illegible]. [illegible] నువ్వన్నా, డాక్టరు చదువుతూన్న పిల వే, కాస్త మాటలు కలిపుండొచ్చుగా! అబ్బబ్బ, అందరూ అందరే నా ప్రాణా[illegible]రావిడ.

'చాలూరోజ్ఞ అమ్మా! అతనివెంట వీధుల్లో పరుగెత్తామంటావా?' కిటికీ లోంచి బయటికి చూస్తూన్నట్టుగా నిలబడి ఏదో ఆలోచించుకుంటూన్న రాధ ఒక్కసారి తల్లివేపు తిరిగి ఖస్సుమని మళ్లీ అటుతిరిగి పోయింది.

'పోనీ, ఇంతకీ, విన్నతడు చూశాడా లేదా?...

'నన్నడుగుతావేవిటే, ఆ మాటా.'

'పోనీ. అతన్ని నువ్వు చూశావా. అదన్నాచెప్పు.'

'ఆ చూశా. వాళ్లతమ్ముడు పరిచయం చేశాడు కూడా: అబ్బ, ఏవిటమ్మా. నీ పిచ్చిధోరణీ, 'ఫక్కున నవ్వేసింది రాధ.

'అయితే నిన్ను చూసికూడా వెళ్లి పోయ్యాడా.' దీర్ఘంచేస్తూ నిరాశగా అన్నారు. కూతురి అందంమ్మీదే గట్టి నమ్మకం పెట్టుకునున్న రాజమ్మగారు,

'అబ్బబ్బ, ఏవిటమ్మా ఈ రోజుల్లో అతనికి వేళైపోయుంటుంది. తొందరగా వెళ్లిపోయుంటాడు; ఇంతలో ఇన్నివిధాల అర్థాలు తీసేందు కేంవుందనీ,' అంది నిరాడంబరంగా ముస్తాబై కింది కెళ్లి పోతూ లీల.

అదివరకే తనపని చూసుకుందుకు దత్తుగారు శర్మగారివద్దకి వెళ్లిపోయి నందున ఏమీతోచక పార్వతమ్మగారితో కలిసి రాజమ్మగారు లలిత గుడి కెళ్లారు. మురళీ బలవంతంమ్మీద రాధా, లీలా, వేణూ, అతనితో కలిసి బీచీకి వెళ్లారు. రఘునికూడా ఎంతో బల వంతం చేశాడుగాని తను రావడానికి వీల్లే దనిచెప్పి తప్పించుకున్నాడు రఘు.

వాళ్లంతా తిరిగి ఏడింటికి ఇల్లు చేరుకునేసరికీ, లోపలి హాల్లో సుధ వీణ వాయిస్తూంటే; వాలుకుర్చీలో వడ్డక్కుని టెన్నిస్ డ్రస్సైనా విప్పకుండా ఆ పాట వింటూ కూర్చున్నాడు రఘు.

'ఎవరా వాయించేదీ?' అన్నాడు; మొదట రేడియోలోనేమో అనుకుంటూ వచ్చిన మురళి, ముందర హాల్లోని రేడియో మూసేవుండడం చూసి ఆశ్చర్య పోతూ.

'మా. సుధ' సగర్వంగా చెప్పాడు వేణు.

'అబ్బ? వింతహాయిగావుందే' విశ్శ గా అక్కడ కుర్చీలో చతికిలబడుతూ అన్నాడు మురళి.

'దానికి సాయం మా రఘు మృదంగం వేశాడంటే అప్పుడు వినాలి ఆ అమర గానం. అందర్నీ కూర్చోమని సౌజ్ఞచేసి తనూ అక్కడే కూర్చుంటూ అన్నాడు వేణు.

'ఎవరు ఈయనే?' ఆశ్చర్యంగా అంది లీల.

'ఆఁ ప్రత్యేకతా మా సుధని ఉత్సాహ పరిచే నిమిత్తమే! ఎలాగో తీరుబడిచేసు కుని నేర్చుకున్నాడన్నమాట—' ఈలోగా సుధ శృతిచెయ్యడం అయి; ఆలాపన ప్రారం భించడంతో అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

'ఆహాహా, ఈ మోహనరాగం అంటే నాకు ప్రాణం. మీ రెవరన్నా సందడిచేసి పాటగనక ఆపేసిందంటే నా గుండెలు కూడా ఆ వీణలోపాటు ఆగిపోయూర్కుం టాయి తెలిసిందా?' అన్నాడు మురళి.

'అమ్మమ్మా; మా చెల్లెలు సరళాదేవి క్కాటోయే భర్తయివ మీకు. అంతటి అపాయం రానిస్తానా?' అంటూ రెండు భుజాలూపట్టి స్తిమితంగా మురళిని కూర్చోపెట్టేడు వేణు. రాధ ఏదో పరాగ్గా వుండిపోయినా. ఈ విషయాన్ని శ్రద్ధగా విన్న లీలమాత్రం 'ఆఁ ఉండు నీ పని చెప్తా' అన్నట్టుగా వేలూపుతూ కొంటెగా చూసింది మురళివైపు. ఆ తరవాత మురళి లేచి పెద్దలైట్ ఆఫ్ చేసి డిమ్‌లైట్ వెయ్యడంతో అంతా ఆ ఆలాపనలో లీనమై పోయారు.

వరసగా నాలుగైదు కీర్తనలు వాయిస్తూ పాడింది సుధ. మైమరిచి వింటూన్న రఘుని తను కూర్చున్న చోట్నుంచే చూస్తోంది రాధ. చూసీ చూడనట్టిది కనిపెడుతూనేవున్నాడు వేణు. ఇంతలో గుడినుంచొచ్చిన పార్వతమ్మగారు 'శుక్రవారం పూటా వాకిట్లో ఈ చిన్న బల్బు వేశారేవిట్రా' అంటూ, పవర్ లైట్ అన్‌చేసి 'ఇదేవిట్రా ఈ చీకట్లో కూర్చున్నారూ' అన్నారు. అక్కడ కూర్చు న్నున్న వాళ్లందర్నీచూసి ఆశ్చర్యపోతూ.

'ఉష్.' అంటూ సౌజ్ఞ చేశాడు వేణు. (మళ్లీ తరవాతేమి). రఘు వింటూ న్నంతవరకూ పాట అవమేనా తెవేదులే సుధ'...నవ్వుకుంటూ అందర్నీ వెంట పెట్టుకు లోపలికెళ్లారావిడ.

'మెల్లగా ఒక్కొక్కర్నీ రఘుతో పరి చయం చేశాడు వేణు. ఎంతో గౌరవ మర్యా దతో అందరితోనూ తలా కొంచెం సేపు మాట్లాడి వాళ్లందరిమధ్యనే తనూ కూర్చున్నాడు రఘు.

'మనవాడు బీచీకి రానుగాకరాను అంటే. 'ఏవా?' అనుకున్నాను. ఈ గాన సుధారసాన్ని రుచి మరిగిన ఈ తుమ్మెద మనవెంట రమ్మంటే వింటుకొస్తాడా' అన్నాడు సుధ పాట ముగించడంతోనే రఘు వీపుమీద బలంగా కొడుతూ మురళి. అది విన్న రాజమ్మగారు ఓ సారి అయి ష్టంగా మూతి విరిచారు.

'ఇవాళెంతో సుదినమమ్మా. ఇంత తియ్యని సంగీతం విన్నందుకూ. మరినీ. ఇవాళ్టి కాకల్లేదు. కడుపునిండి పోయింది.' అన్నారు. పక్కవేపునున్న గుమ్మంలోంచి లోపలికొస్తూ దత్తుగారు. ఎవ్వరికీ కని పించకుండా ఇంత సేపూ లోటలో కూర్చుని పాట వింటూన్నారాయన.

'నిజం. ఏదో పూర్వజన్మ సుకృతం వుంటేనేతప్ప ఇంత ఇంపైన కంఠం జావం లభించవు' అన్నాడు లేచి ఒళ్లు విరుచుకుంటూ మురళి.

'అమ్మా. ఈ ఒక్క విద్యచాల్నమ్మా; మిగతా ఎన్ని విద్యలూ ఎన్ని అంద చందాలూ దీనికి సాటి రావు.' అన్నారు. 'ఆ పిల్లకాలవిటేనం వుందని మీరేసీ విచారించనవసరం లేదు సుమండీ' అన్న అభిప్రాయాన్ని చెప్పకుండానే తెల్పుతూ. అంతసేపూ. ముభావంగా కూర్చున్న రఘు సుధని ప్రశంసించడం వినడంతోనే ఉత్సాహం కనపరచడం రాధా రాజమ్మగార్లు గ్రహించారు.

'మీ అమ్మాయిల్చేతా రెండుపాటలు పాడించండి వింటాం' అన్నారు రాజమ్మ గార్నుద్దేశించి పార్వతమ్మగారు.

'ఎవరూ, మా పిల్లలా, హాఁ. మా వాళ్ల కొచ్చిందల్లా సాపాటొక్కటేనండీ' నవ్వుతూ దత్తుగా రన్నారు.

'మీరు మరీనీ. చదువుతో సతమత మైపోతూంటే వాళ్లింక పాటేం నేర్చు కుంటారనీ,' మర్యాదగా మందలించా

# ఫాక్టమ్‌ఫాస్‌తో పండిన
# ద్రాక్షపళ్ళు ఎన్నడూ పుల్లగా వుండవు

అంతేగాదు. వీర్యవంతమైన, బరువైన, కండగల్గిన, పళ్ళు గుత్తులలో కాస్తాయి. మీ ద్రాక్ష తోటలకు సంకీర్ణ ఎరువు ఫాక్టమ్‌ఫాస్ వాడి, సఖువైన, ఆరోగ్యవంతమైన, క్రిమికీటక బాధల నిరోధించగల ద్రాక్ష గుత్తులను ఎల్లప్పుడూ పండించండి.

సిఫారసు చేయబడిన రసాయన ఎరువుల మోతాదులు. కిలోగ్రాములలో

| | ఫాక్టమ్ ఫాస్ | సల్ఫేట్ ఆఫ్ పొటాష్ | యూరియా | సూపర్ ఫాస్ఫేట్ |
|---|---|---|---|---|
| ఒక్కొక్క ద్రాక్ష తీగకు— (రెండు కత్తిరింపులకు) | 16 : 20 8 | [illegible] | [illegible] | [illegible] |




ఫాక్ట్ కర్షక బంధు

## ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్.
## ఉద్యోగమండల్ - కేరళ

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు, షాపూర్‌వాడి, హైదరాబాద్-4

ప్రాంతీయ కార్యాలయాలు - విజయవాడ, వరంగల్, కర్నూలు, నెల్లూరు

EFIES: EKM FT 154.TL

రావిడ.

'ఏమో. రాధసంగతి నాకు తెలియదు గాని నేనుమాత్రం పాట పాడగల్గాలని విశ్వ ప్రయత్నం చేశానండీ. ఊఁ హూఁ లాభంలేక పోయింది.' అంది నిర్మొహమాటంగా లీల.

'మీర్వారాకు చాలా వచ్చారండీ' అన్నాడు దబ్బున వేణు.

'ఏందుకండోయి?' ఫడీమని వెంటనే అడిగేసింది లీల.

'మనసులో మాట దాపరికం లేకుండా పైకి చెప్పేస్తున్నందుకు'

'అంతేగద. ఏమో అని భయపడ్డా.'

'ఏమనుకున్నా భయందేనికే' మురళి అడిగాడు.

'అంటే ఏ కట్టుబాటూ లేకుండా యదార్థవాదిగా వుండే ఆయన్నిచూస్తే నాకు వచ్చడంలేదులే. అందుకూ'

'నీ తత్వేగా అదీనీ.'

'అవునుకో. మరి నేను కడుపులో మాట దాచలేని దాన్నయినందుకు నన్ను చేసుకునే వాళ్ళన్నా దాచేవాళ్ళు కాకపోతే, ఇక, నా పరువేంగానూ! అందుకనీ—' లీల మాటలకి అంతా ఘొల్లున నవ్వారు.

# అతని లక్ష్యం

'అమ్మ బాబో. మీ అభిప్రాయం తెలిశాక మిమ్మల్ని చూస్తేనే నాకు భయం వేస్తోంది' అంటూ గబ గబా తన గదిలోకి పరుగెత్తాడు వేణు. ఈ లోగా అన్ని ఏర్పాట్లూ చేసి భోజనాలకి పిలిపించింది జానకి. అంతా ఏకంగా కూర్చుని సరదాగా ఖబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు.

'రోహిణి మీకు బాగా పరిచయమే అనుకుంటా' అంది. హాల్లోకొచ్చి కూర్చున్నాక రఘుతో మాటలు కలపాలన్న ఉద్దేశంతో రాధ.

'తెలుసు. అన్నట్టు ఆవిడా గుంటూర్లోనే చదువుతూం దనుకుంటా ఇప్పుడు'

'అవును మేం ఇద్దరం రూంమేట్సుము కూడా.'

'అలాగా, రోహిణి కూడా చాలా అద్భుతంగా పాడుతుంది. మా సుధక్కూడా కొన్ని మళయాల కీర్తన్లు నేర్పిందావిడ.'

'చెప్పింది. మిమ్మల్ని గురించి తరుచూ చెపుతూ వుంటుంది.' రఘు ముఖ భావాల్ని జాగ్రత్తగా కనిపెడుతూ అంది.




'ఊఁ' 'పూర్ గర్ల్' ఏ భావాల్నీ వ్యక్తపరచలేదు రఘు.

'చాలా చురుకైన పిల్ల.'

'అలా అనడంకన్నా, హడావిడైనదంటే సమంజసంగా వుంటుందేమో.'

'అమ్మో ఇతడు సామాన్యుడు కాడనుకుంది రాధ. ఆ తరవాత అంతా కలిసి ఏదేదో బాతాఖానీ కానిచ్చి పదవుతూం దనగా లేచారు.

'రండీ పైకిపోయి పడుకుందాం' రఘు చెయిపట్టి లేవనెత్తుతూ అన్నాడు మురళి.

'ఈ మర్యాద లెప్పట్నుంచీగానీ మీ వాళ్ళు ఫలానా అని ఇదివరకూ నువ్వెప్పుడూ నాతో చెప్పనేలేదేం?' మురళీ చేయిపట్టుకుని చనువుగా ఊగిస్తూ అడిగాడు రఘు.

'సరి, మేం బయల్దేరేందుకు నాలుగు రోజులముందు మీనద్దనుంచీ ఉత్తరం వచ్చేదాకా ఈ పరిచయం నాకు తెలుస్తేగా అసలూ, అందుకే తరవాత కూడా మా అమ్మకి మన పరిచయం తెలియనివ్వకూడదనుకున్నా, అయినా ఎలాగో కనిపెట్టేసిందావిడ.'

'అలాగా సరి నువ్వావెళ్ళి పడుకో నేను మా నాన్నగారొచ్చేదాకా ఇక్కడే చదువుకుంటా.'

మురళి పైకి వెళ్ళిపోతే, రఘు టేబిల్ లైట్ ఆన్ చేసుకుని పుస్తకం తీశాడు.

'బావా, ఈ మాట కర్థం ఏవిటి' ఇంగ్లీషులోవున్న ఓ వైద్యగ్రంథంలో వేలుపెట్టి చూపుతూ అడిగింది సుధ.

'నీ 'ఇంటర్మేడియట్' పాఠాలేవో నువ్వు చూసుకోకుండా, ఇవన్నీ నీకెందుకు సుధా.

'అబ్బ, చెప్పు బావా? దీని తరవాత చదవబోయేదదేగా' చనువుగా గునిసింది సుధ.

'అదా అది ఆక్సిజన్కి సంబంధించిన ఒక ఆవిరి పదార్థం పేరు! సరా? అవన్నీ నీ కిప్పుడు చెప్పినా అర్థం కావు' అన్నాడు.

'ఆ? అదే? సరిగ్గా నేనూ అదే అనుకున్నా' సంబరపడుతూ వెళ్ళిపోయింది సుధ. పాపం ఏదో అక్కడి కన్నీ

తనూ తెలిసుకోవాలన్న ఏదో వెర్రితిదుర్దా: అయినా ఈ సుధకి తన భవిష్యత్తుని గురించి ఆలోచనే లేదా? లేక విచారాన్ని పైకి కనపరుచుకోవడం లేదా?' అదే అర్థంకావడం లేదు రఘుకి.

అయితే రఘు మనసుమాత్రం రోజులోని సగం కాలాన్ని సుధ భవిష్యత్తును గురించి ఆలోచించడంలోనే గడుపుతుంది. సుధ కాలు అందరి కాళ్లలా బాగవాలి ... సుధ అందరివంటి మామూలు మనిషిగా అవాలి. లేడిపిల్లల్లా తుళ్ళుతూ, కాలేజీలో తన ఎదురుగా తిరుగాడుతూండే విద్యార్థినులందరిలాగా సుధా అవాలి. ఈ తన ప్రయత్నం ఎలాగైనా నెరవేరి తీరాలి. అసలు పట్టుదలతో తనీ చదువులో చేరడంలోని తాత్పర్యం సుధకి తను స్వయంగా పరిశోధనల్లు జరిపి ఆలోపం తీర్చేందుకనే! ఇందులో తనకి, ఎంత శ్రమయినా ఎన్ని ఇబ్బందు లెదురైనా, ఎంత వ్యయమయినా అలక్ష్యం చెయ్యకుండా ఈ లక్ష్యాన్ని సాధించే తీరాలి; అందరూ వైద్యశాస్త్రం చదివివందుకు పరిశోధనల్లు జరిపితే రఘు, తన పరిశోధనల కోసరం వైద్యశాస్త్రం చదవ నారంభించాడన్న మాట.

అతనికి అయిదేళ్లు నిండీ నిండనప్పుడు సుధని తొలిసారిగా చూడ్డం! ఆపదలోవున్న తల్లికి పురిమీద పుట్టి న్నట్టున్న సుధ అవిటితనాన్నిచూసి బాధపడడం జరిగింది ... ఆనాట్నుంచీ అతని తోపాటు ఆ అభిమానమూ, పెరుగుతూ వచ్చింది. ఆటపాటల్లో ఈ అవిటితనం వల్ల ఇబ్బందులూ, అగచాట్లూ పడుతూండే సుధనిచూస్తే, 'ఏమాత్రం తనవల్లనయినా తన కాలు ఆ పిల్లకు పెట్టించి ఆ కుంటితనాన్ని తను సంతోషంగా అనుభవిద్దునే'... అనుకునే వాడు అప్పు డప్పుడూ. సుధకాలుని పరీక్షచేసిన డాక్టర్లు అందుకు తగిన హెచ్చరికను తీసుకోకుండా నీళ్ళు కారుస్తూ నిర్లక్ష్యంగా వుండడంచూసి ఈపాటి భూతదయా, ప్రయత్నమూ లేని, వీరి విద్య కాల్చనా' అనుకునేవాడు. ఏం చెయ్యడం? ఎలా ఈ చిన్నారి సుధ లోపాన్ని తీర్చడం ఎవరిందుకు పూనుకుంటారు? ఏవిధంగా తన ప్రయత్నం కొనసాగుతుంది! మనిషిగా

న్మ ఏత్తినందుకు తోడ మానవుంకూ, ల్లి దేశానికీ, ఏ కొంచెంపాటన్నా యం పడకపోతే ఇక మనకీ, మట్టిలో ట్టి మట్టిలోనే నశించిపోయే పురుగు కీ ఏమిటి తేడా, అందుకే స్వార్థం గాత్రం చూసుకుంటూ, కాలం వృధా నివ్వకుండా పరులకుపయోగించే మంచి షయాలేవన్నా. పరిశోధన్లు చేసి కని ట్టాలి. అందుకనుకూలంగా ఉండేందు గ్గను ఇప్పట్నుంచీ మనోనిబ్బరం, కార్య క్షాత్వం అలవరుచుకోవాలి. చూసిన రంతా తననమసరించాలనుకునేటంత వ్వ ఆదర్శనీయంగా వుండాలి. తన వడ కలోనూ, ముఖ్యంగా సుధని మామూలు నిషిగా చెయ్యడంలోనూ, తన ప్రయోజ క్యాన్నంతా ఉపయోగించి జయించ గ్గాలి.

ఇలా ఎప్పుడూ ఏవేవో వింత వింత ఊహిస్తుంటూ, కొత్త కొత్త పరవళ్లు క్కుతూనే వుంది ఆ నాట్నుంచి ఈనాటి కూ అతని హృదయం.

# అతని లక్ష్యం

పోర్టికోలోకొచ్చి ఆగిన కారు చప్పు డుతో ఉలిక్కిపడిలేచి వాకిట్లోకెళ్లాడు రఘు.

'ఇతడేనండీ మా పెద్దబ్బాయి. రఘూ వీరు జయా ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరె క్టరుగారు. ఇంకా అనేక కంపెనీ లకే ఏజెంట్లే కాకుండా, విదేశపు వ్యాపా రాల్లోకూడా సంబంధం వుంది వీరికి. జోగారావుగారివాళ దార్లో కనిపించి పరి చయం చేశారు' అన్నారు. కారుదిగిన శర్మగారు తనతోపాటు దిగిన కొత్తాయనను రఘూకీ పరిచయంచేస్తూ.

'గౌరవంగా నమస్కరించి ఏదో ఒకటి రెండు మాటలాడాడు రఘు. ఆ వొచ్చి నాయనా. చాలా పెద్ద తరహాగానే తోచారు రఘుకి.

'కోటయ్యా వీర్ని పైనున్న పెద్ద బెడ్రూముకి తీసుకెళ్లూ' అని తోట మాలికి చెప్పేసి. మా భోజనాలూ వగైరా అన్నీ జోగారావుగారి బలవంతంకొద్దీ.అనకా పల్లిలో వారి బావమరిది ఇంట్లోనే అయిపోయాయి. అమ్మతో చెప్పూ!' అంటూ తనూ పైకి బయల్దేరారు శర్మ గారు.

'చూడండి నాన్నా. మళ్లీ ఆయన్ని. సందిగ్ధవస్థలో ఇరికించక. ఇంకో నాలు గైదేళ్లవరకూ. అటువంటి ప్రయత్నా లేవీ ఒద్దన్నానని స్పష్టంగా చెప్పెయ్యండి' అన్నాడు మాటల్నిబట్టి ఆ పెద్దాయని సొచ్చిన పనిని గ్రహించుకున్న రఘు.

'ఆయన కలకత్తానుంచీ సెలవులో ఇటుఒచ్చి పర్యటన చేస్తున్నదీ, ముఖ్యంగా నన్ను కలుసుకున్నదీకూడా, అందుకే అయినా, ఇప్పుడు మనింటికొచ్చినది మాత్రం. నా బలవంతం మీ్మద మాత్రమేలే. ఎందుకంటే, నీ పెళ్లి ఇంతట్లో తలపెట్టడం వీలుపడదని స్పష్టంగా నిన్ననే చెప్పేశా. ఆయన చాలా పెద్దమనిషి, ఆయన ఇటు తిరుగు తూన్న కారణాన్ని నాకు చెప్పాడేగని నన్నీ విషయంలో ఒత్తిడి చేసిందుక్కాదు.' అంటూ కొన్ని మెట్లెక్కిన వారల్లా మళ్లీ వెనక్కు తిరిగి. 'అన్నట్టు దత్తు గారూ వాళ్లూ ఒచ్చారా?' అన్నారు అతిమెల్లిగా.

'ఆ ఇటువేపు రూములో వున్నారు.' అని మెల్లిగా తను బదులిచ్చాడు రఘు. ఆ వెంటనే శంకరయ్యచేత కొన్నివళ్లూ ఫ్లాస్కులో పాలూ, పైకి పంపించింది జానకి.

'సంగతుల్నిబట్టి నళిని తరుమూ తను వినేలాగ పొగుడుతూండే, అమెరికా జపాన్ జర్మనీ వగైరా అన్నిదేశాల్లో తన నాట్యకళని ప్రదర్శించొచ్చిన ఆ సుందరాంగి ఈయన కూతురే అయ్యుం డాలి.' అనుకున్నాడు రఘు. అందుకే నళినితండ్రి. ఈయన్ని నాన్నగారికి పరిచయం చేశారు. హు ఇలాగే కూతుర్ల ప్రయోజకత్వాల్నీ!. తమవంశ'.సాంప్ర దాయాల్నీ! హోదానీ!' తెలియపరుచు కుంటూ తన నిమిత్తంగా నాన్నవద్ద కొస్తూన్నవారింకా ఎందరెందరో!

(ఇంకా ఉంది)



# వరద

పాలకోడేటి సత్యనారాయణరావు

[illegible]

కొత్తది కాదు, అనావృష్టి కొత్తదికాదు. వానరావటం, వానతో బాటుగ వరద రావటం, ఎంతో నష్టంకావడం, పదిమంది చావటం వం... వందలమంది నిర్వాశ్రయులవటం... ఇది ఆంధ్రదేశానికి ఆనవాయితీ. కాలం ఖర్మం కలిసివచ్చి, ఒక సంవత్సరం వరద రాకపోయేసరికి, మనుషు లందరికీ ఆంధ్ర దేశానికి అవతలెక్కడో ఉన్నట్టు అనిపించటం ... ఇదంతా మామూలే !

కాని—

మామూలుగా అనిపించనిది ఒక్క తలుపులుకే !

అతనికింకా కొత్తగా ఉంది. అతనికి తెలిసి వరదరావటం మొదటిసారి

వరదలొస్తూనే ఉంటాయి, పోతూనే ఉంటాయి; చూస్తూ ఉంటాం, మర్చిపోతూనే ఉంటాం. కానీ ఈసారి, వరద రావటమే చూశాడ తలుపులు !

మనసులలో సైతం వరద వస్తుందనీ, ఆ వరద వెల్లువలో మనసులోని కుళ్ళు కొట్టుకుపోతుందనీ తలుపులుకు తెలీదు.



...ంకా...

'అమ్మగారూ—' భయం ఆగింది క్షణం సేపు. 'ఏం?'

'ఈ రేడియో, గడియారం...'

'వద్దువి, లేకు! — వరదవచ్చి ఇదంతా కొట్టుకుపోతే బాగుండును. అంతా మరొకరిని దోచితెచ్చిన సొమ్ము; వాళ్లేరా ఈ తీసుకెళ్లేది! బతికి బాగుంటే మళ్లీ సంపాదించుకోలేమా? కష్టపడి బతకటం అప్పుడైనా నేర్చుకుంటే అంతే చాలు...'

తలుపులు ఆశ్చర్యపోయాడు — 'అంటే?—'

'ఒరే, మాట్లాడకుండారా! మీ మగవాళ్ల బుద్ధి అంతేరా!— ఆడది చెప్పటం ఏం, వినటమేం అని!— 'వద్దండీ' ఇలా ఇంకోళ్లను దోచి మనమేం బాగుపడలాం' అంటే వింటేనా? ... రానీ, వరదరానీ; వరద రావాలి, ఇదంతా కొట్టుకుపోవాలి. దేవుణ్ణి ఇంతకన్న ఇంకేమీ కోరుకోను—' భయం వెళ్లిపోయింది.

—తలుపులు మాన్పడిపోయాడు. ఇలాటి వాళ్లలోకూడ మనసులు, ఇలాటి భావాలు ఉన్నాయని అతననుకోలేదు. ఇందుకే, ఈ ప్రపంచం ఇంకా ఇలా ఉందనుకున్నాడు. కష్టార్జితానికి ఆవిడ ఇచ్చే విలువ అతని కర్థం అయింది.

తలుపులు ఆ ఇల్లువదలి బయటకు వచ్చాడు.

క్షణం క్రితం గంగులు ఇంట్లో; ఇప్పుడు ఈ గోవిందరావు ఇంట్లో తను చేయాలనుకున్న పనిని తలుచుకొని, తల దించుకొన్నాడు. ఇంతక్రితం వెంకటరావింట్లో, అంతక్రితం...

ఛ—తలుపులు తల వాలిపోయింది.

'—...వరదలేదు; వచ్చే ప్రమాదమూ లేదు. అందరూ తమ తమ ఇళ్లకు సురక్షితంగా చేరకోవచ్చు—' ఆకాశవాణి చేస్తున్న ప్రకటన.

వస్తుందనుకున్న వరద రానేలేదు,

రాదనుకున్న వరద రానే వచ్చింది.

వరద మనసును ముంచివేసింది. కుళ్లును కడిగి మనసు మంచి ముత్యంలా మెరిసేలా చేసింది

తలపులుకు రాదనుకున్న వరద రానే వచ్చింది.

# తప్పునడతకు కారణాలు



ధర్మపథం. బులుసు వెంకటరమణయ్య

భగవంతుడికి ఒక ప్రాణిపైని ఎక్కువ అభిమానం ఉండడం, మరొక ప్రాణిమీద అభిమానం లేకపోవడం అనేది లేదు. పిపీలికాది బ్రహ్మ పర్యంతమూ ఉన్న సృష్టిలో యావత్తూ అతనికి సమానమే!

అయితే కొందరు ధనవంతులూ, కొందరు దరిద్రులూ—కొందరు ఆరోగ్యవంతులూ, కొందరు రోగపీడితులూ — కొందరు దుఃఖాల్లో మునిగివున్నవారూ, కొందరు సుఖాలు అనుభవిస్తున్నవారూ ఉన్నారు గదా! దీనికి కారణం ఏమిటి? అని తోచవచ్చును.

అలా వ్యత్యాసం వుండడానికి కారణం వారి వారి పూర్వజన్మలే కాని వేరొక కారణం లేదంటూ తత్వాన్ని తెలిసినవారు చెప్పుతూ ఉంటారు. ప్రాణులు మరణించిన తర్వాత—మరో జన్మ ఎత్తినప్పుడు మరేవీ వాటిని వెంబడించి రాకపోయినా, వెనకటి జన్మలలో చేసుకున్న కర్మలవల్ల లభించే పుణ్యమూ, పాపమూ తప్పకుండా వెంబడించి వస్తాయి. వాటిని తప్పించుకోవడం ఎటువంటి వారికిన్నీ సాధ్యం కాదు. పుణ్యాన్ని బట్టి సుఖానుభవమూ, పాపాన్నిబట్టి దుఃఖానుభవమూ తమ తమ భావాల ననుసరించి కలుగుతూ ఉంటుంది.

కష్టాల ననుభవిస్తున్న ఒక బుద్ధిమంతుడు భగవంతుణ్ణి ఇలా ప్రశ్నిస్తున్నాడు—

'సర్వ సమాన భావంగల వో దేవుడా! నేను కష్టాలను అనుభవించడానికి కారణం వెనకటి జన్మలో నేను చేసిన పాపాలేకదా! ఆ పాపాలు ఎలా సంభవించాయి? నేను చేయరాని పనిని — తప్పుపనిని చేయడం వల్లనేకదా! ఆ తప్పుపనిని నేను చేశానంటే దానికి కారణం నీవే అని గట్టిగా చెప్పగలను. ప్రాణుల యొక్క ఆయా ప్రవర్తనలు నీవు గానే గదా జరుగుతున్నవి! నీవు ఆ తప్పుపనిని చేయించావు. నేను ఇందులో నేను చేసిన దేమున్నది అంతా నీవుచేసినదే!

ఒక కర్మాగారం ఉన్నదనుకుందాం. అందులో ఆయా స్థానాల్లో యంత్రాలను స్థాపించి వుంటారు. కాని యంత్రాలు తమంతట తామే మీ లేవుకదా! వాటిని నడిపే వ్యక్తి ఉంటాడు కదా! అతడు యంత్రాలను త్రిప్పి, వల్లపనిచేయిస్తేనే ఉత్పత్తి జరుగుతుంది. లేకపోతే స్తంభించిపోతుంది. వస్తూత్పత్తి జరగకపోతే తప్పు యంత్రాన్ని త్రిప్పేవాడిదే తప్ప యంత్రానిది కాదుగదా!

దేవా! నేను యంత్రాన్ని; యంత్రం త్రిప్పేవాడివి. నేనేదైనా తప్పు చేస్తే, అది నీవు చేయించినదే. నేను సహజంగా చేసిన తప్పు కాదు. యంత్రం బాగా పనిచేస్తే అలా పనిచేయించినవాడు యంత్రం త్రిప్పేవాడయినట్లు, నేనేదయినా మంచిపని చేస్తే అది నీవు చేసినట్లే!

యంత్రస్య గుణదోషౌన
యంత్రిణః పరమేశ్వర;
అహం యంత్రో భవాన్యంత్రీ,
మమ దోషో నవిద్యతే.

ఇది అతని ప్రశ్న,

అయితే — అతడు భగవంతుణ్ణి ప్రార్థించవలసిన దేమిటంటే —

యంత్రరూపంగా ఉన్న తనను తప్పుత్రోవలో పడకుండా సన్మార్గంలో నడిచేటట్లు చేయమని మాత్రమే!

# కథ



గతసంచిక తరువాయి ]

ం గదిలోంచి వస్తూ నారాయణ దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?' అని రువాత కాని చంద్రశేఖరం ఊహా లోంచి బైటకు రాలేదు.
క్కమని 'ఆఁ. ఏమీ లేదు. రేపటి గ్వ్య సంగతి ఏలాగా అని.'
కింత ఆలోచనెందుకు? ధైర్య ళ్లడమే.'
కాదు.' అని కాస్త సంకో ా యిప్పటి వేషం చూశావుగా. ఏలాటి యింప్రెషను కలుగుతుందో వేరే ఊహించ నవసరంలేదు.' అన్నాడు.

'హాఁ. అదా నువ్వు అంటున్నది. చూడు చంద్రం నా దగ్గర నీకు సిగ్గెందుకు? ఏది కావలిస్తే అది యిస్తాను. కాని శుభ్రంగా మాత్రం తయారయి వెళ్ళు.' అని.

నారాయణ అనగానే కొండంత బరువు తలమీంచిదింపినట్లయింది చంద్రశేఖరానికి.

'బట్టలున్నాయి మంచివి. జోళ్ళు మాత్రం నువ్వు యిస్తే చాలు. అవైనా యిప్పుడొద్దు. రేపు యిక్కడికే వచ్చి వేసుకు వెళ్తాను.'

'నీ యిష్టం. ఏలాగ కావాలంటే అలాగ చెయ్యి. పద టీ త్రాగుదాము' అంటూ బైటకు నడిచాడు నారాయణ.

మర్నాడు నారాయణ గదిలో జోళ్ళు తొడుక్కుంటూ 'ఈ ఉద్యోగం కనుక దొరికితే మొదటి జీతంతో మంచి షూ ఒకటి ముందుగా కొనుక్కుని మరీ యింటికి వెళ్తాను' అని తీర్మానించుకున్నాడు.

*   *   *

ఉద్యోగం చంద్రశేఖరానికే దొరికింది. నెలరోజులు యిట్టే గడిచిపోయాయి.

జీతాలరోజు పండుగరోజులాగ అనిపించింది. ఆత్మవిశ్వాసం విస్ఫోరెట్టు పెరిగింది. జీతం అందుకున్నప్పుడు ఏదో అనిర్వచనీయమైన ఆనందం కలిగింది. కళ్లలో నూతనోత్సాహం ప్రతిఫలించింది. చుట్టూ ఒకసారి చూశాడు. ఎవ్వరూ తన్ను గమనించడమే లేదు. కొంచెం నిరుత్సాహంగా తన సీటులోకి వెళ్ళి కూర్చున్నాడు.

జేబులోని రూపాయినోట్లు వెచ్చగా తగులుతూ నిరుత్సాహాన్ని అట్టేసేపు నిలవనివ్వలేదు. మాటిమాటికి తడిమి చూసుకుంటూ ఎలాగ వినియోగించాలా అని ఆలోచన సాగించాడు. చివరకు ఇంట్లో అందరికి మంచిబట్టలు కొందామని నిశ్చయించుకొని ఆఫీసు మూయగనే బజారువేపు నడిచాడు.

నాలుగింటికే రావలసినవాడు యింకా రాలేదేమని వీధి గుమ్మంలో యెదురుచూస్తూ నిల్చుంది చంద్రశేఖరం తల్లి. ఆలస్యానికి కారణాలు రకరకాలుగా ఊహించుకుంటూ ఆందోళన పడుతూంది. మరి కాస్త సేపటిలో దూరంగా వస్తూ కనిపించిన కొడుకును చూడగానే ఆమె గుండె కుదుటపడింది. అప్యాయంగా అటే చూస్తూ నిల్చుంది. కొడుకు నడకతీరు, అతని సన్నటి పొడుగాటి విగ్రహం చూస్తూంటే పెళ్లినాటికి భర్త కూడా యించుమించు యిలాగే నాజూగ్గా ఉండేవాడని గుర్తుకు వచ్చింది. పెళ్ళయిన కొత్తరోజుల అనుభవాలు, మధుర స్మృతులు జ్ఞాపకంలోకి వచ్చి ఆమె ముఖం కొద్దిక్షణాలు విరబారింది

పిస్సుక్కి:

గుమ్మంలో అడుగుపెడుతూ 'అమ్మా, జీతాలు వచ్చాయి. చూడు మీ కందరికి ఏమిటి తెచ్చానో' అంటూ పేకెట్లు ఆమె చేతికి అందించాడు.

ఆమె అందుకునేలోగా తక్కిన పిల్లలు చెరో పేకెట్టు లాక్కుపోయారు. లోపల ఏముందోనని తొందరగా వాళ్ల పేకెట్లు చించివేస్తుంటే వాళ్ల ఆతురతకు చంద్రశేఖరానికి నవ్వు వచ్చింది. బట్టలు చూసుకుని వాళ్లు అమితంగా మురిసిపోయారు. వాళ్లు సంతోషంతో గంతులు వేస్తుంటే తనుచేసిన ఖర్చు వృధా కాలేదని తృప్తిపడ్డాడు.

తల్లికి తండ్రికి కొన్న బట్టలు జాగ్రత్తగా విప్పి చూపించాడు తల్లికి. అవి చాలా విలువైనవి. ఎన్నో షాపులు తిరిగి యెంచి తెచ్చాడు. వాటిని చూడగానే తల్లి కళ్లు చెమర్చాయి. ఇంత మంచి బట్టలు ఊహల్లోనే కాని వాస్తవంగా ఆమె ఇంతవరకు చూడలేదు. ఆప్యాయంగా తడిమింది.

'ఇప్పుడు యివన్నీ ఎందుకు తెచ్చావురా? చాలా డబ్బయుంటుంది వీటికి' అన్నది. ఆమె స్వరాన్నిపట్టి ఆమెకు కోపం లేదని, అవి నచ్చాయనీ తెలిసిపోయింది చంద్రశేఖరానికి.

'ఎందుకేమిటి? కొనాలనిపించింది. కొన్నాను. ఏం? బాగులేవా?'

'ఇవి బాగులేక పోవడమేమిటి? మరి నీ కోసం ఏమీ తెచ్చుకోలేదా?'

'తరవాత కొనుక్కుంటాలే' అన్నాడు.

తండ్రికి బట్టలన్నీ చూపించింది తల్లి. వాటిని తిరిగి తిరిగి చూశారాయన. ఏమీ అనలేదు అదే గొప్ప మెప్పుగా తోచింది చంద్రశేఖరానికి.

కాని ఆయన ముభావానికి కారణం తరవాత తెలిసింది. నిద్రపోయేముందు నీళ్లు త్రాగుదామని వంటింటివేపు వెళ్తూ గుమ్మందగ్గిరే ఆగిపోయాడు వంటింటిలో తల్లిదండ్రుల మాటలు వినరాగానే.

'బాబు తెచ్చినవి బాగున్నాయి కదూ?' అంటోంది తల్లి.

'బాగులేవని ఎవరన్నారు?'

'వాడంత సరదాపడి తెస్తే మీరు ఏమీ అనకపోయేసరికి నొచ్చుకొనివుంటాడు.'

'వాటి విలువ ఎంతో నీకు తెలుసా?'

'ఊహూం. అయినా అభిమానంగా తెస్తే సంతోషించడానికి ధర కావాలా?'

'పిచ్చిదానా. వాడి జీతం పూర్తిగా వీటి క్రింద ఖర్చయిపోయుంటుంది. అందుకే వాడు తనకేమీ కొనుక్కోలేదు. ఆమాత్రం గ్రహించుకోలేవూ' అన్నారు తండ్రి.

నిజాన్ని ఆయన సుళువుగా గ్రహించినందుకు తలుపుదగ్గిర నిల్చున్న చంద్రశేఖరానికి ఆశ్చర్యం కలిగించింది.

మళ్లీ తండ్రి గొంతు వినవస్తోంది.

'సరదాకి వాడు తెచ్చాడు. బట్టలు కూడా చాలా బాగున్నాయి. అయితే డబ్బును జాగ్రత్తగా వినియోగించుకోవడం వీడు నేర్చుకోవాలి. ఇదే వీడు వేరుగా సంసారం చేస్తున్నాడనుకో. అప్పుడు సరదాకని బట్టలు కొనేస్తే తరవాత యిల్లు ఎలా గడుపుతాడు? అందుచేత ఉన్న డబ్బును అన్నివుపాయాలకు సరిపోయేటట్లు సర్దుకోవాలి. ప్రపంచంలో ఎన్నో సౌకర్యాలుంటాయి. అవి అందరికి అందుబాటులో లేకపోవచ్చును. వాటికోసం వెర్రిగా డబ్బంతా వినియోగించి అప్పులపాలయినా కష్టమే. అవి లేవో అని రాత్రింపగళ్లు వాటికోసం తపిస్తూ జీవితాన్ని అశాంతిమయం చేసుకోడం కూడా తెలివితక్కువే. కోరికలుండడం సహజం. మనకు లేని వాటికోసం కృషి చెయ్యాలి. కాని ఉన్నదాంట్లో ఒడుదుడుకులేకుండా గడుపుకోవడం నేర్చుకోవాలి. వాడితో యివన్నీ అంటే చిన్నబుచ్చుకుంటాడని అప్పుడు ఏమీ అనలేదు. మనందరికి కొని వాడు తనకు కొనుక్కోలేకపోయినందుకు నాకు బాధగా ఉంది.'

'ప్రతిచిన్నవిషయానికి మీరు గంట ఉపన్యాసం యిస్తారు. మీరు చెప్పేదవన్నీ నిజమే, కాని యీ బాధలన్నీ ముందు ముందు ఎలాగా తప్పదు. కొన్నాళ్లు హాయిగా యిష్టంవచ్చినట్లు ఖర్చు చేసుకోనివ్వండి' అన్నది తల్లి.

ఇంక తరువాత సంభాషణ వినలేదు. చంద్రశేఖరం. తన గదికి తిరిగి వెళ్లిపోయాడు. ఆ రాత్రి చాలా సేపటివరకు అతనికి నిద్రపట్టలేదు. బట్టలు కొనడానికి ఎంతో శ్రమపడ్డాడు. తనకు నచ్చిన

వాటి ధర విపరీతం — కొనడా
అందుబాటులో ఉన్నవి నచ్చ
పోనూ, ఎన్నో షాపులు తిరగవలసి
బట్టలు కొన్న తరవాత డబ్బు
జోళ్లు కొనుక్కోలేదు. వచ్చేనెల
మని సరిపెట్టుకున్నాడు. ఇంత
కొంటే యింట్లో నచ్చవేమోనని
దిగులుగా ఉంది. అయితే
ముఖాల్లోనూ సంతోషం చూసిన
తనుపడిన కష్టం మర్చిపోయాడు

తండ్రి అభిప్రాయం తెలిసిన
ఉత్సాహం ఒక్కసారిగా చల్లారి
తనుచేసిన పని సరి అయినది
పించింది. తండ్రికి ఆర్థికంగా
పడదామని ఉద్యోగంలో చేరినవా
విధంగా ముందు వెనక ఆలోచిం
ఒక్కరోజులో డబ్బంతా ఖర్చుచేసి
ఇది అవివేకం కాకపోతే మరేమిటి
ముందు జీతం అంతా అమ్మ
యిస్తాను. జేబు ఖర్చుకుంచుకు
జాగ్రత్తగా వాడుకుంటే కొం
వచ్చును. ఆ విధంగా దాచిన
జోళ్లు కొనుక్కోవచ్చును.'
తరువాత మనస్సు తేలిక పడింది

తను చేసుకున్న నిర్ణయానికి
ఊపిరి పీల్చుకొని ప్రక్కకు తి
పోయాడు.

నిద్దట్లో తను నిగనిగ మెరి
జోళ్లు వేసుకున్నట్లూ, వా
ఆఫీసులో అందరూ అసూయపడి
వాటిని చూడగానే ఆఫీసరు తనక
షను యిచ్చినట్లు కలగన్నాడు.

* *

మరి కొన్నాళ్లకు యింటి
మెరుగుపడింది. చంద్రశేఖరం
గురించి ఆలోచించడం ప్రారం
దినపత్రికలలో జోళ్ల ప్రకటన
తంగా చదివేవాడు. స్నేహితుల
రకాల జోళ్ల మంచి చెడ్డల
సంప్రదించేవాడు. ఏమయినాసరే
ఆలస్యం అయినాసరే మంచి ష
లని అనుకున్నాడు. మంచి షూ
ఎక్కువ పట్టుంది కాబట్టి డబ్బు
డానికి చాలా సమయం
తీరా కావలసిన మొత్తం సమకూ
ఇంట్లో వేరొక అవసరానికి

దాంలో ప్రయత్నం మళ్ళీ మొదలవచ్చేది. ఈ విధంగా కాలప్రవాహంలో నాలుగు సంవత్సరాలు వెనక్కు వెళ్ళాయి. అతికష్టంమీద సాధారణ రకం చెప్పులు మాత్రం కొనగలిగాడు. కాని షూ ప్రయత్నం మాత్రం... దానికోసం వచ్చినడబ్బు వేరే ఖర్చయి పోయినప్పుడు పట్టుదల తప్ప మరేమీ కాని విచారం కలగలేదు.

చంద్రశేఖరానికి మరికొంత కాలానికి ఊరు బదిలీ అయింది. కొత్త ఊరిలో కొడుకు ఒక్కడూ ఉండడం మంచిది కాదని పట్టుపట్టి పెళ్ళిచేసి తల్లిదండ్రులు.

పెళ్ళిగురించి ప్రత్యేకంగా అతనికి గుర్తున్నదల్లా పెళ్ళిముందు ఒకనాటి తం జరిగిన చిన్న సంభాషణ. పెళ్ళికి వచ్చిన బంధువులు పెళ్ళి మాట్లాడుకుంటున్నారు పెళ్ళి రోజు. అతను వాళ్ళమాటలు అక్కడే కూర్చున్నాడు.

పక్కన ఒక ముసలావిడ 'ఏమోయ్ శేఖరం! అలకపాన్పు వేసినప్పుడు అడుగుతావు?' అని సూటిగా...

అంతు దాని ప్రాముఖ్యత అంతగా పోయినా ఏదో ఒకటి కోరాలని, ఆ మామగారు ఆ కోరినదాన్ని యిచ్చితీరాలని మాత్రం చంద్రశేఖరానికి ... ఆలోచించకుండా 'జోళ్ళు' అక్కడ ఉన్నవాళ్ళంతా విని నవ్వేరు. వాళ్ళలాగ నవ్వుతుంటే ... చూశాడు.

... అడుగుతారు, సైకిలు ... యింకేదైనా మంచి విలువైన వస్తువడుగుతారు అన్నిటినీ మాని ... అడుగుతానంటా వేమిటోయ్' ... ముసలావిడ మందలించింది.

... తన కోరికను అవహేళన ... బాధపడుతూ లేచి వెళ్ళి... తరువాత పెళ్ళిలో ఏమీ ...

... తీసుకు వెళుతున్నప్పుడు ... పక్కకు పిలిచి 'చంద్రం, మవ్వ

# చంద్రశేఖరం

యికముందు డబ్బుపంపకు. వేరే సంసారం పెట్టడమంటే డబ్బు సరిపోదు.' అని చెప్పారు.

ఇంటికి పంపనవసరంలేదు కాబట్టి షూ కొనడం త్వరలో సాధ్యపడుతుందని అనుకున్నాడు. కొద్దిరోజుల్లోనే అదెంత కష్టమైన పనో తెలిసివచ్చింది.

మొదట్లో సంసారం అంటే సినిమాల్లో చూపిన విధంగా హాయిగా పాటలు పాడుకుంటూ షికార్లు కొట్టడమే ననుకున్నాడు.

అయితే వాస్తవ జీవితంలో సంసారం అంటే ఎంతో బాధ్యతతో కూడినదని తెలిసింది మరి కొన్నాళ్ళలో. అనుక్షణం భార్యా పిల్లలు, వాళ్ళ సుఖదుఃఖాల గురించే ఆలోచనలు కలుగుతుండేవి. తన గురించి ఆలోచించడానికి తీరిక ఉండేదే కాదు. వాళ్ళకోసం తన కోరికల్ని, అవసరాల్ని వదులుకోవలసినప్పుడు ఎంతో తృప్తి, ఆనందం కలిగేవి. షూ కొనుక్కోడం వెనకబడుతూ వచ్చింది. ఆలస్యం అధికమవుతున్న కొలది ఒక్కనాటికీ కోరిక తీరదా అని భయం కలుగుతుండేది.

క్రమంగా ఒకటితరవాత మరొకటిగా సంవత్సరాలు వెనక్కు వెళ్ళిపోతున్నాయి. చంద్రశేఖరానికి ఎక్కడైనా మంచిజోళ్ళు చూసినప్పుడు తనకు లేవనికోపం, వాటిని తొడుక్కున్న వాళ్ళను చూసినప్పుడు ఈర్ష్య కలగడం మొదలుపెట్టింది. ఆఖరికి జోళ్ళుకూడా కొనుక్కోలేని అసమర్థుడినా అని వాపోతుండేవాడు.

'ఇక ఈ జీవితానికింతే. అనవసరంగా లేవని బాధపడడం కంటే ఆశ వదులుకోవడమే మంచిది.' అని నిరాశ చేసుకున్న రోజున హెడ్‌గుమాస్తా ప్రమోషన్ వచ్చింది, ప్రమిదలో ఆరిపోతున్న దీపానికి నూనెపోసినట్లు ఈ ప్రమోషను ఆశను ప్రజ్వలించింది. నూతనోత్సాహంతో మళ్ళీ ప్రయత్నం ప్రారంభించాడు. నియమం తప్పకుండా ఆఫీసు డ్రాయర్లో ప్రతినెలా కొంత డబ్బు దాస్తూ వచ్చాడు. దాన్ని ఏలాటి పరిస్థితిలోనూ ముట్టుకునేవాడు కాదు. ఎన్నో అత్యవసరాలు వచ్చేవి. ఇంట్లో ఎన్నో కొనవలసినవి. అశాంతి కలిగాయి. అన్నిటికి నిగ్రహించుకొని దాచినడబ్బుని ఈనాడు చూడగానే గతం గుర్తుకురావడం సహజం.

* * *

గడియారం ఖంగ్‌మని గంటలు కొట్టగానే ఉలిక్కిపడ్డాడు. అప్పటికికాని తను యింకా ఆఫీసులోనే ఉన్నాననీ, వేళ ఏడయిందనీ తెలియలేదు.

డబ్బు ఒకసారి లెక్కించి తిరిగి డ్రాయరులో పెట్టబోతూంటే 'ఈనాడే షూ కొనుక్కుంటేనో' అని తళుక్కున ఆలోచన కలిగింది. 'ఇదే సరైనసమయం. రేపట్నుంచి సూపర్నెంటు కాబోతున్నాడు. కాస్త హోదాకూడా ఉండాలి. డబ్బుకూడా సరిపోతుంది. మరి ఆలస్యం దేనికి'? అని తన్నుతాను ప్రశ్నించుకున్నాడు.

డబ్బు పదిలంగా జేబులో పెట్టుకున్నాడు. పీరయ్యని లేపి ఆఫీసు మూయించి అక్కడనుంచి సరాసరిగా బజారుకు బైలుదేరాడు.

* * *

చంకలో జోళ్ళ పాకెట్టు పదిలంగా యిముడ్చుకొని మరొక గంటతరువాత సిటీ బస్సుస్టాపు చేరుకున్నాడు. చేతివాచి ఒకసారి చూసుకున్నాడు. బస్సు రావడానికి యింకా పదిహేను నిముషాల వ్యవధి ఉంది. చుట్టూ ఒకసారి కలయచూశాడు. స్టాపులో పదిమందికి మించిలేరు జనం.

తన పాకెట్టువేపు ఎవరైనా చూస్తున్నారేమోనని చూశాడు. ఆ క్షణంలో ఎవరైనా పొరపాటునైనా చూసినట్లయితే వాళ్ళకి తను కొన్న షూ మిగతావాటి కంటే ఎందుకు శ్రేష్ఠమైనదో. దానిని కొనడానికి ఎంత శ్రమపడవలసివచ్చిందో, అసలు ఈ రోజున ఎందుకు కొనాడో గుక్క తిప్పుకోకుండా చెప్పేవాడు. సంతోషానికి ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నాడు.

అయితే ప్రతివాళ్ళ చేతుల్లోనూ ఏదో పేకెట్టుండడంచేత తన ప్రత్యేకత తనకే గోచరించలేదు. ఇంక వాళ్ళెందుకు చూస్తారు? తన ఆతురతకు తనకే నవ్వు కలిగింది. ఇదివరకెన్నడూ యింత తృప్తిగా హాయిగా నవ్వలేదు చంద్రశేఖరం.

పాకెట్టును ఆప్యాయంగా తడుముతూ 'వా పిచ్చికానీ, దీని ప్రత్యేకత వాళ్ళ

తెలాగ తెలుస్తుందో అనుకున్నాడు.

మాటిమాటికీ, నల్లగా జిగజిగ మెరుస్తూ ఎంతో తన్ను ఆకర్షించిన అంబాసిడర్ షూ తల్చుకొంటూ మురిసిపోతున్నాడు. ఈ రోజు దాన్ని గురించి కలలు కనక్కర్లేదు. తన ఎన్నికకు షాపువాడు ఎంతగానో మెచ్చుకున్నాడు.

మొదటిసారి జోళ్ళు వేసుకొని నిల్చున్న ప్పుడు కాళ్ళు కాస్త వణికాయి. షాపులో ఇటు అటు నడిచినప్పుడు గాలిలో తేలి పోతున్నట్లనిపించింది. చిన్నప్పుడు రవి జోళ్ళు వేసుకొని ఎండలో నడిచినప్పుడు కలిగిన తన్మయత్వం మళ్ళీ యిప్పుడు కలిగింది. ఎదురుగా నిలువుటద్దంలో చూసి తన్ను తానే పోల్చుకోలేక పోయాడు. అద్దంలో చంద్రశేఖరానికి వయస్సు ఇరవై సంవత్సరాలకన్నా ఉన్నట్లు లేదు. నడకలో ఠీవి, హుందాతనం వాటంతటవే వచ్చాయి. 'రేపెవరో తెలుసా? ఆఫీసు మానవెయ్యకండి. జాగ్రత్త' అని అద్దంలో ప్రతిబింబాన్ని హెచ్చరించాడు.

మర్నాడు ఆఫీసు చేరగానే అందరూ లేచి తనకు నమస్కారాలు చేస్తున్నట్లూ, కారిడర్‌లో తన జోళ్ళ శబ్దం వినరాగానే ఎక్కడివాళ్ళు అక్కడ భయంతో తలలు వంచుకొని పనులు చేసుకుంటున్నట్లూ, ఆఫీసరు తనకు యింత మంచి జోళ్ళు లేనందుకు ఈర్ష్యగా చూస్తున్నట్లు, యింకా ఏవేవో కలలు కంటుంటే తను వెళ్ళవలసిన బస్సు వచ్చింది.

రాత్రి భోజనం చేసి తీరుబడిగా చదవ డానికి వార్తాపత్రిక తెచ్చుకొని మంచం మీద పడుకొని చదువుతున్నాడు చంద్రశేఖరం. ఎంత ప్రయత్నించినా పత్రికమీద మనస్సు లగ్నం కావడం లేదు.

పనంతా పూర్తి చేసుకొని భార్య ఎప్పుడు వస్తుందా అని నిరీక్షిస్తున్నాడు. ఆమెకు తనకు వచ్చిన ప్రమోషను గురించి తను కొనుక్కున్న అంబాసిడర్ షూ గురించి చెప్పాలని తహతహలాడుతున్నాడు.

తను యింటికి చేరగానే చేతిలోని పాకెట్టు వేపు భార్యా కొడుకు ప్రశ్నార్థకంగా మాటిమాటికి చూడడం గమనించి కూడా ఏమీ చెప్పలేదు. సరాసరిగా తన గదిలోకి వెళ్ళి దాన్ని దాచివేశాడు. భోజనం దగ్గర ఏమైనా చెపుతాడేమోనని వాళ్ళు చూశారు. వాళ్ళ కుతూహలానికి నవ్వు కుంటూ ఊరుకున్నాడు.

'వివరాలు చెప్పిన తరువాతే భార్యా [illegible]

మొదట కలిగే ఆశ్చర్యం, తరువాత ఆనందం, కళ్ళల్లో కనిపించే అనురాగం తల్చుకోగానే ఒళ్ళు పులకరించింది. 'అది సంతోషించడం కంటే నాకు కావలసిం దేమిటి?' అనుకున్నాడు తృప్తిగా.

అతని ఆలోచనలకు భంగం కలిగిస్తూ ప్రక్క గదిలోంచి కొడుకు గొంతుక వినిపించింది.

'అమ్మా. చస్తున్నరా.'

'ఎందుకురా అరుస్తున్నావు?'

'చూడు నా కాళ్ళ వేపు.'

'ఎక్కడివి ఆ జోళ్ళు?'

'నాన్నగారు తెచ్చిన పాకెట్టులో ఏమి టున్నాయనుకున్నావు? యివే. చూశావా నాకు ఎంతబాగా సరిపోయాయో.'

'ఆయన వస్తువులు ముట్టుకోవద్దని ఎన్నిసార్లు చెప్పినా వినవేం?'

'ముట్టుకోకూడదనుకున్నాను. కాని...'

'బాగుంది. యిదా తెచ్చి. యింకా వీరో ఏదో తెచ్చారేమో తమాషాకి దాచేరను కున్నాను. ఈ బోడిజోళ్ళకింత రహస్య మెందుకు?'

'నేను కొనుక్కుంటానని చెప్పానే ఆ జోళ్ళే యివి. వీటిని అంబాసిడర్ షూ అంటారు. ఎంత మంచి షూ అను కున్నావు. ధర ఎంతో తెలుసా?'

'ఏమో పదో యిరవైయో ఉంటుం దేమో.'

'యిభై రూపాయల పై మాట.'

'తోలు ముక్కలకింత ధరేమిటిరా? ఈయనకేదో మతిపోయింది. మొన్న

[illegible] లేదన్నారు. వీటి కెక్కడినుంచి వచ్చిం

'నాన్నగారు కొంటున్నట్లు నీకు చెప్పలేదా.'

'నాకేం తెలుసునురా యిలాటి పని చేస్తారని. ముందుగా తెలిస్తే యింత తగలవేసి వాటిని కొననిచ్చేదాన్ని కాదు'

'నాకోసమే తెచ్చుంటారు. మా యిద్దరిదీ యించుమించు ఒకటే

'లేకపోతే తనకోసం అనుకున్నా బాగుంది వరస. ఎవరైనా వింటే పోతారు. నేడో రేపో రిటైరవ యింకా చిన్నపిల్లల్లాగ పోకులు ఏం బాగుంటుంది? ఏ వయస్సుకి వట్లు ఆ వయసులో ఉండాలి. పిచ్చివని...'

సంభాషణ వింటున్న చంద్రశేఖరానికి పొడిచిపెట్టి బలంగా వెంచ చరిచినట్టు యుంది. చేతి దినపత్రిక జారిపోయింది. క్షణం కొయ్యబారిపోయాడు. మరుక్షణం ఒళ్ళంతా వణికిపోతూ స్వేదం అపశక్యంకాకుండా పెద్ద పెట్టున వచ్చింది. ముఖం చేతుల్లో కప్పుకుని వైపు తిరిగిపోయాడు! ఇంతవరకు తంలో ఎట్టి ఒడుదుడుకులు కన్నీరు కార్చని చంద్రశేఖరం కళ్ళ ఒకటొకటిగా నీటిబొట్లు జారి మీదుగా తలగడా మీదపడి తున్నాయి.

(అయిపోయింది)



# వారఫలం

## 15-1-1971 శుక్రవారం మొదలు
## 21-1-1971 గురువారం వరకు

**మేషం:** మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు. వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**మిథునం:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేయగలరు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేయగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య:** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:** వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

—మహేష్




బులినాయుడు పెట్టిన గావుకేక వరండాలో మోగి, లోపలింట్లో కొప్పు మీద కూచుని వాసాలు నాటుతున్న మేస్త్రీ ను స్తితం భయపెట్టింది. ఇంటి పాటే బులినాయుడు చుట్టూ జేరారు. పెద్ద మేస్త్రీ రాజుకాపు పంచె పర్గె

కుంటూ కొప్పుమీద నుంచి కిందకి దిగాడు.

'ఒరే పరబ్రహ్మం! ఎంకటసెట్టీ! మీరు కూడా దిగిరండేహే!' అని అరిచాడు కుంటికాలును ముందుకు వేస్తూ.

బులినాయుడు వెల్లకిలా పడుకున్నాడు. పెద్దకొడుకు వీరినాయుడు తండ్రిముఖం మీద చన్నీళ్ళు జల్లాడు. పెద్దకోడలు సీతాలక్ష్మి మావగారికి విసనకర్ర విసురు తోంది. మూడో కొడుకూ, నాలుగోవాడూ దిగాలుపడి నిలబడ్డారు. ఇంటావిడ రాజ్య లక్ష్మమ్మ పక్కగదిలోంచి దగ్గుతూ ఆరు స్తోంది—'ఏమైందర్రా!' అంటూ.

బులినాయుడు చాలా సేపటివరకూ అలాగే పడున్నాడు. ఉండుండి గొంతిస్తు

న్నాడు. అవి మామూలు
కావు. చాలా భయంకరంగాను
గానూ ఉన్నాయి.

చుట్టూ జేరిన జనం
గుండెలు దడదడలాడి పోతున్నా
కాపు కుంటికాలును దూరం
క్కూర్చుని, బులినాయుడు
మని కుడిచేతిని చేతుల్లో
బోయాడు. నాయుడు ఆ చే
కొపన్ను ఒక్కతోపు తోసాడు.
అంటూ రాజుకాపు దూరంగా
బులినాయుడు మళ్ళీ ఇల్లదు
పొలికేకవేయడంతో చుట్టూ జే
భీతాహుతై పోయారు.
లోపి విసనక్కరను అక్కడే

ర దగ్గరికి పారిపోయింది. ఆడ
్వరా ఏడుపు లంకించుకున్నారు.
చిన్నకొడుకులూ ఒక మూలకు
ు బిక్కుబిక్కుమంటూ చూడ
వీరినాయుడికేం పాలుపోలేదు.
ుసు లేవదీసి కూచోబెట్టి, 'పర
! ధాన్యం గొడంకాడ రెడ్డినాయు
ం. కేకేసుకురా!' అని పురమా
తండ్రిని 'బాబయ్యా!' అని
ం

నాయుడికి కొడుకు పిలుపేం అంద
ఒళ్లు విరుచుకుని, బద్ధకంగా
నట్టు ఒక పెద్ద అరుపు అరిచి,
ున్నాడు. తండ్రి వాలకం చూసి
ుడు భయపడ్డాడు.

కి ఒంటిమీద ఏ మీ స్పృహ
గాలేదు. చెట్టంతమనిషీ ముందుకూ
ఊగిపోతున్నాడు. కళ్లు చింత
గా ఉన్నాయి. బుగ్గమీసాలు
పొడుచుకొచ్చి మరీ భయంకరంగా

యుడు తండ్రి భుజాల్ని పట్టు
డు. ఒక్క హుంకరింపుతో, ఒక
ంపుతో అల్లంతదూరాన పడి
. ఎవరికేం జేయడానికీ తోచలేదు.
పు వెంకటసెట్టిని దగ్గరకు
ఆసాది పెదెంకటరెడ్డి'ని కేకే
సెట్టీ! ఏసరొట్ట తెమ్మను.
లోటి గాలీమాలీ ఎగిరిపోవాలి'
డు.

ం సెట్టి ఉరుకులూ పరుగులూగా
గుడివెంపు సాగిపోయాడు.

ంలో మేఘాలున్నాయి. తెల్లవారి
ంలైనా అప్పటికింకా సూర్యుడు
లేదు' బులినాయుడు కొత్త
కలప ఖరీదుచేదామని తనొక్కడూ
ఏ పదిరోజుల క్రితం రాజమండ్రి
ే తిరిగివచ్చాడు. తాముంటున్న
ా నలుగురు కొడుకులకూ సరి
గొడ్లో చిన్నయిల్లొకటి ప్రారం
అది దాదాపు పూర్తికావచ్చింది.
ండిళ్లుకూడా కట్టించాలన్న
గ, బులినాయుడు కలపకోసం
ంయ్యాడు. తిరిగివొచ్చిన బద్ధ
ంతనికి ఒళ్లు తెలిసిందిగాదు.
. తర్ద్ర పట్టింది, తూరుపు

# గాలి

తెల్లవారకుండ లేచి, పొలాలవైపుపోయి, అప్పుడే అతను తిరిగొచ్చాడు.

'ఒలే! ఒళ్లంతా పీకుతుందే! కోడల్ని ఏణ్నీళ్లు తోడమను—తానం చేత్తాను' అంటూ భార్యకుచెప్పి, చావిట్లో బనియనూ, పంచె విడిచేసి, తువ్వాలు నడుముకు చుట్టుకుని, మరో తువ్వాలు భుజంమీదవేసుకుని బులినాయుడు వరండాలోకి వచ్చాడు. వచ్చినవాడు చిచ్చరపిడుగులాగా గర్జించి కూలిపోయాడు.

ధాన్యం గోడౌం దగ్గర నుంచి రెడ్డినాయుడు ఆదరా బాదరాగా పరుగెత్తుకొచ్చాడు. రెడ్డినాయుడు రెండో కొడుకైనా మెరికలాంటి మనిషి, అతని సలహా లేనిదే ఆ యింట్లో ఎవ్వరూ ఏమీ చేయరు. అతను వొస్తూనే తండ్రిని చూసి ఒక్కసారి బావురుమన్నాడు

బాబయ్యా! కలపకెందుకెల్లావురా! నే ఎళ్తానంటే వొద్దని ఇలా బాదపడ్డావికేనా నువ్వెల్లింది?' అంటూ కన్నీరు పెట్టుకున్నాడు. వెంటనే తెలివి తెచ్చుకుని—ఒక్కక్షణం కర్తవ్యం ఏమిటని తర్కించుకున్నాడు.

'ఒరే అన్నా! బాబయ్యకూడా ఏదో గాలొచ్చింది. ఎన్ని బలిహారాలిచ్చినా ఇది బాబయ్యని బాదపెట్టందే వొదల్దు. నేనెల్లి పూజారమ్మని తీసుకొత్తాను. ఈలోగా పెదెంకటరెడ్డిచేత శాంతిచేయించు' అన్నాడు.

తమ్ముడి మాటలకు అన్నసరే నన్నాడు. ఆసాది పెదవెంకటరెడ్డి అట్టహాసంగా వొచ్చాడు. నుదుటను పెద్దకుంకుమ బొట్టుపెట్టాడు. చేతను వేప చివుళ్లు పట్టాడు. హ్రాం హ్రూం అన్నాడు. ఆసాది అరుపులకు బులినాయుడికి శివమెత్తిపోయింది. అతనులేచి పెద్దపులి మాదిరి హుంకరించాడు. ఆ హుంకరింపుకు మూలను నక్కిన చిన్నపిల్లలిద్దరూ కెవ్వుమని అరిచి వెక్కివెక్కి ఏడవసాగారు. రెడ్డినాయుడు వాళ్లిద్దరినీ తల్లి దగ్గరకు పంపించేశాడు.

చేయెత్తు మనిషి. ఏనాడూ అనారోగ్యమంటే ఏమిటో ఎరగనివాడు. అకస్మాత్తుగా ఏదో ప్రభావానికి లోబడిపోయి, ఒంటిమీద స్పృహలేకుండా బీభత్సం చేయడం ప్రారంభించగానే యింట్లో వాళ్లందరూ భయపడి పోయారు. ఆసాది అరుస్తూనే ఉన్నాడు. అంతకుమించి బులినాయుడు గాండ్రిస్తున్నాడు.

'నువ్వెవరవో చెప్పు. ఎందుకు వొచ్చావో చెప్పు' అని అరిచాడు పెదవెంకటరెడ్డి.

'చెప్పు'నన్నాడు బులినాయుడు.

'నే చెప్పనురా! నే చెప్పను! ఒరే! నీ కెందుకు చెప్పాలిరా! నేను దేవుడి కొడుకునురా! దేవుడి కొడుక్కు పెద్ద కొడుకునురా! నాకు బలిహారం యివ్వండి! నిజం చెప్పేస్తాను' అని శివం తొక్కాడు.

'ఏం కావాలో చెప్పు. యిత్తాం' అన్నాడు వీరినాయుడు.

'బలిహారం యిత్తావా? ఎర్రోడా! నాకు బలిహారం యిత్తావా' అంటూ పకపక నవ్వాడు బులినాయుడు.

రాజకాపు లోపలింట్లోకి వొచ్చి, మెట్లమీద కూచున్నాడు. చెవికొంచి సగం కాల్చిన చుట్టతీసి వెలిగించుకున్నాడు.

'ఒరే పరబ్రహ్మం! ఇదంతా ఏంట్రా!' అన్నాడు పొగవొదుల్తూ.

పరబ్రహ్మం నోరావలించి చూశాడు.

'రాజమండ్రిలో కలపెగుమతి సేసేటప్పుడు నాలుగు కోళ్లు కోసేరంట! నిన్నసందకాడ మల్లీ కోళ్లుకోసి అందరికీ భోజనాలెట్టేరు. ఇంకేం తక్కువ సేస్రేరా!' తనలోతను అనుకుంటున్నట్టు అన్నాడు రాజకాపు.

పరబ్రహ్మం బుర్ర గోక్కున్నాడు. రాజకాపు నిండా ఆలోచనలో మునిగి కూచున్నాడు. అతని దృష్టి దొడ్లో దూరంగా పాకలో పడిఉన్న కలపమీదుంది. మనసుపడి, కొడుకులమీది ప్రేమకొద్దీ కొత్తయిళ్లు కట్టించుకోవాలని బులినాయుడు కలప కొనుక్కొస్తే—కలపతో బాటు అదేదో—గాలో—శక్తో—దేవతో రావడమేమిటి? వొచ్చినా—అది తిరిగా కూచోక శివాలు తొక్కడమేమిటి? బలిహారం కావాలని అడుగుతుంది. ఏంకావాలి నీకని అడిగితే నువ్వేమివ్వగలవని ఎదురు ప్రశ్న వేస్తుంది. అందుకే దానిపేరు గాలి కాబోలు.

పరబ్రహ్మానికిమాత్రం గొప్పభయంగా

పోతే రేపు దేవుని ఎదుట సమాధానం చెప్పుకోక తప్పుతుందా......? ఎంతో దీనంగా అన్నాడు రంగయ్యతాత.

తాతా! మధ్యలో నీవు అడ్డుకోకపోతే వివరంగా అన్ని విషయాలూ చెబుతాను. నేను పై చదువులు మానడానికి మామయ్య ప్రమేయమే లేదు. పైగా ఎంతో ప్రోత్సాహం చూపించాడు నా చదువుపట్ల. నా తలిదండ్రులు కలరా మహమ్మారితో చనిపోవడం అందరికీ తెలుసు. నేనప్పుడు పసివాణ్ణి. నేను పెద్దవాణ్ణయ్యేంతవరకు నన్ను, నా ఆస్తిని పూవులలోపెట్టి కాపాడాడు. రోజుకు పదిసార్లైనా బాగా చదివించి పెద్ద డాక్టర్ని చేస్తానని అంటూ ఉండేవాడు. తన చెల్లెలి కుటుంబానికి ఏకాంకురమైన నన్ను ఒక డాక్టరుగా చూసి ఎంతో సంతోషించాలని పొంగిపోయేప్పుడు నేను కూడా మామయ్య ఆశలకూ, ఆశయాలకూ అనుగుణంగా శ్రద్ధగా చదువుకుంటూ ఆయనను సంతోషపెడుతూండేవాణ్ణి. నాకు పై చదువులు చదువుకోవాలనే కాంక్ష రోజు రోజుకూ ప్రబలమైపోయింది. డాక్టరునై పల్లె ప్రజలకు రాత్రింబవళ్ళు సేవ జేయాలనే కోరిక ఉండేది. కాని విధి బలీయమైనది. ఆ విధి ముందు మానవ శక్తి సామర్ధ్యాలు ఎంతకూ పనికిరావు. ఒకరోజు మామయ్యకు జబ్బు ఎక్కువైంది. మన ఊరి డాక్టరుపై నాకు నమ్మకం సన్నగిలి హైదరాబాదు నుండి పెద్ద డాక్టరును తీసుకవచ్చి చూపించిన సంగతి మీ కందరికీ తెలుసు. ఆతర్వాత జరిగిన విషయాలే ఎవ్వరికీ తెలియవు. గుండె జబ్బు అని ఎటువంటి బరువు పనులు చేయకూడదనీ, మానసికంగా కూడా ఎటువంటి అఘాయిత్యాలు ఏర్పడకూడదనీ, గొక్కి చెప్పాడు. సమస్య అప్పుడు, ప్రారంభమైంది. మాయింట్లో నేను పై చదువులకు వెళ్ళ వలసిన గడువు రెండు మూడు రోజుల్లో వుంది. అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి. మామయ్య అనారోగ్యం కుటుంబానికి గొడ్డలి పెట్టు తయారైంది. కానీ ఏమాత్రము నన్ను ఆటంకపరచలేదు. పైగా త్వరగా వెళ్లిపోవలసిందని హెచ్చరించడం ప్రారంభించాడు ఆయన. నే ఆలోచించాను త్వరపడి నాస్వార్థం ఆలోచించి వెళ్లిపోతే ఈ కుటుంబమేమవుతుంది..? ఎలా? తల్లి దండ్రుల ప్రేమను పంచుకో లేక పోయా అత్తయ్య మామయ్యలు నాకు ఏ లోటూ రాకుండా పెంచారు. వారి పోషణలో నాకు తలిదండ్రులు లేరనే విషయమే తోచలేదు. నాకు బుద్ధి తెలిసిన రోజు మామయ్య మా కుటుంబం సంగతంతా పూస గ్రుచ్చినట్లు చెప్పాడు. విషయమంతా అప్పుడు నాకు తెలిసింది. ఆయన పట్ల నా హృదయం కృతజ్ఞతాభావంతో నిండి పోయిం



టామ్‌ఫ్రరార్ వృత్తి కొళాయిలకి సంబంధించినది. అతనికి ఒక జత డాల్మేషియన్ కుక్కలు ఉన్నాయి. వాటికి ఈ మధ్య 15 పిల్లలు పుట్టాయి! వీటి పెంపకంతో ఇబ్బంది పడుతున్నాడు టామ్స్

మయ్యను గురించి డాక్టరు చేసిన హెచ్చరిక కు పదే పదే గుర్తుకు రావడం ప్రారంభించింది. సవు, బాధ్యతలు పాలేర్లపై పెట్టి, అంత పెద్ద వసాయాన్ని వదలి వెళ్లడం నాకిష్టంలేక పోయింది. ు పై చదువులకు వెళ్లడంతో వ్యవసాయం ధ్యతలు పూర్తిగా మామయ్య మీద పడ యి. నేను నా చదువు సాగిస్తూ కూడా పొలము సలు కొన్ని కొన్ని చూసు కుంటూ వుండడం , కాస్త వెసులు బాటుగా వుంటూ ఉండేది మనకు. మరి యిప్పుడో,...? అసలే ప్రమాద మైన జబ్బు. ఏమాత్రము అలసట పనికిరాదని క్టరు చెప్పాడు. ఆ విషయాల నన్నింటినీ బాగా ోచించి నేను పై చదువులు మానుకోవాలనే డ నిశ్చయానికి వచ్చాను. అంతకు అవసరమను ంటే నేనే ఒక ఆస్పత్రిని యిక్కడ ఏర్పాటు యించాలని ఊహించాను. మామయ్య ఒక్క గ్గాన నా నిర్ణయాన్ని ఆమోదించలేదు. చనిపోయి గ్గాన ఉన్న చెల్లెల్ని ఆత్మకు శాంతి ఉండదనీ, ు శపిస్తుందని, ఎంతగానో బాధ పడ్డాడు. పోయిన వారి ఆత్మశాంతి కోసం బ్రతికున్న వి హింస పెట్టడం నాకు ఇష్టంలేదని, నా ్యయం మార్చుకో తలచలేదని నొక్కి చెప్పి ్పించాను. ఆయనగారిని ఒప్పించేసరికి నా తల ణం తోకకి వచ్చింది. ఇక శాంత పై చదువు— నెలాగూ అవకాశంలేక ఆగిపోయాను. అన్ని విధాల కాశం, ఉత్సాహం ఉన్న శాంతను ఆపడం నా ్ంలేకపోయింది. మామయ్య కాదంటున్నా ాడి శాంతను పై చదువులకు నేనే పంపిం ు. ఇందులో మామయ్య నాకు చేసిన అన్యా ్మేమున్నదంటావు.....? అంతా నా యిష్ట కారమే జరిగింది. ఇప్పుడు చెప్పు....ఏం చెప్ప ుకున్నానో...... ? దీర్ఘంగా నిట్టూరుస్తూ ుం.

# మల్లెలు..

ఇంత గ్రంథం జరిగిన సంగతి ఎవరికి తెలు నాయనా......? జరిగిన సంఘటనలకు బాధపడిన వాళ్లమేకాని, యివన్నీ ఆలోచించలేదు. అయినా అసలు విషయం తెలుసుకోకుండా ఆలోచించే యోచన లన్నీ యిలాగే ఉంటాయి. నిజంగా నిన్ను అభి నందించాలి. కుటుంబ శ్రేయస్సుకోసం నీ భవి ష్యత్తును పాడు చేసుకున్నావు. ఇల్లనీ, సంసార మనీ, పెద్దవాళ్లకు అండగా నిలబడ్డావు. ఈ ముద నష్టపు కాలంలో ఎవరు వాగునా నీలా ఆలోచించే వాళ్ళు. నా సంసారమే చూడు. ఉండడానికి ముగ్గురు కొడుకులున్నారు. ఒక్కరూ నన్ను అదుకోరు. ఎందుకు ఉండి......? నిన్ను చూసినప్పుడల్లా నా హృదయం సంతోషంతో పొంగిపోతూ ఉంటుంది. అటు గ్రామానికి పెద్దవై యిటు కుటుంబాన్ని చక్కదిద్దుకుంటూ నలుగురిచేత సెభాష్ అని పించుకుంటున్నావు.

ఇప్పుడు నన్ను గురించిన పొగడ్తలు ఎందుకు తాతా......? పొగడ్తలకు యిష్టపడని రామం పై మాటలంటూ మళ్లీ నీ సందేహం తీరినట్లేనా ఇక యింటికి వెళ్లాలి. నాకోసం రెండు గంటల క్రితమే యింటినుండి కబురు వచ్చింది. పని తీరక వెళ్లలేదు అని లేచి యింటివైపు దారి తీశాడు.

మంచిది బాబూ వెల్లొస్తా, అని రంగయ్య తాత తన యింటివైపు నడిచాడు.

* * *

బాలభానుని లేత కిరణాలతో పల్లెంతా బంగారు మలాము చేసినట్లు మెరిసిపోతూ వుంది. అప్పటికి రైతులు పొలం పనులపై వెళ్లిపోయారు. ఆడవారు వారివారి పనులలో నిమగ్నులయిపోయారు. లక్ష్మయ్యగారి యింట్లో సందడి ప్రారంభమై యిల్లు కళకళలాడుతూ వుంది. పశువులకు మేత వేస్తున్న పాలేర్లు, పాలు పితుకుతూ వున్న పాలేర్లు. వీరందరి మధ్య పనులు పురమాయిస్తూ తిరు గుతూ వున్న పెద్దపాలేరు పుల్లయ్య పొలికేకలు. ఒకటే సందడి...

ఆచుట్టు పట్నగల అన్ని గ్రామాలలో లక్ష్మ య్యగారి వ్యవసాయం పెద్దది. లక్ష్మయ్య గారి ఆస్తితో అతని సోదరి ఆస్తి కలిసినందు వల్ల ఒకచిన్న కరహా జమీందారీగా తయారైంది. రామం హెచ్. ఎస్. సి.తో చదువు ఆపి వ్యవసాయపు పనులు స్వయంగా చూసుకుంటూ వుండటం వల్ల సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతూ మును పటి కన్నా ఎక్కువ ఆదాయం వస్తూంది. ఖర్చు తక్కువ ఆదాయం ఎక్కువ. లక్ష్మయ్యగారు ధార్మిక చింతన, ఆస్తికత్వము, సహృదయముగల వ్యక్తి. తన స్వంత ఖర్చుతో ఒక ఆలయాన్ని ఆ గ్రామంలో నిర్మింపజేసి, అందులో శివకేశవులను ప్రతిష్ఠ చేయించి, శివకేశవులకు బేధము లేదనే సత్యాన్ని నిరూపించారు. లక్ష్మయ్యగారికి మగ సంతానం లేదు. ఒక్కతె ఆడపిల్ల. చెల్లెలు కొడు కుని యిల్లరికం ఉంచుకోవాలని పిల్లల చిన్న వయసులో ఉబలాటపడేవాడు. కాని తన బావ గారిది కూడా సంపన్న కుటుంబమే కావడము వారికే ఒకే కుమారుడు వుండడం వల్ల ఒప్పు కుంటారనే ధైర్యం లేక అడిగి కాదనిపించు కోవడం బాగుండదని ఊరుకున్నాడు. కాగల కార్యాన్ని గంధర్వులే తీర్చినట్లు రామం తల్లిదండ్రు లిద్దరూ కలరావల్ల ఒకేసారి మరణించడం జరి గింది. వారిది వీరి ఊరి ప్రక్కఊరే! భూములు కూడా వారివి వీరివి కలసి ఉన్నాయి. కనీసం, చెల్లెల్ని బావగారిని చివరి చూపులకు కూడా నోచుకోలేని లక్ష్మయ్య గారు దుఃఖ భారంతో ఆయిళ్లకు తాళాలు వేయించి, పసివాడైన రామాన్ని తీసుకొని స్వగ్రామం వచ్చారు. అప్పటినుండీ మేన ల్లుణ్ణి కంటికి రెప్పలా కాపాడుతూ, కుర్రవాడి చదువు సంధ్యల విషయంలో అమిత శ్రద్ధ చూపుతూ పెంచి పెద్ద చేశారు.

వారి అభిప్రాయాలకు అనుగుణంగా రామం చక్కగా చదువుకొని హెచ్. ఎస్. సి. ఫస్టు క్లాసులో ప్యాసై ఆవృద్ధ దంపతుల కనుకొలకులలో ఆనంద భాష్పాలు నిలవడానికి కారకుడయ్యాడు. రామాన్ని డాక్టరుగా చూసిగాని విశ్రాంతి విషయము ఆలో చించ కూడదని నిర్ణయించుకున్న లక్ష్మయ్యగారి ఆశయానికి విధి అంతరాయాన్ని కలిగించింది.

రామం పై చదువు కొనసాగక పోవడంతో అతనికి అన్యాయం చేస్తున్నానా అని బాధపడ్డారు లక్ష్మయ్య గారు. ఆబాధ మరుగు పడిన తర్వాత శాంతారామం వివాహం జరిపిద్దామని అనుకుంటున్న సమయంలో శాంత పట్టు బట్టి పై చదువులకు వెళ్లడం జరి గింది. పిల్లలు పెద్దవారై తను మాటలను కాదన్నా రన్న బాధ ఒక ప్రక్క, తను అవకాశం లేక చదువు ఆపి, తనకు కాబోయే భార్యను పై చదువులకు



పంపించడానికి ప్రోత్సాహపరుస్తున్న మేనల్లుడు రామం ఆదర్శం వల్ల కలిగిన ఆనందం ఓ ప్రక్క, రేపు తన కుమార్తె పెద్ద చదువులు చదివి, రామాన్ని పెళ్ళాడడానికి నిరాకరిస్తుందేమోనన్న విచారం మరొక ప్రక్క. ఇన్ని ఆలోచనల మధ్య సతమత మవుతున్నారా వృద్ధదంపతులు తీరని ఆవేదనతో—

రాత్రి హరికథా కాలక్షేపాన్ని జరిపించిన రామం ప్రొద్దుపోయి లేచాడు. లేచిన వెంటనే నిత్య కృత్యాలు తీర్చుకొని పశువులశాలవైపు వెళ్ళాడు. పశువులను పేరు, పేరుతో పరామర్శించడం రామానికి అలవాటు. రామాన్ని చూడగానే ఆమూగ జంతువులు మోరలు పైకెత్తి, తోకలు ఊపుతూ సంబర పడతాయి. వాటి ఆప్యాయతానందంలో పాలు పంచుకుంటూ, ప్రతిపశువునూ నిమురుతూ కొంతసమయాన్ని ప్రత్యేకంగా వాటికోసరం కేటాయిస్తాడు ప్రతిరోజు. ఇది అతని దినచర్యలో ఒకభాగం. రామం పశువుల పాకలో ఉండగానే యింటి లోపలినుండి కేక వినిపించింది. ఆపిలుపు ఫలహారం చేయడం కోసమని రామానికి తెలుసు. వెళ్ళి ఫలహారం చేయడానికి కూర్చున్నాడు. అతని ప్రక్కన లక్ష్మయ్యగారు కూడా కూర్చున్నారు. పార్వతమ్మ ఫలహారం పళ్ళాలలో వడ్డించింది.

ఒరేయ్....! అమ్మాయి ఉత్తరం వ్రాసింది. కాలేజీపిల్లలంతా ఏదో ఊర్కి వెళ్ళడానికి వెడుతున్నారట! తనుకూడా వెళదలచుకున్నదనీ, వెంటనే డబ్బు పంపించ వలసిందనీ, వ్రాసింది. అదేదో పేరు గమ్మత్తుగా ఉంది ..ఎక్స్... .....?

లక్ష్మయ్యగారు మాట పూర్తి చేయకుండానే ఎక్స్‌కర్షన్ మామయ్యా...! మంచిదే! ఈ విద్యార్థి దశలో తప్ప చూడడానికి మళ్ళీ అవకాశం లభించదు. డబ్బు పంపిస్తూ జాగ్రత్తగా వెళ్ళిరమ్మని వ్రాస్తాను. నీవేమంటావు....? మామయ్య కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు రామం. శాంత ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళడం మామయ్యకు యిష్టం లేదన్న విషయం అతని ముఖకవళికల వల్ల పసిగట్టాడు.

ఏమోరా! నాకు ఏమాత్రం యిష్టంలేదు అసలు దాని పై చదువులే నాయిష్టప్రకారంసాగ లేదు. ఇటువంటి విషయాలలో నాయిష్టాయిష్టాలతో దానికిగాని, నీకు గాని ప్రమేయమేముంది.? మొదటినుండీ నీయిష్ట ప్రకారమే జరుగుతూ వచ్చింది ఇది కూడా నీయిష్టమే..! నిష్ఠూర పడుతూ, ఎంతో ఆవేదనను ముఖంలో ప్రస్ఫుటింప జేస్తూ అన్నాడు.

అలా నిష్ఠూర పడతావేం మామయ్యా..? శాంత నీకు ఒక్కగానొక్క కుమార్తె. యిష్టప్రకారం ఆమెను చదువుకోనివ్వడం మన ధర్మం. అవకాశం లేనివారు ఎలాగూ చదువుకో లేరు. అవకాశము, ఆర్థిక స్తోమత, ఉత్సాహం యివన్నీ ఉన్నవారు చదువుకోవడంలో తప్పేముంది....? చదువుకొని మనను లెక్కచేయదేమో నని కదూ నీభయం....? శాంత తెలివితేటలు కలది. పైగా చక్కని సంస్కారంతో విశాలోష ణలో పెరిగింది. అటువంటి ఆమెను మనం మరో విధంగా ఊహించుకోవడమంటే మనను మనమే శంకించు కోవడ మవుతుంది.

అన్నీ సక్రమంగా జరిగితే బాధపడవలసిన పనే లేదు. అలా జరుగనినాడు మాగతిఏమవుతుందో ఆలోచించావా నాయనా....? కొడుకువైనా అల్లుడవైనా నీవే...! రెండు కుటుంబాలనూ ఉద్ధరించవలసిన వాడవు. నీవు దాని పట్టుదలను బలపరచక పోయినట్లైతే ఈపాటికి మనవడినో, మనమరాలినో ఎత్తుకొనే వాళ్ళం మేము అంటూ వాపోయింది పార్వతమ్మ.

ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు....? ఎలా జరుగవలసి ఉంటే అలా జరుగుతుంది. ఊరికే మనం బాధపడడమే గాని, అసలు వాళ్ళకు చీమ కుట్టినట్లైనా లేదు. ఫలహారం ముగించిలేస్తూ అన్నారు లక్ష్మయ్యగారు.

ముందు జరగబోయేదాన్ని ఊహించుకొని యిప్పటినుండే బాధపడడమెందుకు మామయ్యా..? అన్నీ శుభంగా జరిగి పోతాయి.

నీ నోటి పుణ్యాన అలా జరిగితే మేము అదృష్టవంతులమే బాబూ ఖాళీ పళ్ళాలను పెరట్లోకి తీసుకువెడుతూ అంది పార్వతమ్మ.

ఉత్తరం చదువుకొని ఏం నిశ్చయించావో చెయ్యి. నిన్ను గొప్ప డాక్టరుగా చూడాలనుకొన్నాను. మీ అమ్మపేరుతో ఆస్పత్రి కట్టించి పేదలకు ఉచిత వైద్య సదుపాయాలు ఏర్పాటు చేయిద్దామను కున్నాను. తానొకటి తలిస్తే దైవమొకటి చేసినట్లు అనుకున్న దొకటి, జరిగినది మరొకటి....! ఈనాడు డబ్బు నాకిప్పుడే కావాలా.....? నీ చదువుకు అటంకంగా.....! ఇంట్లో ఉండవలసిన అమ్మాయి పై చదువులకు వెళింది. చదువుకోవలసిన నాయన యింట్లో ఉండవలసి వచ్చింది అతని కళ్ళు బాధను వ్యక్తం చేస్తున్నాయి.

బాధపడకు మామయ్యా... నీ ఆశయం నెరవేర్చే బాధ్యత నాది. రంగయ్యతాత చిన్నకొడుకు సుందరం మెడిసిన్ చదువుతున్నాడు. వాడు డాక్టరై వచ్చేసరికి యిక్కడ ఆస్పత్రి భవన నిర్మాణానికి ఏర్పాటు చేయిస్తాను. ఆస్పత్రి భవనం మన మామిడి తోటలో కట్టించాలని నా ఉద్దేశం ఉత్సాహంతో చెప్పుకుపోయాడు రామం.

ఇంటివాడివలె చేసేవాడు లేడు, బయటివలె తినేవాడు లేడన్నట్లు, నీవు డాక్టరువై ఆస్ప చూసుకొన్నట్లు బయటివారు చూస్తారని నమ్మేమిటా.....? సుందరం అలతే సోకులు మ నటువంటివాడు. ఈపల్లెటూర్లో వైద్యం చేస్త నాకేమాత్రం నమ్మకం లేదు. వాణ్ణి దృష్టి పెట్టుకొని మాత్రం ఆస్పత్రి భవనం మొద పెట్టకు.

అయ్యవారు రాకపోతే అమావాస్య ఆగ టుందా? వాడుకాకపోతే వాడి తాతలో జేజ మరొకడు. లోకం గొడ్డుపోయిందా? డబ్బు కు రించే వాళ్ళు ఉండాలేకాని ఈరోజుల్లో డాక్టర్ల కొదువ? ఏదో నా స్నేహితుడు, కలిసి చదువుకున్నాం అని వాడిని గురించి ఆలోచిస్తున్నా అంతే.....! ఒప్పుకుంటే ఒప్పుకున్నాడు. లేకపో మరొక ప్రయత్నం చేద్దాం!

అయినా ఈ గొడవలన్నీ నాకెందుకు? ఒకే బాధ్యతలన్నీ నీపై ఉంచేశాను. ప్రాణం ఊగిస అప్పుడప్పుడు పిచ్చిగా మాట్లాడుతూ ఉంటా అదను ఎరిగి సేద్యం, పదును ఎరిగిపైరు ట్లుగా అన్ని విషయాలలో నీవు ఆరితేరావు. ఎప్పుడు ఎలా చేయాలో నీకు తెలుసు. వి మధ్యగా తెల్లని పలువరుస కనుపించే విధంగా నవ్వు నవ్వుతూ అన్నారు లక్ష్మయ్యగారు.

పేరుకే పెత్తనం నాది. నీకు చెప్పకుండా, అనుసరించకుండా ఏ చిన్నపనైనా చే మామయ్యా ?

...అదేరా నీ గొప్పతనం. కాదు అని అనలే గొప్పగా చెప్పి ఒప్పిస్తావు. ఎటువంటి వాణ్ణై నీకు అనుగుణంగా మార్చుకుంటావు. రచ్చ దగ్గరకు పయనమవుతూ సంతోషంతో అన లక్ష్మయ్యగారు.

(ఇంకా ఉం



# ఎయిర్ లైన్ ఫ్రాక్







క్రాసు కత్తిరించే విధానం

ఎయిర్‌లైన్ ఫ్రాకు చిన్న పిల్లలకి చాలా అందంగా ఉంటుంది. తయారు చెయ్యడం తేలిక. ఎక్కువ గుడ్డకూడా పట్టదు.

ఒక అర్ధమీటరు బట్టలో ఈ ఫ్రాకు తయారైపోతుంది. కావాలనుకుంటే పైపింగ్ లేస్ (హాఫ్ లేస్), ఎంబ్రాయిడరీ, పెయింటింగ్ లాంటివి ఫ్రాకు అందాన్ని ఇనుమడింప జేస్తాయి.

ఈ క్రింద ఇచ్చిన కొలతల ప్రకారం—పటంలో చూపించిన రీతిగా అందమైన ఫ్రాకు స్వయంగా తయారు చేసుకోవచ్చు.

**కొలతలు:**

పొడవు. 18 అంగుళాలు.

విడుటిభాగం 16 అంగుళాల వెడల్పు.

వెనకభాగం 20 అంగుళాలు.

(భుజాలు) షోల్డరు—$10\frac{1}{2}$ అంగుళాలు.

స్లీవు (చేతి కత్తిరింపు) 5 అంగుళాలు.

మెడ కత్తిరింపు — దిగువభాగం. 2 అంగుళాలు. ప్రక్కభాగంకూడ 2 అంగుళాలే వుండాలి.

వెనకమెడ $1\frac{1}{2}$ అంగుళాలు దిగువ వచ్చి, మిగిలినది పై భాగం మెడ ఎంత వరకు వచ్చునో అంతవరకు కత్తిరించవచ్చును. బటన్సు అతికే పట్టీలు పూర్తిగా తయారయ్యాక పై భాగం మెడ ఎంత వెడల్పయితే వుంటుందో యిది అంత వెడల్పే రావాలి.

'ఇక పైపింగ్' ఇది నలు చదరంగా వున్న బట్టను మూలనుండి మడిచి పెట్టాలి. అరంగుళం వెడల్పులో సన్నగా ఆ క్రాసు యాంగిల్‌లో యెన్ని ముక్కలయితే వస్తుందో అన్ని ముక్కలు కత్తిరించి పెట్టుకోవాలి. వాటన్నిటిని ఒకేపొడవు వచ్చేటట్లు అతుక్కోవాలి. ఆ తరువాత ఆ పొడవునా బాగా సాగదీసి — వో చివరగా సన్నగా ఒక్కటిమాత్రమే మడత వచ్చేటట్లు పొడవుగా కుట్టుకుంటూ పూర్తి చెయ్యాలి.

డిజైన్ ప్రకారం గీసుకుని ముక్కలు కత్తిరించుకుని — ముందుగా వెనకభాగం బి. నెంబరు 3 ను కుని కుట్టేందుకి సిద్ధం చేసుకోండి. పదహారంగుళాల ఫ్రాకుకి 8. అంగుళాల వోపెన్ చాలు (బటన్సుకి).

ఎడమ భాగంలోని మడత రెండు మడతలకి వచ్చేటట్లు నాటు పెట్టుకున్న వరకు మడిచికుట్టాలి.

బటన్సువచ్చే పై భాగం కుడివైపువై వుండాలి.

అప్పటికి మనం అనుకున్న ప్రకారం వెనకభాగంలోని రెండంగుళాల బట్ట మడత లోనికి పోతుంది. చివరికి మిగిలేది 16 అంగుళాలు. మడతలు పెట్టినప్పుడు ఫ్రాకు వెనకభాగం ఖాళీగా వుండిపోతుంది. దాన్ని కత్తిరించేముందు మడిచిన రీతిలో మధ్యకి మడిచి 16-అంగుళాలకి మించి వున్న బట్టనంతా, బటన్సు అతుక్కొనటానికి తయారించివుంచిన వరకు లోపలిగా వుండిపోయేటట్లు వెడల్పుగా కుట్టుకోవాలి. అప్పటికి వెనకభాగంపని పూర్తిగా అయిపోతుంది. కత్తిరింపుతోపాటు భుజాలు అరంగుళం మేర షేప్పు తీయాలి. అలా తీసి చేసినప్పుడే షోల్డరు అందంగా కనిపిస్తుంది.

మెడభాగంనుండి ప్రారంభించి భుజాల వరకు రెండేసికుట్లు వేసి చూసుకోవాలి—తరువాత క్రాసుగా తీసి వుంచుకున్న తెల్ల పైపింగు ముక్కని మెడకి చేతులకీ క్రమం తప్పకుండ అతుక్కోవాలి. దాన్ని లోపలి భాగానికి వొత్తుకుంటూ మంచి ఎయిపు నుండి మిషన్‌మీదుంచి పైపింగ్ బోర్డరు వెంబడే మెల్లగా కుట్టుకుంటూ రావాలి.

తరువాత ఫ్రంటుభాగాన్ని సరిగా పరిశీలించుకుని వెనుక భాగంమీద జాగ్రత్తగా కలుపుకుంటూ అతుక్కుపోవాలి.

చాలా తక్కువ కుట్లతో తయారయే ఫ్రాకిది. ఫ్రాకు చివరి బోర్డరు మాత్రం మనకి కరెక్టుగా పదహారంగుళాలు వచ్చేలా చూసి చేతికుట్టు వేసుకోవాలి.

దీనినే కొద్ది మార్పులతో లూజు చేతులు పెట్టి తయారు చేసుకోవచ్చు. ఇవే కొలతలతో రంగుల ముక్కలతో తీర్చి దిద్దవచ్చు.

—కృష్ణప్రియ ●

# ముదితలు-ముగ్గులు



అబ్బే! దారితప్పిరాలేదు పిన్నిగారూ! రథంముగ్గువేస్తూ ఈ వీధికొచ్చాను. ఎలాగూవచ్చాగదా మిమ్మల్నోసారి చూసి పోదామని.....

మీరు ముగ్గులేయడం మానేసి కొన్ని రోజులు రెస్టు తీసుకోవాలి!

గ్రంథా పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు

ఏమండీ! మనకింతపెద్ద ప్రెస్సుంది గదా - నేవేసిన ముగ్గులు ఓ పుస్తకం వేయించరూ!

చాల్లేవూరుకో! నేరాసిన్నవల అచ్చు వేయడానికే భయపడుతున్నా

ఈసారి పండక్కి ప్రత్యేకమైన చీరలు అమ్ముతున్నారట - ఇవేనా అవి?

ఇదుగో! ఆముగ్గు నే వేస్తాగానీ నువ్వోసారి ఇలా తగలడు!

ఈ నెల అదనపు ఖర్చు: పదిరూపాయల ముగ్గు!

# సంక్రాంతి ముసుగులు



చోడిశె రామబ్రహ్మయ్య

కైలాసం పార్టీ ఎందుకిస్తున్నట్టు?
ఈ ప్రశ్న పొద్దుట్నుంచి నన్ను పీడిస్తోంది. మిగతా ఆహ్వానితులందరితో ట్టు. కాని సమాధానం మాత్రం దొరకటం ను. ఎంత బుర్రబద్దలు కొట్టుకున్నా— విడిచిన మేనత్త ఎవరయినా తన గావాస్తికి మనవాణ్ణి ఏకైక వారసుడిగా యించి, దరిమిలా తను టిక్కెట్టుచ్చుందా?—లేక తమిళవాడు లాటరీతాలుకు ంపర్ప్రైజ్'గాని తగిలిందా? ఏమయుంది? వాడిలా అకస్మాత్తుగా పార్టీ ఇవ్వనుకోవడానికి కారణమేమయుండచ్చు?—

స్కూల్లో ఉన్న మేస్టార్లందర్నీ పిలిడు, బాల్యమిత్రుడనయిన నన్నూ, ంబర్‌వన్ విరోధి' అయిన నర్సింహం 'స్టారితోసహా! అసలు వాడికి ఒకళ్ళ మీద్ద చెయ్యిపెట్టటం. ఏదో కారణం ఎవరో ఒకడివేత పార్టీ లిప్పించే నేర్పుందేగాని, తానే ఇచ్చే అలవాటులేదే! ఉదాహరణకి చెప్పుకోవాలంటే నిరుడీ రోజుల్లో 'భాగోతం'చెప్పే దానయ్య నాయుడి అప్పటికి మేనగోడలు, కాబోయే అర్ధాంగి అయిన బుచ్చామణి, చాలా రోజులు 'అవనా, వద్దా' అని సంకోచించిన పిదప రజస్వల అయిన వార్త ఎలా తెలుసుకొన్నాడో ఏమోగాని, దానికి విస్తృత ప్రచారమిచ్చి అతను తనతోపాటు మా అందరికీ, గంగయ్యసెట్టి కొట్టు నుంచి అరువుపెట్టి 'మైసూర్ పాక్' తెప్పించేదాకా ఊరుకొన్నాడు కాదు — తర్వాత ఆ రెన్నెల్లు తిరక్కుండానే, నాయుడు, సదరు బుచ్చామణిని పాణిగ్రహణం చేయడాన్కి, ముహూర్తం నిశ్చయమయిన సందర్భంలో మరో తేనీటి విందు ఇప్పించేడు —

మరోసారి తెలుగు పండితుడు ఆంజనేయ శాస్త్రులు, నిజభార్య పోరుపడలేక, ముప్పై మూడున్నరేళ్ళుగా సంరక్షించుకొంటూ వస్తూన్న ముచ్చటైన తన పిలక క్రాఫుకు స్వస్తి చెప్పిన శుభసందర్భంలోకూడా మా అందరికీ తేనీటివిందు లభించింది. అంతేకాని వాడుమాత్రం ఇద్దరు పుత్రికామణుల తర్వాత మొన్నీ మధ్యనే వంశానుద్ధరించే పుత్రరత్నం ఉదయించేకాకూడా, ఎంతమంది, ఎంతలా అడిగినా, పైసాకూడా ఖర్చు చేయలేదు.

అటువంటి కైలాసం ఈవాడిలా ఎవరూ అడక్కుండానే 'తేనీటివిందు' ఇవ్వబూనుకోవటం అందరికీ, ఆశ్చర్య కారణమే అయింది. కర్మ! 'నాక్కూడా ఏం తెలియదని' మొత్తుకొంటున్నా ఎవరూ నమ్మటం లేదు!

నిజమే మరి! వాడు నాక్కూడా ఏసంగతి ముందుగా తెలియనివ్వకుండా, ఇలా ఈ ఆర్భాటానికి పూనుకోవటం చాలా అన్యాయం, అక్రమంటూన్నాను.

కైలాసం నేనూ, ఒకే ఊళ్లో పుట్టాం! ఒకే తోటలో ఆడుకున్నాం! చెడ్డీలు తొడుక్కోకుండా ఒకే చెరువులో ఈత నేర్చుకొన్నాం! చెడ్డీలు తొడుక్కొని ఒకే బళ్లో 'మాష్టరు గిరీ' వెలగబెడుతున్నాం!—

అటువంటి చెట్టంతవాన్ని, కైలాసం నిర్లక్ష్యం చేయటం నాకూ ఆశ్చర్యంగానే ఉంది. అంతకుమించి బాధగానూ ఉంది!

'ఇంతకీ ఈ కైలాసంగారు పార్టీ ఎందుకిస్తున్నట్టుంటారు? కొంపతీసి ఈయనగారి రచనేదైనా, ఏ పత్రిక వాళ్లైనా, వాళ్ల ఖర్మకాలి ప్రచురణకు స్వీకరించారంటారా?' అని ఇందాక కడుపుబ్బరం ఆపుకోలేని రామనాథం నా చెవి కొరికినప్పుడు 'నో! నొనొన్నో!! అటువంటి ప్రమాదమేమీ జరగలేదు. అలా జరగటం అసంభవంకూడాను!' అని ఖండితంగా చెప్పేసాను.

అలా, అంత కచ్చితంగా, రెండో ఆలోచనకు తావివ్వకుండా చెప్పగలిగానంటే నాకు వాడిమీద అభిమానం తక్కువయి కాదు—ఏమైనాసరే ఎప్పటికైనా 'రచయిత'నయి పోవాలనే వాడి తీరని కోరిక పట్ల సానుభూతి తక్కువయీ కాదు! వాడు రచయితగా వెలుగొందాలన్న కోరిక నా గుండెల్లోనూ గూడుకట్టుకొనుంది. కాని ఎవరైనా 'ఏమండీ, మీ దొడ్లోని ఆ తాడిచెట్టు మల్లెపూలు పూస్తుందంటారా' అని అడిగితే 'అసంభవం' అనే చెప్పాలికదా. ఆ తాడిచెట్టుమీద, అది ప్రతిసంవత్సరం దండిగా సప్లయి చేస్తున్న 'ముంజెలమీద ఎంతభిమానం ఉన్నప్పటికీను!

—పాపం కైలాసం ఏదో ఎరగతి చదువుతున్నప్పట్నుంచి, తన రచనా వ్యాసంగాన్ని విసుగులేకుండా, నిరుత్సాహపడకుండా సాగిస్తూనే ఉన్నాడు! వాడు మోకాళ్లుదిగే పొడుగులాల్చీ. మున్సిపాల్టీ వాళ్లకి పని కల్పించే లూజు పైజమా, తొడుక్కొని, చేతిలో జిప్ బేగ్తో, దాని చిరుగుల్లోంచి, బయటి ప్రపంచాన్ని తొంగిమూసే కాగితాల కట్టలతో, కళ్లజోడు పదేపదే సవరించుకొంటూ, గిరజాలజుత్తు ముఖంమీదికి లాక్కుంటూ, కాళ్లకి జోళ్లులేకుండా, మా 'సర్వాపురం' వీధుల్లో ఆకాశంకేసి చూస్తూ నడుస్తూ పోతుంటే, చిన్నసైజు 'భావకవి'లా కనపడేమాట వాస్తవం! కాని ఇంతవరకు వాడి రచన ఒక్కటైనా వెలుగులోకి రాకపోవటం మరి, బాధాకరమైన పచ్చినిజం!!

కైలాసం మొదటిసారిగా రాసిన 'గంగిగోవు' అన్న వ్యాసం స్కూలు మేగజైన్లో ప్రచురణార్హంగా భావించబడలేదు! ఆనాటి నుంచి ఈనాటివరకు కైలాసం కలం నుండి వెలువడ్డ ప్రతీఒక్క రచనకూ అదేగతి పట్టింది—

కొన్నివందల సంఖ్యలో అన్నిరకాల రచనలు చేసాడు — అన్నిరకాల కథలు—చిట్టికథలు, చిన్నికథలు, పెద్ద కథలు, నవలికలు నవలలు, రాసాడు— అందులో కొన్ని ట్రాజెడీలు, కొన్ని ట్రాజీ కామెడీలు కాగా, మరికొన్ని ఫక్తు కామెడీలు— నాటికలు, నాటకాలు, జీవిత చరిత్రలు, పురాణకథలు జానపదకథలు రచించాడు. అయినా, 'తెలుగు దేశం'లోని ఏవార, పక్ష, మాసపత్రికగాని, ఏ ప్రచురణ సంస్థగాని, ఇంతవరకూ, వాటిలో ఏఒక్క రచననూ అచ్చులోకి తీసుకురావడాన్కి సాహసించలేదు — వాడి అనువాదాలకీ, అనుకరణలకీ కూడా అదేగతి పట్టింది— ఎన్నికలాలు, కలం పేర్లు మార్చినా ఫలితం మారలేదు— అన్ని రచనలు చెత్తబుట్ట పాలవుయినే ఉన్నాయి—

మనవాడు భావకవిత్వం, గేయకవిత్వాల జోలికి పోలేదనుకోనక్కరలేదు—ఈ మధ్యనే మూడు రాత్రుళ్లు నిద్రపోకుండా కూర్చుని. 'కైతలూరి కైలాసం' అన్న తన పేరుని, 'కై. కై' అన్న కలం పేరుగా కుదించుకొని ఒకగేయం రాసాడు,— ఒక మహాకవి ననుకరించడానికి విఫలప్రయత్నంచేస్తూ—

నేను స్వేతం మహాకవినై పోతాన్,
సాహితీపొలం కలంహలంపట్టి సాగు
జేస్తాన్,
కథలూ కాకరకాయలు పండిస్తాన్,'
..............................'

అంటూ సుదీర్ఘంగా రాసిన ఆ గేయ కవిత కూడా వారపత్రికాఫీసునుండి మూడు రోజులకే తిరిగి వచ్చేసరికి చాలా దిగులుపడిపోయాడు!

'నా గుండెల్ని వత్తిగాచేసి నా మేధశక్తినంతా చమురుగాపోసి వెలిగించిన దీపంరా ఇది!— అయినా అచ్చు ద నోచుకోలేదు చూడు! ఇక నా రచనలకు నేను బ్రతికుండగా రాణింపు వస్తుందనుకోవటం ఉత్త భ్రమ' అని నిజంగానే కళ్లనీళ్లు పెట్టుకొంటుంటే నాగుండె నీరయి పోయింది—

ఇంకోసారి సెలవు లేకపోయినా రెండు నెలలు జీతం నష్టంమీద సెలవు తీసుకొని, అహోరాత్రాలు కష్టపడి ఒ 'బృహద్గ్రంథం' రాసి, దాన్ని త అడ్రసు రాయకుండా, తిప్పిపంపడా వలసిన స్టాంపులు జతపర్చకుండా కొత్త ప్రచురణవుతున్న ఒక కథల పత్రిక పంపాడు— అది కూడా వారం తిరక్కుండానే తిరిగొచ్చింది!! వాళ్లు చెత్తబుట్ట ఈ బృహద్గ్రంథాన్ని భక్షించి హ యించుకోలేదన్న అనుమానంవచ్చి తా స్టాంపుఖర్చు పెట్టుకొని తిప్పి పంపార కొన్నా వీడి అడ్రసు ఎలా తెలుసు గలిగారో ఇప్పటికీ నా కర్థంకాదు కష్టపడి జోకులు, మహాత్ముల ఉవాచ బ్రహ్మాండమైన కొటేషన్లు సేకరిం పంపాడు. బంగాళ దుంపమీద, గోహత నిషేధంమీద ప్రజాస్వామ్యంమీద క్రికె మీద, ఆఖరికి వైజయంతిమాల చ సౌందర్యంమీద, ఎన్నో సబ్జక్టులమీ ఎన్నో రకాలుగా రచనలు చేసాడు— అ 'చెత్తబుట్ట' పరమయ్యాయి పాపం!

ఒకరోజు నేను వాడి దిగులు గుర్తిం ఆలోచిస్తుంటే మెరుపులాంటి ఒక ఉ యం తట్టింది—ఎప్పుడో అయిదారే క్రితం 'ఆంధ్రపత్రిక' సచిత్ర వారప కలో చదివిన' అబ్బునాథం — అచ్చు డూతి' అన్న కథ జ్ఞాపకం వచ్చింది ఆ కథలో నాయకుడు 'అబ్బునాథం'కూ రచనలు చేసిచేసి ఫలితం కనపడకపో ప్రాణంవిసిగి, ఆఖరికి ఉత్తరాల శీ కకు లేఖరాసి పంపిస్తాడు—ఆ ఉత్త ప్రచురింపబడగా తనూ ఒక రచయితన పోయానని తనపేరు అచ్చులో చూ కొన్నానని సంతృప్తి పొందుతాడు—

'మనుప్పుకూడా అబ్బునాథంగారి లాగ అచ్చులో పేరుచూసుకోవాలన్న నీ జీవి శయం ఎందుకు నెరవేర్చుకో కూడద అని కైలాసాన్ని అడిగేను ఆ కథ

# సంక్రాంతి ముగ్గులు

ప్రికతర్వాత! వాడు - చిన్నబుచ్చుకోలేదు సరికదా, ఎంతో సంతోషించి నన్ను కౌగిలించుకొన్నంత పనిచేసాడు— 'ఆలస్యం అమృతంవిషం' అంటూ, అప్పటికప్పుడే సలహా ప్రకారం ఉత్తరాల శీర్షికకు రచనని తయారుచేసాడు—

ర్యా

మీ (మా) వారపత్రిక వారవారం వర్ధమానమవుతూ, తెలుగు పాఠకుల హృదయాలను అలరిస్తోంది— ఈ వారం పత్రిక జయలలిత ముఖచిత్రంతో ఎంతో ముద్దొచ్చేలా సింగరించుకొని మమ్మల్ని ఆనంద పరవశుల్ని చేసింది— 'పునరుషవ్వు' కథ బాగుంది—సీరియల్ పట్టుగానే సాగుతోంది—'గంగి' కథ పత్రిక స్థాయికి తగ్గట్టుగా లేదు—మీ (మా) వారపత్రిక పది కాలాలపాటు వెలుగొందాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

భవదీయుడు,

కైతలూరి కైలాసం వ్రాలు.

అని రాసినాకు చూపించాడు— తర్వాత రచన ప్రకారం 'మీ సంపాదకీయం స్తంభం పుస్తకానికే ఆణిముత్యముంటే నమ్మండి' అన్న వాక్యాన్ని ఇరికించాడు— ఆనే ఆ 'రచన'ను కవర్లో పెట్టి ఆ కవరు నాలుగు మూలలా పసుపురాసి, సరస్వతీ పటంముందు కొంతసేపుంచి, కళ్ళకద్దుకొని, తర్వాత పోస్టుచేసాడు— కాని అదికూడా ప్రచురణ కాకపోవడం నాకూ నిరుత్సాహ కారణమేనంది—తర్వాతకూడా ఎన్నో లేఖలు రాసాడు. అయినా ఒక్కటీ అచ్చుకాలేదు—

వాణ్ణి దురదృష్టం వెన్నాడుతూనే ఉందన్నమాట.

అందుకే నేను తిరుగులేని నిర్ణయానికి వచ్చేసాను—'అచ్చులో పేరు చూసుకోవాలన్న పిడకోరిక ఈ జన్మలో తీరదు' పిడికాయోగంలేదు' అని.

అందుకే రామనాధానికి అంత కచ్చితంగా చెప్పగలిగాను—

మరింకెందుకీ ఈ కైలాసం ఇలా అర్ధాంతరంగా ఈ టేనీటి విందు ఎందుకేర్పాటు చేస్తున్నట్టు? కారణమేమయుంటుంది? ఒకవేళ........

'మిమ్మల్నేనండీ' ప్యూన్ రంగయ్య గట్టిగా చెవిలో అరిచే సరికి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చేసాను అంతూ పంతూ లేకుండా సాగిపోతూ గజిబిజిగా అల్లుకుపోతున్న ఆలోచనలదారం పుటుక్కుమంది.

'ఎంతపిలిసినా పలకరేంటండే? అరంతా వచ్చేసారు! అంతా తమరికోసమే చూస్తున్నారండే' రంగయ్య మాటలు విన్నవెంటనే స్టాఫ్ రూమునుంచి బయలుదేరాను. వాడి వెనుకనే.

స్కూలు వెనకాల ఆవరణలోనే కొబ్బరిచెట్లకింద వేసిన కుర్చీల్లో ఆసీనులయున్నారు ఆహ్వానితులంతా — నేనూ నెమ్మదిగావెళ్ళి ఒక కుర్చీలో కూలబడ్డాను.

ఇంతలో పది కప్పులతో టీ, ఇంకో ఐదు ఖాళీ కప్పులు తీసుకొచ్చి మొత్తం పదిహేను కప్పుల్లోను, ఆ టీ సర్దిపోసాడు మా ఎదురుగానే, ఆ హోటల్ కుర్రవాడు!

'టూబై త్రీ టీలన్నమాట' వెంటనే లెక్క కట్టేసాడు లెక్కల మేస్టారు వెంకట్రావు.

'అక్కడే కప్పుల్లో సర్దేసి తగలడమన్నాను కదురా' అని విసుక్కొన్నాడు కైలాసం మేష్టారు!

స్వీటేమీలేదని ఉసూరుమంది నా మనసు—

'కనీసం అరిటికాయ బజ్జీ అయినా ఉంటుందనుకొన్నాను'—పైకే అనేసాడు తిండిపోతు వేదాంతాచారి.

'కాఫీకూడా కాదు—టీయేనా' అని గునిసాడింకొకాయన—

ఏమీ విననట్టుగానే చిరునవ్వు చెదరకుండా అలానే నుంచున్నాడు కైలాసం మేమంతా కప్పులు ఖాళీచేసేదాకా!

'సోదర ఉపాధ్యాయుల్లారా' అంటూ గొంతు సవరించుకొన్నాడు.

'ఇంకా మిమ్మల్ని సస్పెన్సులో ఉంచదల్చుకోలేదు—నా సంతోషం మీతో పంచుకోవటంకోసం ఈ చిన్న టీపార్టీ విందు ఏర్పాటు చేసాను...నా తపస్సు ఫలించింది నా జీవితాశయం నెరవేరింది......

'అంటే...నీ రచనేమైనా ప్రచురింపబడిందా...నీ పేరు అచ్చులో వచ్చిందా...' ఇంచుమించుగా అరిచాడు రామనాధం.

'అవును...ఈ కైతలూరి కైలాసం పేరు ఈ సంక్రాంతి ప్రత్యేక సంచికలో మధ్య పేజీల్లో అచ్చయింది...' లాల్చీకి లేని కాలరు సర్దుకొంటూ విజయగర్వం ధ్వనించే కంఠంతో. ఒక్కొక్క అక్షరమే నొక్కిపలికేసరికి మేమంతా ఆశ్చర్యచకితులమయ్యాం కొందరి ముఖాల్లో 'జెలసీ'కూడా దోబూచులాడకపోలేదు.

'కథా? నవలా?...గేయమా?...ఏంటిటీ? నువ్వే చదివి వినిపించు, రాగయుక్తంగా' అంటూ సెలవిచ్చాడు ఆంజనేయశాస్త్రులు ముందున్న కుర్చీకి కాళ్ళెగదన్నుతూ.

'కాదండి మేస్టారూ! వినిపించేదికాదు... చూచేదే—ఇదిగో, పుస్తకం నలగకుండా ఒక్కొక్కళ్ళే చూడండి' అనేసరికి అంతా ఒక్కసారి కైలాసంమీద పడ్డారు,పుస్తకం కోసం. ఆపుకోలేని కుతూహలంతో?

నాకు నిజంగా మతిపోయింది !— ఏమిటి...వినిపించేదికాదు, చూచేది అంటు



న్నాడు... నాకు తెలియకుండా వీడు చిత్రకారుడెప్పుడయ్యాడు చెప్మా! నాకు తెలుసున్నంతవరకు వీడికి కాకి బొమ్మ వేయటం కూడా రాదే!... ఇందులో ఏదో మోసముంది—అని నాలోనేనే తర్జనభర్జన పడుతూండగానే ఆ పుస్తకం చేతులు మారి నా దగ్గరకు వచ్చింది—

ఎంతో కుతూహలంగా చూసాను—మధ్యపేజీలో అడ్డంగా ఎంతో అందంగా 'సంక్రాంతి ముగ్గులు' అని హెడ్డింగు, దానికింద ముచ్చటగొలిపేలా నాలుగు చక్కని ముగ్గులు, అడుగున, చిత్రణ: శ్రీ కైతలూరి కైలాసం అని బోల్డు అక్షరాల్లో మనవాడి పేరు!!—

నేను! ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయి బుడగలు వేస్తూండగా మిగతావాళ్లంతా కైలాసాన్ని కంగ్రాట్యులేట్ చేయటం, వాడుమాటలకి తడుముకోకుండా తను చిన్నప్పుడు అమ్మ ముగ్గులు పెడుతున్నప్పుడు ఆమె కొంగు పట్టుకొని కుతూహలంగా చూసేవాడినని, దరిమిలా చక్కని ముగ్గులన్నీ నేర్చుకోవటం జరిగిందని, ఆ కళను ఇప్పుడిలా కీర్తికోసం కాకుండా, ప్రజోపయోగార్థమై ఉపయోగించేటం జరిగిందని కోసేయటం జరిగిపోయింది—

నేనయినా అప్పటికి ఊరుకొన్నా 'ఇంటికెళ్లిన వెంటనే మా ఆవిడకిసంగతంతా చెప్పి ఈ చిక్కు సమస్య నెలాగైనా విడదీయగలిగితే 'వెంకటగిరి' జరీచీరకొని పెడతానని ఆశపెట్టేసాను — హా - విడబలే గడుగ్గాయిలెండి! ఆ మర్నాడు సాయంత్రానికే, రహస్యం కనిపెట్టేసింది —కైలాసం భార్య చూడామణి. కిష్టమయిన 'రోటిచరిమిడి', దొడ్లోని పూలన్నీ కోసి చక్కగా అల్లినమాల, కైలాసంలేని టైములోవెళ్లి ఆవిడకిచ్చి ప్రసన్నురాలిగా చేసుకొని కావలసిన సమాచారమంతా నేర్పుగా సేకరించి నాకు చేరవేసింది — మా ఆవిడ సేకరించిన సమాచార సారాంశమిది—

అచ్చులో పేరు చూసుకోవాలన్న తన భర్తకోరిక ఎలాగైనా నెరవేర్చాలని చూడామణి తిరుగులేని నిర్ణయానికి రావడానికి కారణాలు ముచ్చటగా మూడు.

ఒకటి—ఆవిడ వాడి పెళ్లాం!

రెండు—కైలాసం పుంఖానుపుంఖాలుగా పంపిస్తున్న రచనలవల్ల ఇల్లు గుల్లయిపోతోంది—స్టేషనరీ కొట్టులో అప్పుగా తీసుకొన్న కొన్ని వందల రీముల తెల్లకాగితాల ఇంకుబుడ్ల బాకీ తాలూకు వడ్డీకై ప్రతీ నెలా వీడి జీతమంతా సమర్పణయి పోవటం, అసలు బాకీ మాత్రం ఇంకా పెరుగుతూనే ఉండటం ఆవిడకి సహజంగానే నచ్చక భర్త దగ్గర మొత్తుకోగా, వాడు నిమీలిత నేత్రుడై 'ఒక్కసారి తన పేరు అచ్చులోపడితే చాలని! ఇక తను రచనా వ్యాసంగిన్ని శాశ్వతంగా విరమించుకొంటానని ఆకాశంకేసి చూస్తూ హామీ ఇచ్చేసాడట!

మూడో కారణం చాలా బలమయింది—వాడి రచనలు తిరుగుటపాలో తిరిగొచ్చినప్పుడల్లా కైలాసానికి, దిగులూ, గెడ్డం కొన్నాళ్లదాకా పెంచేసుకోవటం అలవాటు— మరి ఇది తరుచుగా సంభవమయ్యే విషయమాయె. దిగుల నంగ తెలా ఉన్నా, మొగుళ్లు ఏ కారణంచేతనైనా గనీండి మన్నగా: క్రమంగా గెడ్డం గీసుకోకపోతే ఆ మొగుళ్లతాలూకు పెళ్లాలకి ఇబ్బందేకదా! సరసానికీ గరుకు గెడ్డం అడ్డం కదా!

అందుచేత చూడామణి తన భర్త పేరు

# సంక్రాంతి ముగ్గులు

అప్పువడేలా చేసి తన పతివ్రతా ధర్మం నెరవేర్చుకొంది—చిన్నప్పుడు వద్దని మొరాయిస్తున్నా బలవంతంగా ముగ్గులు నేర్పిన బామ్మకు కృతజ్ఞతలు తెలుపుకొంటూ తెల్లకాగితానికి ఒకవైపున ఇండియన్ 'ఇంకుతో' చక్కని ముగ్గులు గీసి భర్త పేరు మీద పంపింది!!

అదీ సంగతి ఆ విధంగా మనవాడి పేరు అచ్చులోపడింది—వాడి జీవితాశయం నెరవేరింది—

కాబట్టి 'కాలేకపోయిన' రచయితల్లారా! దగపడ్డ తమ్ముళ్లారా! నిరాశ పడకండి—దిగులుగా గెడ్డాలూ పెంచుకోకండి—రచనలన్నీ తిరిగొస్తున్నాయని. పేరు అచ్చులో చూసుకోవాలన్న మీజీవితాశయం నెరవేరటంలేదని నిరుత్సాహ పడకండి. మీ మీ పెళ్లాలచేతగాని, బామ్మల చేతగాని, సంక్రాంతి ముగ్గులు; దిండు గలేబులపై డోరు కర్టెన్లపై డిజైన్లు లేదా గడపలపై చిట్టిముగ్గులు 'తెల్లకాగితంపై ఒకేవైపు ఇండియన్ ఇంకుతో' 'గీయించి మీపేరుమీదుగా చలామణీ చేయించండి. అచ్చులో మీపేరు అందరికీ చూపించి సంతోషించండి—ఆ ముగ్గులు వగైరాలు ఒకమాదిరిగా ఉంటే చాలు—మగపేరుమీద ఉంటే ప్రచురణార్హమవుతాయి. ఆడపేరు మీదున్న కొంచెం ఘాటెక్కువయిన ప్రేమకథల్లా!—మీకు ముగ్గులు, డిజైన్లు ఇష్టం లేకపోతే 'నగ్గుబియ్యంతో ఉప్మా' 'దోసకాయపచ్చడి' 'రోటి చలిమిడి' లాంటి వంటకాలమీద రాయించండి — మీపేరు తగిలించండి—ఇందులో తప్పేమీ లేదు. ఎంతోమంది 'రైటరీమణులు' వాళ్ల మొగుళ్లనో అన్నయ్యలనో, 'ఘోస్టు రైటర్సు'గా పెట్టుకొని వాళ్ల రచనలని, (వాళ్ల అనుమతి మీదనే) తమపేరున చలామణీ చేసుకోవటం, అన్యాయంగా పేరుకొట్టేసి పోజుకొట్టటం తప్పుకానప్పుడు, ఇదీ తప్పుకాదు!—నిరాశ నిండిన మీ జీవితాన్ని సంక్రాంతి ముగ్గులా సర్వశోభాయమానం చేసుకోవటం తప్పుకాదు! ●

# భలేనిజాలు!

బాపు


దేవుడిచ్చిన భర్త


కన్నుల
పండుగ


పైనుంచి ఇటుక
పడ్డానికి కారణం
దర్యాప్తు చేస్తాం
సార్!
ముహూర్తబలం


హత్య చేసిన వాడ్ని చూసా
నంటున్నావు గదా. మరి వాడు
ఎలా వుంటాడని అడిగితే
చెప్పవేం?
మూగ
నోము


అమ్మాయిని రక్షిద్దామని నిలువెత్తు మంటల్ని
కూడా లెక్కచేయకుండా ఇంట్లోకురికాను
ఇంతా చేస్తే ఆ సమయంలో అమ్మాయి
ఇంట్లో లేదు - సినిమా
కెళ్ళిందిట!
జరిగినకథ (తెర్క) అగ్గివీరుడు


ఆ దొంగ వెధవలు నేను పోలీసునని
ఎలా కనుక్కున్నారో తెలియడం లేదు!
రహస్యపోలీసు 333

# సుబ్బారావు సన్మానం



బలివాడ వేంకటదామోదరరావు

సుబ్బారావుకి సన్మానం!

వేదీ—

ప్రముఖ రచయిత, రచయితల సమాఖ్య అధ్యక్షుడు అయిన సుబ్బారావుకి సన్మానం.

సుబ్బారావు ఎంత యెదిగిపోయాడు? రచయిత కావాలని తహతహలాడి చేసిన ప్రయత్నం భంగపడగా బెంగపడిపోయిన సుబ్బారావు ఈనాడొక ప్రముఖ రచయిత.

నేను గుర్తుండి ఉంటానా? ఏమో? ఏడాది పరిచయం. అదయినా అయిదా రేళ్ళ క్రిందట...

అప్పుడు—

నేనేనాడూ హోపారై నా వెళ్ళని శ్రీకాకుళం నాకు ట్రాన్స్‌ఫరైంది. శ్రీకాకుళం చిన్న పట్టణమే అయినా నాలాంటి టెలిఫోన్ ఆపరేటర్‌కి—ఒంటరి బ్రహ్మచారికి (బ్రహ్మచారి ఒంటరిగా కాక జంటతో ఉంటాడా) ఓ చిన్న రూమ్‌లాంటిది దొరకటం (అద్దెకే సుమండీ) కష్టం అయ్యింది. ఆ సందర్భంలో నేను గదికోసం తిరుగుతుండగా ద్వారకలో (అదిగో ద్వారకలోని ద్వారక కాదండోయ్... ఇది గ్రాండ్ ట్రంక్ రోడ్‌లోని గ్రాండైన కాఫ్యాలయం) టీ సేవిస్తుండగా విచిత్రంగా సుబ్బారావుతో పరిచయమైంది. నా అవసరాన్ని అతనికి విన్నవించుకున్నాను.

అతనంతా విని తాపీ (మేస్త్రీలా)గా అన్నాడు:

'నేనిక్కడ ప్రజాపనుల శాఖలో పన్జే స్తున్నాను. (ప. ప. శా. అంటే పి. డబ్ల్యు. డి. ట) బ్రహ్మచారిగానే. రూమ్‌లో ఒంటరిగా ఉంటున్నాను. (బయట ఒంటరిగా ఉండటం లేదేమోనన్న అనుమానం నాక్కలిగినా అడగలేదు) నాతో పాటుండటానికి మీ కభ్యంతరం లేకపోతే నాకూ లేదు.'

నే నొప్పుకున్నాను. (కోవాలి మరి—తప్పదు!)

అయితే హోటల్‌లో సాగిన ఆ పది నిముషాల సంభాషణలోనూ—నాకు సుబ్బారావులో, అతని మాటల్లో ఏదో తెచ్చిపెట్టుకున్న ఆవేశం కన్పించినట్లనిపించింది. మంచి 'డైలాగులు' మాట్లాడాలనే ఆరాటం స్పష్టంగా ద్యోతకమైంది. చిన్న మాటల్ని కూడా సాగదీసి బరువైన (ఎన్ని కే.జీ.లో చెప్పలేను) సంభాషణలుగా ట్రాన్స్‌ఫార్మ్ చేసి చెప్పాడు. నా కప్పుడది వింతగా అనిపించినా అర్థం కాలేదు.

'మీ పేరు?' రూంలో లగేజితో అడుగు పెడుతున్న నాకు సుబ్బారావు మొదటి ప్రశ్న—

నేను చెప్పాను.

నా పేరు వినగనే నా వంక ఆశ్చర్యంగా చూస్తూ, క్షణంసేపు నోరు తెరచుకొని ఉండిపోయాడు. అంతలో రెండు దోమలు మొఖంముందు తారట్లాడగా, శనివారం మాంసభక్షణ కూడదనుకొన్నవాడై, నోరు మూసుకొని, ఆశ్చర్యంనుండి తెప్పరిల్లి, పెదాలుతెరచి (మాట్లాడాలిగా) 'ప్రముఖ రచయిత ముదువర్తి మధుమూర్తిగారు...?' సగంలోనే ఆపేశాడు అనుమానంగా.

'నేనే' సందేహనివృత్తిచేస్తూ, నెమ్మదిగా, సహజంగా అన్నాను కొస్తంత గర్వం మిళితంచేసి.

'ఐసీ...మీరు నా రూమ్ మేట్‌కావటం నిజంగా నా అదృష్టం.'

* * *

క్రొత్తలో నాలుగైదురోజులు ఎప్పుడూ నా కథలని, రచనల్ని తెగపొగిడేవాడు. తనక్కూడా రచయిత కావాలనుందట. చిట్కాలు చెప్పమన్నాడు. రచన వ్యాపారమా? నవ్వి ఊరుకున్నాను.

ఓ ఆదివారం—

తెలుగు సినిమా (నేను చూస్తున్నది) బోర్ కొడితే సగంలోనే వచ్చేశాను. నెమ్మదిగా దగ్గరగావేసిఉన్న రూం తలుపులను నిశ్శబ్దంగా (అఫ్‌కోర్స్ అని ఎప్పుడూ చప్పుడు కావనుకోండి) త్రోసుకొని లోప

లికి ప్రవేశించాను.

గదంతా దట్టంగా పొగ అలముకొని ఉంది. సిగరెట్ పొగ. గట్టిగాపట్టి దుమ్ము పీలుస్తున్నాడు సుబ్బారావు.

టేబిల్‌మీద కాగితాలు—చేతిలో కలం—కుర్చీలో కూర్చొని. పైకప్పును పరిశీలిస్తున్నాడు. (వాసాలు లెక్కించటంకోసం మాత్రంకాదని నేను బల్లగుద్ది చెప్పగలను.)

ఏదో థాట్ తట్టినట్లుంది—

గబగబా కలంతో ఏదో బరుకుతున్నాడు.

నేను ఆశ్చర్యంగా చూస్తున్నాను. సుబ్బారావేనాడూ ఏదీ వ్రాయటంకాని, కనీసం ఆఫీసు ఫైల్సుకాని, మిత్రులకు ఉత్తరాలుకాని—ఇలా దీర్ఘంగా ఆలోచించటంకాని నేనీ నెల్లాళ్లలోనూ చూళ్లేదు.

నాకో చిన్నజబ్బుం(డే)ది.

పొడిదగ్గు — ప్రీవియస్ నోటీసివ్వకుండానే వచ్చేస్తుంటుంది. లైబ్రరీలో ఉన్న సమయాల్లో కూడా అడపాదడపా నన్ను వంకరిస్తుంది. కొందరు ఫోన్ చేసిన వాళ్లు — వాళ్లు రింగ్ చేసింది ఎక్స్ఛేంజికో, టి. బి. వార్డుకో తెలీక తికమక పడుతుంటారు. (రేమో!)

ఆల్‌రైట్—కీపిట్ ఎసైడ్—

సరిగ్గా అప్పుడే నాకు పొడిదగ్గు వచ్చింది. రెండు మూడుసార్లు — మధ్య మధ్య కాస్త విరామంతో, వీక్లీలో సీరియల్‌లా. దగ్గగా— సుబ్బారావు కాస్త చలించి నావంక చూశాడు!

'హల్లోగురూ! సిన్మా బాగులేదా?' మాటల్లో సిన్సియారిటీ ధ్వనిస్తూ, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో, తను వ్రాస్తున్నదేమీ కానట్లే, నెమ్మదిగా కాగితాలను మడిచేశాడు. అది నటన—నేను గుర్తించాను.

అతనడిగిన ప్రశ్నకు నేను జవాబు చెప్పలేదు.

'ఏమిటి గురూ, అది?' అన్నాను.

'అబ్బె...బ్బె...ఏం లేదు' కంగారుగా టేబిల్ సొరుగులో దాచేశాడు. సిగ్గు పడుతూ...సిగ్గు...!

'లవ్ లెటరా?'

'నాకా అదృష్టంలేదు.' భగ్నహృదయుడిలా, ప్రేమోపహతుడిలా, విరక్త జీవిలా—ఎ. ఎన్. ఆర్. పోజులో అన్నాడు. మరోడైతే అతన్నా పోజులో చూసి, ఆ డైలాగువిని బాబుగారు గతంలో ఏదో పెద్దదెబ్బ తిన్నాడనుకోక మానడు. కాని —నో... నో... సర్! అలాంటిదేమీలేదని బాండ్ రాసివ్వగల్ను. చెప్పాగుగా! సీరియస్‌గా డైలాగడం (అంటే డైలాగులు చెప్పటం అని అతనే అర్థం చెప్పాడో సారి) అతనికో సరదా!

'నేను చూడకూడదా?'

కాస్సేపు ఆలోచించి, తలపంకించాడు సుబ్బారావు. కాగితాలు బైటకితీసి చూపించాడు.

కథ... !

సుబ్బారావు కథ వ్రాస్తున్నాడు...

ఆహా...శ్చర్య పోయాను.

'అరే! నువు కథలుకూడా వ్రాస్తావా?' (వ్రాయగలవా అని అంతరార్థం) ఈ ప్రశ్నతో కుంచించుకు పోయాడు సుబ్బారావు. ఎందుక్కో?

'ఏదో సరదాకి. పులిని చూసి నక్క వాత మాత్రంకాదు.' అబ్బ! చెప్పుతో కొట్టినట్లు అన్నాడు. అందులోనే 'నిన్ను చూసి వ్రాయాలన్న దుగ్ధమాత్రంకాదు సుమా' అన్న ఆత్మాభిమానం...

'నో నో...తప్పకుండా వ్రాయిగురూ! అంతులేని వింతభావాలను మనసులోనే ప్రోగుచేసి దాచుకోనేకంటె కలంతో కాగితంపై పేర్చి వాటికోరూపు కల్పించుకోవాలని ప్రయత్నించటం ఎంతో మంచిది' ఎంకరేజ్ చేస్తూ అన్నాను.

రోజులు గడిచాయి.

...క్రమంగా సుబ్బారావు నాదగ్గర తాను దాచిన ఒకేఒక రహస్యం (తాను రచనలు చేస్తుంటానని) వివరాలు వివరంగా, విపులంగా ఒక్కటొక్కటే బైట పెట్టసాగడు.

నో సోమవారం సుప్రభాతాన తన లెదర్ సూట్‌కేస్‌కి ప్రక్కనేఉన్న తుప్పుపడుతున్న చిన్నమెటల్ ట్రంక్‌లోనుండి కాగితాల కట్టలుతీసి చూపించాడు. అన్నీ సుబ్బారావు స్వీయరచనలే.

ఏదేళ్లక్రిందటిమాట—కాని సుమారు ఇరవై వేశల కాగితాలన్నా ఉండిఉంటాయని నా గుర్తు.

ప్రతికాగితాన్ని పరిశీలనగా పరీక్షించసాగాను—సుబ్బారావు కథల్ని. సాహిత్య రచనలు, సాంఘిక కథలు, (ట్రాజెడీలు ఎక్కువ) పౌరాణికాలు, కాల్పనిక జానపదాలు; శృంగారకథలు — ఒకటేమిటి? రకరకాల కథలు—సెటైర్‌నిండిన వ్యంగ్య రచనలు, గేయాలు, సగం వ్రాసి ఆపేసిన నాటకం. రెండు నవలలు—(అన్నీ వ్రాత ప్రతులే) ఉన్నాయి.

అందంగా, గుండ్రంగా ఉంటుంది సుబ్బారావు దస్తూరీ. అతని ఓపికకి ఆశ్చర్యం వేసింది.

ఇక్కడో చిన్నరహస్యం—

ఎక్కడా అనకండి (ఇప్పుడు సుబ్బారావు పెద్దరచయిత కనుక) కాని, అవన్నీ తిరిగొచ్చేసిన రచనలే. రకరకాల పత్రికల ఆఫీసులు చూసివచ్చేశాయి. అయినా సుబ్బారావులోని పట్టుదలగాడు మా చెడ్డ మొండిఘటం—చూశారూ, ఎప్పటికైనా నెగ్గకపోతానా అని!

అప్పటికి నా కర్థమైంది సుబ్బారావు నెలకి యాభైరూపాయలు తిరిగి ఇంటి నుండి ఎందుకు తెప్పించుకుంటాడో! (ఈపాటికి మీ కర్థమైపోయుంటుంది లెండి—నెలకో వందరూకల పైచిలుకు రచనల పోస్టేజి, స్టేషనరీకోసం సుబ్బారావు ఖర్చుచేస్తాడని ఇఫ్ సో—యు ఆర్ రైట్ మాస్టారూ)

స్థూలంగా సమీక్షించాలంటే నేను పరిశీలించిన కట్టల్లో (అప్పటికి వివిధపత్రికాధిపతులు పరిశీలనలోకుంటూ ఇంకా తిరిగి రానివి రమారమి పాతిక రచనలున్నట్లు సుబ్బారావు అన్నాడు. అవి మినహాయించి) నూట్రయితొమ్మిది కథలు, నలభైరెండు గేయాలు, ఇరువైనొక్కటి వ్యాసాలు. పద్దెనిమిది సినిమా విమర్శలు, అరనాటకం, రెండు నవలలు ఉన్నాయి. (నా డైరీలో ఈ అంకె లిప్పటికీ ఉన్నాయి.)

వీటి సమీక్షకు నాకు పక్షంరోజులు పట్టింది. ఇందులో కనీసం నూరు శాల్తీలైనా ఒక్కొక్కటి సగటున కనీసం అయిదేసి మాగజైన్ల ఆఫీసులు దర్శించి, సదరు కార్యాలయాల్లో చెత్తబుట్ట పాల పడకుండా, (తిరుగు టపాకోసం స్టాంపులున్న స్వంత చిరునామా కవరు పంపటం

# సుబ్బారావూ-సన్మానం

ళ్ళి), పరీక్షితంగా సుబ్బారావును చేరుకున్నాయి.

పరాజయం సుబ్బారావులో మరింత పట్టుదలను పెంచింది.

ఓసారి సుబ్బారావు నాతో అన్నాడు:

'నిజం చెప్పాలంటే గురూ, నాకు మీ పేరున్న రచయితల్ని చూస్తే అసూయ, అసహ్యం (!) పుడుతోంది. అది ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సునుండి జనించిందో, నా ప్రయత్నాలు ఫలప్రదం కాకపోతున్న నైరాశ్యంనుండి పుడుతోందో చెప్పలేను.' ఏదైతేనేం, రచయిత కావాలని తాపత్రయ పడుతున్న ప్రతి ఒక్కడి అంతర్యాన్ని స్పష్టంగా, నిష్కర్షగా, నిర్మొహమాటంగా చెప్పాడు.

ఇంకోరోజు ఓ పేరుపొందిన పత్రికలో నా పేద్ద పేరున్న (పొడుగులో కాదు — ప్రఖ్యాతిలో) రచయిత్రికథ చూపిస్తూ అన్నాడు:

'ఏమిటి గురూ ఇది? బ్లడీనాన్సెన్స్. ఇది కథేనా? బోర్! కాస్త పేరుంటే చాలు — చెత్త రాసినా కొత్తగా ఉందని అచ్చొత్తించేస్తారు ఎడిటర్లు. ఎంత గొప్పగా వ్రాసినా క్రొత్తవాళ్ళని ఎంకరేజి చెయ్యరు.' (కాలని) నిప్పులాంటి నిజం! నిండుగా ధ్వనించింది. మేం కలిసి ఉన్న ఆ ఏడాదిలోనూ, అలాంటి కథలు నాకు సుబ్బారావు చూపినవి కొల్లలు.

అయితే, సుబ్బారావు విమర్శించటం కేవలం ఆ కథలు బాగులేకకాదు. అంతకంటె బావున్నాయని తనుకుంటున్న (నిజంగా కొన్ని బావున్నాయని నేనూ అనగల్ను) తన కథలు పడలేదే అన్న ఆక్రోశం.. మరి తను రచయిత కాలేదేమోనన్న ఆవేదన.

మరో రాత్రి పడుకోబోయే ముందు నెమ్మదిగా అన్నాడు సుబ్బారావు:

'రచయిత గురూ! నేను రిసెర్చిచేసి ఇంకో చిన్నరహస్యం భేదించాను. కథ పడాలంటే కిటుకు—ఎంత మంచి కథైనా ఏ శ్యామసుందర్ అనో, మధురాధర్ అనో, అచ్యుతకుమార్ అనో వ్రాసి పంపితే, ప్చ్! నోయూజ్. అదే పుష్పలత, అప్పలమ్మ పేరుతోనో, బొండాడ పిచ్చమ్మ పేరుతోనో వ్రాసిపంపించు, నెల్తిరక్కుండా పడుతుంది. లేదా ఏ జంషెడ్పూర్ నుండో, పూనానుండో వ్రాసి పంపించు, ష్యూర్! కథ అచ్చవ్వాలంటే (సాధారణంగా) వ్రాసేది ప్రవాసి అయినా కావాలి. లేదంటే ఆడదైనా అయ్యుండాలి. (దీనికి ఆవిడ కథ రాయక్కర్లేదు — ఎలా రాయాలో కూడా తెలియనక్కర్లేదు. రాసేది మగాడు. పడే పేరు మాత్రం ఆమెది. దట్సాల్!)

రచయితల గురించి సుబ్బారావు ఏం మాట్లాడినా నేను విమర్శించే వాడిని కాదు. కారణాలు రెండు. ఒకటోది అతను చెప్పేవన్నీ నగ్నసత్యాలు. రెండోది— ఖండిస్తే నేనూ రచయితనేనని, మొహమాటం లేకుండా (అది ఎందుకుండాలి? అంటాడు) నా మీద నిర్దాక్షిణ్యంగా విరుచుకు పడటంలో, ఆరడుగుల గలివర్ లాంటి సుబ్బారావు క్షణం ఆలస్యం చేయడన్నది నిర్వివాదాంశం. ఒకటి రెండు సందర్భాలలో నాకిది అనుభవమే.

రాను రాను సుబ్బారావులో మార్పు వచ్చింది. పూర్తిగా డీలాపడి పోయాడు. తన రచన లింక వెలుగులోనికి రావని (ఏదో మూల చిన్న ఆశ ఉన్నా) నిశ్చయించుకొని (అయిష్టంగానే) నిరాశపడి పోసాగాడు. నాకు జాలివేసింది. నిజం చెప్పొద్దూ! సుబ్బారావు అప్పుడప్పుడూ మంచి కథలుకూడా వ్రాసేవాడు. అవి తిరిగి వచ్చేసినప్పుడు నాకూ ఒళ్ళుమండేది ఆయా సంపాదకులమీద—లల్ రైట్— అదటుంచండి.

ఇప్పుడు నా ముందున్న సమస్యఒక్కటే. సుబ్బారావు రచయిత కావాలి.

సుబ్బారావుని రచయితను చెయ్యాలి— ఎలా?

నాకో పత్రికైనా (స్వంతంది) లేదే? నేనో పత్రిక్కి ఎడిటర్నైనా కానే? ఎలా?

ఓసారి (అది ఒకటోసారి కాదు) నా కథ ఒక ప్రముఖ పత్రికలో పడింది. ఆ నాడు సుబ్బారావు నాకో చిన్నపార్టీచేసి, సినిమాకు తీసుకెళ్ళి నానా సంబరపడి పోయాడు. కిం కారణం?— ఆ కథకు ముందు నేను వ్రాసిన రెండే రెండు లైన్లు. ఏమిటవి?

'ఈ కథకు ప్లాట్ వేసుకోవటంలోనూ వేసుకున్న ప్లాట్ను కథానుగుణంగా మధురంగా మలచుకోవటంలోనూ నాకు పూర్తిగా సహకరించిన ప్రియమిత్రుడు పి. వి. సుబ్బారావు కి నా కృతజ్ఞతలు'

తన కథే పడినంత సంతోషపడ్డాడు. నాకీ సంఘటన కాస్త ఉత్సాహం కలిగించింది. మళ్ళీ చాలా రోజులకి సుబ్బారావులో ఆనందం కనిపించింది. ఇదే బావుంది! అలా అయిదారు కథలలో క్రమం తప్పకుండా సుబ్బారావు నాకు సహాయం చేసినట్లు వ్రాశాను. అన్నీ అచ్చయ్యాయి. నాతోపాటు సుబ్బారావునుకూడా అభినందిస్తూ లేఖలు రాసాగాయి.

ఓ రోజు—

సుబ్బారావు ఆనందంలో మేను మరచి, భూమ్యాకాశాలకు నడుమ సంతోషంగా సంచరించి, పరవశించి పోయిన రోజు— ఉపోద్ఘాతం లేకుండా నాకో బ్రహ్మాండమైన విందు చేశాడు. భుక్తాయాసం నుండి నేను తేరుకోకముందే వీక్లీతీసి మధ్యపేజీల్లో రంగురంగుల చిత్రంతో ప్రింటయిన తన కథను, దిగువున తాటికాయలంతేసి (ఇందులో అతిశయోక్తి ఉందని నే నొప్పుకుంటాను) అక్షరాలతో తన పేరునూ చూపించాడు. ఆనందంతో నాగుండె ఆగినంత పనైంది. మరి సుబ్బారావు ఈ లోకంలోనే లేడు. రచయితైపోయినట్లే...ఫీలయ్యాడు.

మరునటివారం వీక్లీలో సుమారు పది ఉత్తరాలున్నాయి — సుబ్బారావు కథ చప్పగా, చప్పగా ఉందని, అలాంటి కథ ప్రచురించిన సంపాదకుల అభిరుచి 'మీన్'గా ఉందనీ. నిజంగా నాకు బాధనిపించింది. సుబ్బారావు కోపంగా ఆ వీక్లీని చిత్రవధచేసి (కొత్త పనామా బ్లేడుతో) దహన సంస్కారం జరిపించాడు.

ఇంకోవారం గడిచింది.

ఆరోజు మధ్యాహ్నం ఒంటిగంటకు లంచ్బ్రేక్లో రూమ్కి వెళ్ళేసరికి సుబ్బారావు ఏడుస్తున్నాడు. ఆశ్చర్య పోయాను.

'గురూ! నువ్వు చెప్పు. ఆ కథ నిజంగా నేనే స్వంతంగా వ్రాయలేదూ?' ఆల్మోస్ట్ ఆడదానిలా భోరున ఏడుస్తూ (కోప్పడకండి పొరపాటు. ఈ రోజుల్లో

అడాళ్ళు ఏడకటంలేదు. వాళ్ళు ఏడ్పిం చగా, మగధీరులే ఏడుస్తున్నారు) అడి గాడు నన్ను. 'ఆ కథ'—అంటే ప్రింట యిన ఆ ఏకైక కథానికేనని నా కర్థ మైంది.

'లేదని ఎవరన్నారు ?' అనునయంగా అన్నాను.

'ఎవరేమిటి? ఇది చూడు,' అని పత్రి కాధిపతులనుండి వచ్చిన ఉత్తరం నా కిచ్చాడు. అందులో— సుబ్బారావు కథ గతంలో ఇంకో పత్రికలో ప్రింటయిన ఒకానొక కథకు కాపీ అని, ఇలాంటి వైచ్యం తగదని మందలింపు ఉంది.

'పోనీ, నా ఒక్కడికే ఇలా రాస్తే పర్లేదు.' బాధపడూస్తూ అన్నాడు సుబ్బా రావు, 'చూడు గురూ! ఈ వీక్లీలో ఏం ప్రింట్ చేశారో?'

వీక్లీలోనికి చూపు మళ్ళించాను.

ఏదో కథకు అనుకరణ అని ఒక పాఠ కుడు సూచిస్తూ లేఖ వ్రాశాడు. (వీళ్ళ కింకేం పన్లేకపోతే సరి! వ్రాయటం చేత కాదు కాని, ఇలాంటి చచ్చు ఉత్తరాలకీ, విమర్శలకీ, రంధ్రాన్వేషణకీ తగుదురు.)

లేఖకు దిగువనే సంపాదకుల సమా ధానం:

'పాఠకుడు సూచించిన కథను, శ్రీ సుబ్బారావుగారి కథనూ మేము పరిశీలిం చగా, ఆ కథకు ఈ కథ పూర్తి అను కరణ అని గమనించి చాలా చింతించాము. రచయిత ఇలాంటి చౌర్యానికి పాల్పడటం నిజంగా క్షమార్హం కాని నేరం. ఇట్లాంటి అవకతవక పనికి మా పత్రికలో చోటు దొరకటం మా దురదృష్టం.'

ఈ జవాబు నన్నెంతో కలచి వేసింది. కథ నిజంగా సుబ్బారావు స్వీయరచనే. పోలికలు యాదృచ్ఛికంగా ఉండి ఉండొచ్చు. ఇదంతా కాకతాళీయమే గాని, కాపీకాదని నాకు తెల్సు. అయినా వావా ఎవరిక్కావాలి కనక?

ఆమాటే అన్నాను సుబ్బారావుతో.

కనీసం నేనైనా నమ్మినందు కెంతో సంతృప్తి చెందాడు.

అంతే! ఆతర్వాత 'సుబ్బారావు చాలా కథలు వ్రాశాడు. కాని, నారాయణ! ఏ ఒక్కటీ అచ్చుకాలేదు. (సంపాదకులకు సుబ్బారావు కథ అంటే భయమ్మ అవ మానం కలిగి ఉండాలని నా అంచనా— సుబ్బారావుది కూడా!)

ఇక అసలు కథకుడి కథ—మామూలే!

సుబ్బారావు చిక్కి సగమైపోయాడు. దొంగచాటుగా 'నరిష్మెంట్' కొట్ట కుండా 'అంతరాత్మ' సాక్షిగా నిజంగా నిరాహారదీక్షపూని శల్యమైన రాజకీయ నాయకుడిలా, రెండునెలల్లో రెండువదుల పౌన్లు తగ్గాడు. (ఈ స్థితిలో ఇరదు గుల సుబ్బారావు పోల్‌వాల్ట్‌గడలా ఉండి ఉంటాడని పాఠకులు గ్రహించే ఉంటారు.) తానొక ప్రముఖరచయిత కాకపోతే ఆ బెంగతో చచ్చిపోతాడేమో ? (పోడుగాని. పోతాడేమో అన్పించింది నాకు.)

ఎలా ? సుబ్బారావు నెలా రచయితను చెయ్యటం ??

సంవత్సరం గడచిపోయింది. నాకు బెజవాడ ట్రాన్స్‌ఫర్ అయ్యింది! ఆ తర్వాత మరి సుబ్బారావుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగలేదు. (ముందే విన్నవించుకున్నాను కూడా, సుబ్బారావుకి ఉత్తరాలు వ్రాసే అలవాటు లేదని.)

ఇప్పుడు...

నేను బెజవాడ వచ్చేసి అప్పుడే అయిదేళ్ళు దాటింది. ఉద్యోగం రిజైన్ చేసేసి (పెళ్ళికాగానే రిజైన్ చేసేశాను —ఆశ్చర్యంగా ఉందా? లక్షరూపాయల ఆస్తికలిసొస్తే, రిజైన్‌చేసెయ్యనూమరి!) మూడేళ్ళు దాటింది.

సుబ్బారావింకా శ్రీకాకుళంలోనే ఉన్నాడు.

ఆ సుబ్బారావే ఈవాడు ప్రముఖ రచయితై వెలుగుతున్నాడు. ఆ సుబ్బా రావుకే ఈవాడు సన్మానం.

అయితే—ఆనాటి ఆ సుబ్బారావు ఈ అరవై నెలల స్వల్పకాలంలో ప్రముఖ రచయితెలా అయ్యాడు ?

...నాకు తెలుసు. చెప్తా వినండి.

అనగనగా నో పట్నం. ఆ పట్నంపేరు బెజవాడ. [విజయవాడ అనుకున్నా తప్పు లేదు]. ఆ పట్నంలో సుబ్బారావుకో మిత్రుడుండేవాడు. ఆ మిత్రుడిపేరు 'పూర్వాభాద్ర.' ఇది కలంపేరు. అసలు పేరేమిటో సుబ్బారావుకే తెలుసోలేదో ? (పూర్వాభాద్ర తన మిత్రుడని అసలు కథానాయకుడు సుబ్బారావుకి తెలీదు!)

సదరు పూర్వాభాద్ర ఓ పేద్దరచయిత. (రచయితకాని సుబ్బారావుకి స్నేహితు లందరూ రచయితలే కావటం గమ నార్హం.)

ఆ పూ.భా.కు బెజవాడలోని ఓ ప్రముఖ పత్రికాధిపతి కమ్ ఎడిటర్ తెలుసు. రోజూ సాయంకాలం ఈ ఎడిటర్‌గారూ, పూ.భా.గారు కలిసి ఆ పత్రికకి వచ్చిన



[illegible] పరిశీలించి ఎన్నిక చేస్తుంటారు' (పూ.భా.గారు ఉద్యోగి. సాయంకాలంపూట ఆయనకిదో హాబీ.)

ఓ రోజు పత్రికకొచ్చిన రచనలను పరిశీలిస్తుండగా అందులో పచ్చపులను వెంకటసుబ్బారావు నామధేయుడు వ్రాసిన కథ ఈ పూ. భా. కంటపడింది. అది చూసి 'ఆరె! నా మిత్రుడు పి. వి. ఎస్. రావు వ్రాసిందే'నని బోల్డంత ఆశ్చర్యపోయి, చదివి తలనొప్పిని (సందేహంగా కథ చదవటంతల్నొప్పి వచ్చిందే) భరించి, ఎడిటర్‌గారితో ఘట్టిగా వాదించి ఆ కథను బలవంతాన ప్రచురింప చేశాడు. (పి. వి. యస్‌కి రచయిత కావాలనే బలమైన కోర్కె ఉందని, రచయిత కావటానికి అతడు పడ్డపాట్లు—పూ. భా. కి తెల్సు కనుక.)

# సుబ్బారావూ-సన్మానం

ఏ కథకూ, ఏ రచయితకూ రాని ఉత్తరాలొచ్చాయి ఆ కథకు పాఠకులనుండి. కాని, అన్నీ తిడుతూ వచ్చినవే. ఈ లేఖావళిని పోస్ట్ బిల్ భరించి రచయితైన సుబ్బారావుకి పంపించారు పూ. భా. గారు. (ఆ కథ బాగాలేకపోయినా మైత్రికొద్ది ప్రచురించినా) పిట్టిసన్నాసే—అని చెప్పటానికి. కాని, సుబ్బారావుకి ఈ పూ భా ఎవరో తెలీదు.)

సుబ్బారావు రెండో కథ పంపించాడు. పడింది.

మళ్లీ పంపించాడు. మళ్లీ పడింది.

పాఠకుల విమర్శలు మాత్రం తగ్గలేదు. అయినా పూ. భా గారు మిత్రుని కథను విడవకుండా ప్రచురించారు (ఎడిటర్ గారితో రికమెండ్‌చేసి). ఇలా రెండున్నర సంవత్సరాల కాలంలో ఆ పత్రికలో సుబ్బారావు కథలు నలభై ఆరు పడ్డాయి. క్రమంగా సుబ్బారావు రచయితగా స్థిరపడ్డాడు. విమర్శలు రావటంలేదు. అప్పుడప్పుడూ రెండుమూడు ఉత్తరాలు ప్రశంసిస్తూ వచ్చాయి కూడా!

అయినా సరే సుబ్బారావు తన్నాదరించిన ఆ ఒకే ఒక పత్రికకు తప్ప ఇతర చిన్న పత్రికలకు (సుబ్బారావు దృష్టిలో తన రచనలను గౌరవించని అన్నీ చిన్న పత్రికలే!) తన రచనలను పంపటానికి ఇష్టపడలేదు.

కొన్నేళ్ళకి పత్రికాధిపతి మరణిస్తూ తన పత్రికను పూర్వాభాద్రకు అప్పగించాడు (అంతకు ఆరేళ్ళముందే తన పుత్రికను కూడా పూ.భా.కి సమర్పించి ఉండటం వలన)

ఇప్పుడు ఆ పత్రికకు పూ. భా. గారే ఎడిటర్. ఇక సుబ్బారావు కథలు అచ్చు కావటానికి తిరుగేలేదు.

... ఈనాడు సుబ్బారావు పరిణతి పొందిన రచయిత. ఏ పత్రికలో చూసినా అతని కథలే ఎందులో చూసినా అతని గేయాలే. వ్యాసాలు, విమర్శలు, నవలలు, నాటకాలు— ఒకటేమిటి? అన్నిట్లోనూ సుబ్బారావు పేరే!

ఆ సుబ్బారావుకే సన్మానం.

సన్మానం విజయవంతంగా ముగిసింది.

సుబ్బారావు కోరిక నెరవేరింది. తానొక ప్రముఖ రచయితై... పోయాడు. తనకింకేం అక్కర్లేదు. కాని ఒక్కటి మాత్రం తన జీవితంలో మర్చిపోలేదు. ఈ స్థితికీ, తన ఈ ఉన్నతికీ కారణం కేవలం ఆ పత్రిక, దాని ఎడిటర్ (పూ. భా.) మాత్రమే!

అందుకే సన్మానార్థియై శ్రీకాకుళం నుండి కాకినాడ వచ్చిన సుబ్బారావు ఎడిటర్‌గారి పట్ల, ఆతని పత్రికపట్ల తనకుగల గౌరవాన్ని, కృతజ్ఞతను వ్యక్తీకరించుకునేందుకు బెజవాడ వెళ్ళాడు.

గాంధీనగరంలోని ఆఫీసును సులభంగా తెలుసుకోగలిగాడు. స్ప్రింగ్ డోర్స్ తెరచుకొని లోపలికి ప్రవేశించాడు

లోనికి ప్రవేశిస్తూనే—ఎడిటర్ సీటులో పూర్వాభాద్రగా కలంపేరు పెట్టుకొన్న ఉన్న నన్ను చూసి —

[illegible]

కూరలూ గుణాలూ!

## ముల్లంగి

లేతగానున్న ముల్లంగి దుంపకూర త్రిదోషాలను హరిస్తుంది. మూల వ్యాధి, గుల్మరోగం, నేత్రరోగం, శ్వాసకాసలు, క్షయరోగం, గళరోగం కలవారికిది మేలుచేస్తుంది. మూత్ర శుక్లములు వికృతినిపొంది పొత్తి కడుపున చేరియుండుటవలన మూత్ర నిరోధం కలిగి మూత్రం అతికష్టంగా అయ్యేడలెడిరోగం గలవారికి మేలు చేస్తుంది. అజీర్ణం, దద్దుర్లు, వాతం, పీనస వ్యాధులను జయిస్తుంది. మూత్రం బాగా జారీ అయ్యేట్లు చేస్తుంది.

గొంతుకకు, బుద్ధికి నష్టం కలుగజేస్తుంది.

ముదిరిన ముల్లంగి దుంపకూర దురదను, కఫాన్ని, త్రిప్పురోగాన్ని పోగొడుతుంది. మిక్కిలి జఠరదీప్తి నిస్తుంది.

అతిగా తింటే గురుత్వం గావుంటుంది. శోష, కాస, నీరసం, పైత్యం, వాతం కలుగజేస్తుంది. కడుపునొప్పి పుట్టిస్తుంది. రక్తాన్ని చెడగొడుతుంది. గొంతుకకు, తలకు నష్టాన్ని కలుగజేస్తుంది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. తేనె, 2. జీలకర్ర, 3. ఆవపిండి, 4. ఉప్పు.

## చిరగడ దుంప

చిర్ర చిరగడదుంప ఎక్కువ చలువ చేస్తుంది. రక్తాన్ని వృద్ధి చేస్తుంది క్షుద్బాధని నివారిస్తుంది.

కడుపులో వాతాన్ని బంధిస్తుంది. వాతం, గురుత్వం, శ్లేష్మం, పైత్యం చేస్తుంది. కడుపులో నొప్పి పుట్టిస్తుంది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. పంచదార, 2 పాలు, 3. ఉప్పు.

తెల్ల చిరగడదుంపకూర స్వాదుగ వుంటుంది. చలవచేస్తుంది. గురుత్వం చేస్తుంది. శ్లేష్మాన్ని పెంచుతుంది. బలహీనులకిది అపథ్యమయిన కూర.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. నెయ్యి, 2. పంచదార, 3. బెల్లం, 4. పులుసు, 5. కల్లు, 6. తమలపాకు, 7. మఱ్ఱిచెట్టు కాల్చి చేసిన క్షారము.

సేకరణ: అతుండి నారాయణమూర్తి.

# 'బ్యాటరీలు తయారుచేసే పరిశ్రమని ప్రారంభిస్తున్నాను' —వాణిశ్రీ



పెద్దహీరోలిద్దరి సరసన ఎక్కువ చిత్రాల్లో నాయికగా నటిస్తున్నతార వాణిశ్రీ. ఆమెకు డిసెంబర్ 28న షూటింగు లేదని తెలిసి, మంగంబాకంలోని ఆవిడ యింటికెళ్లాను. ఆమె కూడా అప్పుడే గుడికెళ్లి వచ్చింది.

ప్ర : మీకు వాణిశ్రీ అనే పేరు ఎలా వచ్చింది? ఎవరు పెట్టారు?

జ : శ్రీవాణి ఫిలింస్ వారి చిత్రంలో నటించేందుకు అసలుపేరు బాగాలేదని, ఎస్వీరంగారావుగారు మార్చారు. చివరికి ఆ చిత్రంలో నేను నటించనే లేదు.

**హిందీచిత్రంలో నాయిక**

ప్ర : మీకు హిందీ చిత్రసీమలో స్నేహితులెవరు? హిందీ చిత్రాల్లో నటించే వుద్దేశ్యం వుందా?

జ : పద్మిని. మాలాసిన్హాలు. ఇప్పుడొక హిందీ పిక్చర్‌లో నటిస్తున్నాను.

ప్ర : మీరు వున్న కొత్తయిల్లు మీకు అచ్చి వచ్చిందా?

జ : అచ్చివచ్చిందని మా అమ్మగారు అంటూవుంటారు. నాకు ఆ నమ్మకాలు లేవు.

ప్ర : లాటరీ టిక్కెట్టు యెప్పుడయిన కొన్నారా? ప్రయిజ్ వస్తే ఏం చేస్తారు?

జ : నేను యెప్పుడూ కొనలేదు; కొంటేగదా ప్రయిజ్ రావడానికి.

ప్ర : మీరు బాగా జరిపే పండుగలేవి? ఆ రోజుల్లో మాంసాహారం తింటారా?

జ: వినాయక చవితి; దీపావళి; మాంసాహారం తినను ఆ రోజుల్లో.

**థియేటరు నిర్మిస్తాను**

ప్ర: సినిమాతీసే వుద్దేశ్యంగాని, థియేటరు కట్టే 'ప్లాన్' గాని వుందా?

జ: సినిమా తియ్యను. థియేటరు కడతాను.

ప్ర: మీకు పారిశ్రామిక రంగంలో ప్రవేశించే వుద్దేశ్యం వుందా? యేదయినా పథకం ఆలోచించారా?

జ: అభిలాష వుంది. బ్యాటరీస్ తయారుచేసే పరిశ్రమను ప్రారంభించ బోతున్నాను.

ప్ర: మిమ్మల్ని చూచి అసూయపడే వాళ్లపై మీ అభిప్రాయం?

జ: వాళ్లను చూచి జాలి పడాల్సిందే.

ప్ర : మీకు సన్మానం చేస్తామంటే అంగీకరిస్తారా?

జ: అబ్బే, నాకు సన్మానమంటే గిట్టదు.

**కుక్క విశ్వాసంగల ప్రాణి**

ప్ర : సినిమా తారలందరూ కుక్కపిల్లలను పెంచుతారు. ఎందుచేత?

జ: మనుష్యులకంటె విశ్వాసపాత్రమైనవి కనుక.

ప్ర : నిద్రపోయేటప్పుడు కలలు వచ్చే అలవాటుందా?

జ : ఎవరికైనా కలలు రావడం సహజం. కాని విచిత్రం యేమిటంటే, నాకు రాత్రి వచ్చినకల ప్రొద్దున లేచేసరికి జ్ఞాపకము వుండదు.

ప్ర : సినిమాల్లో మీరు ధరించే దుస్తులను మీరే సెలెక్టు చేస్తారా?

జ : ఇలా కుడితే బాగుంటుందని డిజైను చెపుతాను. రంగులు మాత్రము వాళ్లకే వదిలేస్తాను.

ప్ర : మీ జీవితంలో తీరని కోరిక లేమయినా వున్నాయా?

జ : అంటూ యేదీలేదు. అనుకున్నవన్నీ జరుగుతూనే వున్నాయిగా.

**గుఱ్ఱంక్రింద పడేసింది**

ప్ర: మీరు యెప్పుడయినా, యేదయినా గండానికి గురిఅయినారా?

జ: ఊటీలో దేవర్‌ఫిలింస్ అవుట్‌డోర్ షూటింగులో గుర్రపుస్వారీ చెయ్యమన్నారు. నాకు రైడింగ్ తెలియదు, భయం అనికూడా డైరెక్టరుతో చెప్పాను. అది చాలా మంచి గుర్రమేనమ్మా అని చెప్పి, ఒకతన్ని పిలిచి ఆమెను గుర్రంమీద యెక్కించి అలా నడిపించు అని డైరెక్టరు చెప్పారు. గుర్రం వచ్చింది. దాన్ని చూచి పదిగజాలు దూరంగా పరుగెట్టాను. ఎలాగో అందరూ నాకు ధైర్యంచెప్పి గుర్రం యెక్కించారు. 'ఓ. ఎస్ రెడీ ఫర్ టేక్' అన్నాను. కెమరా ఆన్ అయింది. హాయిగా గుర్రంమీద వస్తూవున్నాను. ఇంతలో 'గేలప్' అన్న శబ్దం ఆ గుర్రం చెవిన బడింది. అది స్పీడుగా పరుగెట్టి, పరుగెట్టి, రెండు మైళ్ల కవతల వున్న కాలీఫ్లవర్ తోటలో నన్ను పడేసింది. ఆ తర్వాత కళ్లు తెరిచేసరికి మంచంమీద వున్నాను. ఆరోజు ఆ గండం అలా తప్పింది. అప్పట్నుండి గుర్రం ఎక్కాలంటే భయం.

ఇంటర్‌వ్యూ —శ్రీనివాస్




'సుబ్బారావు పెళ్లి చేసుకున్నాడు.' ఇది లోకులనే మాట. కాని లోకులు పలు కాకులు. పెళ్లి నే చేసుకున్నాను అనడం కంటే 'చారు' నన్ను చేసుకుంది అనటం ఉత్తమం. 'జీవితంలో ఇంకేమీ కోర్కెలు లేనప్పుడు మగవారు, కోర్కెలు తీర్చుకోవటానికి ఆడవారు వివాహం చేసుకోవాలి. ఇది నా అభిప్రాయం. లోకంలో పెద్ద వాళ్ళ మాటలు ఎప్పుడు విన్నారు కనుక?

సరే. మా ఆవిడ గురించి కొంత మీకు చెప్పాలి. శ్రీమతి పేరు చారుమతి. నేను ముద్దుగా పిలుచుకొనే పేరు 'చారు' పెద్దగా చదువుకోలేదుగాని వాకిలి వద్దులు ఇంటి వద్దులు బ్రహ్మాండంగా వ్రాసేయగలదట. వేదికలెక్కి ఉపన్యాసాలెప్పుడూ ఇవ్వలేదట కాని ఏ విషయంలోనైనా వాదన వచ్చిందంటే అవతలవాళ్ళను జాడించగల నేర్పుందట. పరీక్ష లెక్కలలో సున్నా వచ్చినా, ఇంటి లెక్కలో నూటికి నూరట. ఇదండీ వాళ్లమ్మ, నాన్న పెళ్లి చూపులప్పుడు కూతురుగురించి ఇచ్చిన రిపోర్టు.

పెళ్లికావటం, ఉద్యోగం రావటం ఒకేసారి జరిగాయి. అసలు ఉద్యోగం లేకుండా పిల్లనిచ్చిన వారెవరున్నారని మీకు సందేహం రావొచ్చు. కాని మా మామయ్యకు నా డిగ్రీమీద, దానికంటె ఓ మంత్రిగారి మాటమీద గురి ఎక్కువ. హైదరాబాదుకు శ్రీమతిని కూడా తీసు కెళ్ళదలిచాను. అసలే కొత్తకాపురం కాబట్టి హోటల్ నుండి తింటలేను. బయలుదేరే ముందు మా ఆవిడకెవరో స్నేహితురాలు చేతిలో పసుపు కుంకుమలతో బాటుగా ఓ పుస్తకం ఇవ్వటం గమనించాను. మా ఆవిడ దాన్ని పెట్టెలో పెట్టి అటెళ్ళగానే గబుక్కున తీసి చూసాను.

ఇంకేముంది ? కొంప మునిగింది. ఈవిడిలాటి పుస్తకాలు చదివితే నా పని గోవింద. ఇంతకూ నన్నింత కలవర పెట్టిన పుస్తకం ఏమిటనుకుంటున్నారు? అదేనండీ ఓ ప్రముఖ రచయిత్రి (ఆడవారు కాకుండా ఇంకెవరూ వ్రాస్తారు లెండి) వ్రాసిన 'భర్తనెలా లొంగదీసుకోవటం ?' ప్రస్తుత కాలంలో భార్యలు భర్తల కెదురు తిరగడానికి ఇలాటి పుస్తకాలే కారణం. మనలో మనమాట 'నా పెట్టె అడుగున కూడా 'భార్యనెలా లొంగదీసుకోవటం?' పుస్తకం వుందిలెండి.

ఇంతలో మా ఆవిడ దగ్గు వినిపించింది. పుస్తకం తీసి దాచేసాను. చారు దగ్గర కెళ్ళాను. ఒకటే దగ్గుతూంది. 'పుట్టినప్పటినుంచి జలుబు చిదెరుగదు నాయనా' అంది మా అత్తగారు తలుపు చాటున తప్పుకుంటూ.

ఆమాటకొస్తే నె పెళ్లి చేసుకొని నా రోగాలన్నీ అంటించేసినట్టు. పోని పెద్దావిడ కదాని వూరుకున్నాను.

'డాక్టరుదగ్గర కెళ్దాం పద ఓ ఇంజక్షన్ తీసుకుంటే అదే పోతుంది' అన్నా చారుతో ఈ సాకుతోనైనా అలా బొరుట భార్యతో తిరగొచ్చు కదాని. మా అత్తగారు కల్పించుకుని 'ఎందుకొచ్చిన సూది మందులు నాయనా. ఆ మధ్య నేనోమారు పుచ్చుకున్నాను. గోడకు మేకు కొట్టినట్టే వుడివ్వడం.' అంది చేయి తడుముకుంటూ. నవ్వొచ్చింది. మళ్లీ అందుకున్నారు. 'దేవుడిచ్చిన ఉమాపతి మాత్రలు వేసుకుంటే చిటికెలో పోతుంది' మా అత్తగారు మాటాడేది తెలుగే కదాని ఓమారు చెవులు రిక్కరించాను. సందేహం లేదు. మూరుపైసల నిజమైన, పదహారణాల పచ్చి తెలుగు. మా ఆవిడను పక్కకు పిలిచి అడిగాను.

'ఏమిటి చారూ ! దేవుడు రావటం

ఏమిటో? మాత్రలివ్వటం ఏమిటి? మరి ఇంక మూరభక్తా?' కోప్పడ్డాను.

మా ఆవిడ పకపక నవ్వింది.

'ఎందుకా నవ్వు?' ఉడుక్కున్నాను.

'దేవుడు కాదండీ దేవిక్ డాక్టరుగారి పేరు. హోమియోపతి మాత్రలను మా అమ్మ చక్కగా దేవుడు పేరుకింద మార్చుకొని ఉమాపతి మాత్రలంటుంది' అంటూ నవ్వింది.

'హోర్ని?' అనుకున్నాను.

మంచిరోజు చూసి వూరికి బయలుదేరాము. 'అభం శుభం తెలియని పిల్లను నీ చేతిలో పెడుతున్నాం' అంటూ కళ్ళద్దుకున్నారు అత్తయ్య, మామయ్య. నా చారును అరోప్రాణంగా చూసుకుంటానని మాటిచ్చాను.

'కష్టసుఖాలు మీ ఆయన, నువ్వు పంచుకోవాలే' అంది ఇంకొక పుస్తకం ఇచ్చినమ్మాయి. అంటే కష్టం నేను. సుఖం ఆవిడ తీసుకోవాలా? ఎంత హర్మంగా మాటాడేసిందీ గడుసుపిండం. ఈ అమ్మాయి కెవటి మొగుడొస్తాడో వాడిని తలచుకొని జాలిపడ్డాను.

బండి విజయవాడ దాటంగానే మా ఆవిడ పక్కేసింది. నాకు నిద్ర పట్టలేదు. సంసారం ఎలా లాక్కురావాలి భగవంతుడా అని ఆలోచిస్తున్నాను. బండి ఏదో స్టేషనులో ఆగింది. ఏమైనా తినాలనిపించింది. కమలాపళ్ళు అమ్ముతున్నాడొకడు. నేదిగి తీసుకొనేంతలో వాడు దూరం వెళ్ళి పోయ్యాను.

'ఏయ్ కమలా! కమలా!' రెండు సార్లు గట్టిగా పిలిచాను. వాడు విని పించు కున్నట్లులేదు. మళ్ళీ పిలిచాను. వాడు రాలేదు కాని వెడివెనకాల నడుస్తున్న వో రెండు జడలమ్మాయి విసవిస నాదగ్గరకొచ్చేసింది. 'ఏయ్ మిస్టర్! మంచీ మర్యాద వుండక్కర్లా? అక్క చెల్లెళ్ళు లేరూ?'

పెళ్ళాం కూడా వుంది. మనసులో అనుకున్నా. అంటే నా ఏమిటీ అమ్మాయి నాకు మంచితనం, మర్యాద లేదంటుంది. ఎలిమెంటరీ స్కూలు దగ్గర నుంచి కాలేజీ దాక మంచి పిల్లాడని నాకు బోలెడు సర్టిఫికెట్లున్నాయే. అవన్నీ చూపిం చేయనా, ఏవిటి?

'ఏమిటండీ?' అన్నా ధైర్యం తెచ్చుకుని ఎక్కడ శ్రీమతి లేస్తుందో నన్న భయంతో. కాని మా ఆవిడ లేవనేలేచింది. కిటికీలోంచి తల బయటపెట్టి నావైపో మారు. ఆ అమ్మాయి వైపోసారి పరీక్షగా చూసింది. ఆ అమ్మాయి చారుతో 'చూడండీ. ఇతనెవరో పేర్లుపెట్టి పిలిచి అల్లరి పెడుతున్నాడు' అని. రైలు కూయటంతో మాటలు ఆపి 'జాగ్రత్త' అంటూ చూపుడువేలు వూపి వెళ్ళిపోయింది.

మా ఆవిడ ఏ కళనుందో కాని అప్పటికేం మాట్లాడలేదు. మళ్ళీ మవునంగా మేను వాల్చింది. ఆ అమ్మాయి పేరు కమల అని నాకేంతెల్సు. అనవసరంగా అవమానం పాలయ్యాను. అక్షింతలు వేసుకోకుండా చవితి చంద్రుడిని చూసినట్లున్నాను. ఇంకెప్పుడూ ఆ పళ్లను తెలుగులో పిలవకూడదు.

'కమలాలను హిందీలో ఏమంటారండీ!' పక్కనో కాయనను అడిగాను. ఆయనేదో చెప్పాడు, సరిగా వినబడలేదు. మళ్ళీ ఇంకోసారి చెప్పినా అస్పష్టంగానే వినిపించింది మళ్ళీ మళ్ళీ అడుగుతే చెవిటివాడనని అనుకుంటాడేమోనని నేనే ఆలోచించాను, అతనినోరు మెదపడంబట్టి ఎలా పలకాలని. అది తెలిసింది.

'ఇదీ తెలుగు పేరులానే వుందీ?'

మరుసటి స్టేషనులో కమలాలు అమ్మ కాని కొన్నప్పుడు గట్టిగా.

'శాంతా...శాంతా' అని పిలిచాను.

వెనకాల భుజంపైన చేయి పడింది. 'నన్నింతగా ఎరిగున్నవారు ఇక్కడెవరున్నారబ్బా' వెనక్కి చూసాను.

హో పెద్దశాస్త్రి.

నాకంటె రెండింతల ఆకారం. కోర మీసాలతో భయంకరంగా వున్నాడు. వాడి చేతులొకక్కటి నా తొడంతేసి వున్నాయి. ...ఎవడబ్బా...వీడు? చిన్నప్పుడు గోలీలాడేటప్పుడు వో ఇద్దరి కుర్రాళ్ళకి నా వయస్సే వున్నా పెద్ద పర్సనాలిటీలు వుండేవి ఒకడు శంకరం. ఇంకోడు రాజా.

'రేయ్! నువ్వు శంకువా రాజువా?' అన్నావాడికేసి చూసి. ఒక్కక్షణం ఆశ్చర్య పడింవా శాస్త్రి. 'రాజా' ఇంతలో తెప్పరిల్లి. 'మామూలు రాజుని కాదురా. నీపాలిటి యమధర్మరాజునా' అన్నాడు కాలరు పట్టుకుంటూ. బిత్తరపొయ్యాను: 'ఇప్పుడేమయింది?'

'లేకపోతే నా భార్యను పేరెట్టి పిలుస్తావురా. ఇందాకోసారి గమనించాను. ఎవరో అమ్మాయిని పిలిచావ్. ఇప్పుడు నా భార్యను!' గద్దించాడు వాడు.

'రత్నంలాటి భార్య నాకుంటే, నీభార్యనెవరు పిలుస్తారయ్యా' అన్నా కాలరు విడిపించుకొంటూ. 'మరి?' నిలేశాడు. సంగతి చెప్పాను. 'హోహో. సంత్రానా?' అన్నాడొక్కసారి విరగబడి నవ్వుతూ వాడు. ఆ నవ్వుచూస్తే నిజంగా యమధర్మరాజే ననిపించింది. కమలాలను హిందీలో సంత్రాలంటారని, భాష తెలియకుండా ప్రయోగించటం చాలా ప్రమాదమని తెలిసొచ్చింది. ఇంత జరిగినా మా ఆవిడ నిద్రకు భంగంరాలేదు. మనసులోనే జోహార్లర్పించాను నిద్రదేవికి.

ముందుగా ఇల్లు అది కుదర్చమని స్నేహితుడికి ఉత్తరం వ్రాయటంవల్ల ఏం పెద్ద ఇబ్బంది అనిపించలేదు. పాలకార్డు రేషనుకార్డుకూడ సంపాయించి వుంచాడు. రేషనుకార్డు చూశాను. పేరు నాదేకాని పిల్లలునుటుకు ఎవరివారో! నాకు నలుగురు పిల్లలని వ్రాసుందందులో. 'ఏదేం అన్యాయంరా! పెళ్ళిజరిగి పదిరోజులు కాలేదు. మా ఆవిడ చూస్తే ఇంకేమయినా వుందా.'

'రేయ్ చిట్టితండ్రీ! భాగ్యనగరంలో రేషనుకార్డుల ధర్మమాని జనాభా మూడు లక్షలు అదనంగా పెరిగింది. అయినా ఇద్దరని వ్రాసుకుంటే ఇచ్చే గింజలు చాలవు. అందుచేత దాన్నలాగే వుంచు. అప్పుడప్పుడు చెకింగు జరుగుతూంటుంది జాగ్రత్త' అని చెప్పి వెళ్ళాడు.

ఉద్యోగంలో చేరాను. అంతా కొత్త. ఉద్యోగం కొత్త. వూరు కొత్త. భార్య కొత్త. సంసారం కొత్త. అలాగే [illegible] జిడ్డు కూడ [illegible] నచ్చపడింది. [illegible] అదే! పాలను తెల్లవారగానే పోయటం[illegible] వాసాళ్ళ బతుకంతా సగం క్యూల్లోనే గడిచిపోతుంది. మొదటిరోజు జరిగిన సంఘటనొకటి మీ ముందుంచుతాను.

ఆ వేళ తెల్లవారి నాలుగుగంటలయిందో ఏమో. బయట ఎవరో వెళ్ళిన చప్పుడు. ముసుగు పెకిలించి లాక్కొని అటు తిరిగి

పడుకోబోయాను. 'వచ్చేసింది, వచ్చేసింది. లేవండి. శ్రీమతి గొంతు అలారం కావటంతో నిద్రమత్తు వదిలింది. ఎందుకింత త్వరగా లేపటం? వాళ్ళ పూరమకొందా? 'ఏం రాలేదు. పడుకో' అన్నా ఆవలించి.

'పాలవ్యాను వెళ్ళిందండి. ఆలశ్యంగా వెడితే పాలయిపోతాయి' అంది. ఇక నిద్రపోనీయదని జోగుతూనే పాల బూతుకు వెళ్ళాను. అక్కడ అప్పటికే హనుమంతుల వారి తోకలా క్యూ పెరిగిపోయివుంది. పట్నవాసపు మనుషులు పెందరాళే లేవరన్న దురభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది. రాత్రి ఒంటిగంటనుంచి వచ్చి కూర్చున్నారా ఏమిటి కొంపదీసి నిశాచర పిశాచాల్లా. నా అరగంటవరకు పాలు పోసేవాడు రాలేదు. వాడంతు వచ్చేసరికి తెల్లారిపోయింది.

శ్రీమతి చేసిచ్చిన కాఫీ తాగుతూ పేపరు చూస్తుంటే మా ఆవిడ వచ్చింది: 'తల ఎలా బుట్టలా పెరిగిపోయిందో చూసుకోండి. క్షవరంచేసుకొని రాకూడదూ?' అంది.

'నిన్న రాత్రేకదూ జుత్తును నిమురుతూ ఎంచక్కా దిలీప్‌కుమార్‌లా వున్నారండీ అన్నావ్' అన్నా. చారు ఈ మధ్య సినిమా పత్రికలు తిరగేస్తోంది.

'చాల్లెండి మీ పరిహాసాలు మీరునూ. వెళ్ళండి వెళ్ళండి' అంది.

'ఎ' కాదే 'వె.వె' అన్నా ఒత్తి పలుకుతూ. మా ఆవిడకు 'వె' పలకటం రాదు. రాదు అనటంకంటె నేర్చుకోదు అనటం మంచిది. వెధవ అని తిట్టాల్సి వచ్చిందనుకోండి (నన్నింతవరకు అనలేదనుకోండి) ఎధవ అంటుంది. అలాంటప్పుడు చెప్పాలనిపిస్తుంటుంది కాని వేడిమీదవుండి ఆ కోపాన్ని నామీద ఎక్కడ కక్కుతుందోనన్న భయంతో మానేస్తుంటాను.

ఒక్కోమారు ఇలాటివి కొంపలు ముంచేస్తాయి. ఆ మధ్య నా సహోద్యోగిని భోజనానికి పిలిచాను. అలా పిలవటంతో కొంచెం 'కాకాయిజమ్' వుంది లెండి. ఆయన మా ఆఫీసరుకు దగ్గర బంధువు. రేపో మాపో ప్రమోషనుకు ఎదురుచూస్తున్నాను.

'మన ఆఫీసరుగార్ని చూస్తుంటే అచ్చం మా నాన్నగార్ని చూస్తున్నట్టే వుంటుందనుకోండి, ఎంత దయార్ద్ర హృదయులు. వెన్న, వెన్నెలలాటి మనసు. ఆయనదగ్గర పనిచేస్తుంటే గంటలు నిముషాలుగా దొర్లిపోతాయనుకోండి. అంటూ పొగుడుతున్నాను. ఇంతలో అక్కడికి వచ్చిన శ్రీమతి 'ఏడిచారు' అంది. గతుక్కుమన్నాను. 'ఏమిటీ' అన్నాను గుడ్లురిమిచూస్తూ వచ్చినాయనకు తెలియకుండా. నోటిలో ముద్ద మింగకుండా కూర్చున్నాడాయన.

'ఏడిచారండీ' అంది చారుమతి మళ్ళీ.

'ఎవరూ? ఆఫీసరుగారే' అన్నాడాయన కంగారుపడిపోతూ. ఈలోపల పరిస్థితి అర్థం చేసుకున్నాను.

'అదికాదు వేడిచారు కావాలా అని అడుగుతున్నదండీ' అని సర్ది చెప్పాను. ఆయన ఏడవలేక నవ్వేసి, మరీ నవ్వితే ఏమవుతుందోనని ఏడుపుమొహం పెట్టేసి నానా హంగామా చేసేసాడు. ఇదండీ సంగతి.

'వెళ్ళండి కాని వెళ్ళండి వెళ్ళండి. ఆవతలపనుంది' అనిచెప్పి వెళ్ళిపోయింది. మంగలిషాపు కెళ్ళాను. ఎయిర్ కండిషన్ గది.

అసలేక్షవరం. దానికితోడు ఇదో క్షవరం. లోపలి కెళ్ళాను.

హతోస్మి ఇక్కడకూడ క్యూ. నాముందు నలుగురు తలమాసిన వాళ్ళు. వాళ్ళకు చేసి నాకు చేసేసరికి తొమ్మిది దాటింది. సరిగా చేసాడంటే అదీలేదు. కత్తెర చెవిదగ్గర చిక్‌చిక్ మనిపించి పొమ్మన్నాడు. ఇంకొంచెం తీయమంటే, 'వికారం పుడుతుంది సార్. ఇప్పుడచ్చం దిలీప్‌కుమార్‌లా వున్నారు.' అన్నాడు డబ్బుగుంజి.

అలా వున్నానే పంపిందిరా శ్రీమతి అని మనసులో ఏడిచి బయటపడ్డాను. ఎవరాశవారిది. తిరిగి వారం రోజులకల్లా వస్తానని వాళ్ళాశ.

ఇంట్లో చారుమతి నాకోసం ఎదురుచూస్తోంది.

'ఏమిటండీ ఇంతసేపు? అయినా క్షవరం చేసుకోకుండా ఎక్కడ తిరుగుతున్నట్టు?' అంది నావేపు పరీక్షగా చూస్తూ.

ఇప్పుడేం జవాబుచెప్పాలో చెప్పండి. చేసుకున్నానంటే నమ్మేట్టులేదు. చేసుకోలేదు అంటే ఇంతసేపు ఎక్కడ తిరిగితున్నట్టు అంటూ నిలేస్తుంది. 'వెళ్ళాను. క్యూ బాగా వుండటంతో వెనక్కు వచ్చేసాను' అని చెప్పాను. నమ్మినట్లు కనిపించలేదు. కాని తలకు పోసుకోవటంతో బయటపడ్డాను.

భోజనంచేసి హడావిడిగా బయలుదేరాను ఆఫీసుకు. హే జగన్నాథ! ఏమిటి నీలీలలు? ఇక్కడకూడ క్యూ. తప్పేదేముంది వెళ్ళి నిల్చున్నాను. బస్సులు వస్తున్నాయి. పోతున్నాయి. కొన్ని స్టాపులకుముందే ఆగిపోతుంటే, కొన్ని ఆగటమేలేదు. బస్సు రాగానే క్యూ చెదిరిపోతుంది. ఇక్కడ మీకోసంగతి చెప్పాలి. ఆంధ్రదేశంలో ఆడపిల్లలు మగవారికేమాత్రం వెనుక బడ్డంలేదు. మగవాళ్ళే వారివెనుక పడిపోతున్నారు. ఆఫీసుకు వెళ్ళగానే అరగంటలేటు. ఇదీ స్థూలంగా ఇక్కడ జీవితం.

ఒకరోజు సాయంకాలం ఆఫీసునుంచి ఆవురావురుమంటూ వచ్చాను. ఇంట్లో ఏమీ అలికిడిలేదు. వంటప్రయత్నం అసలేలేదు. చారుమతి నడిగి విషయం తెలుసుకున్నాను. అసలే ఆకలిమీదవున్న నాకు కోపం ముంచుకొచ్చింది. సాధ్యమైనంత సామాన్యంగా చెప్పాను.

'పట్నాల్లోకూడా ఇలాటివి పెట్టుకుంటే ఏలాగూ? మనకెవరు వండి పెడతారు చెప్పు.'

'ఏమిటండీ మీరు మరీను. మనస్సేం దొరసాన్లమా ఈమాత్రానికే' అంటూ వాదన మొదలెట్టబోయింది. ఇక వాదించి లాభంలేదు.

'సరే ఏం చేయమంటావ్?'

'అన్నం, కూరలు పొద్దుటి చారు వుంది. ఇంట్లో [illegible] ఎలాగువుంది. నే చెప్తుంటాను మీరు చెయ్యండి.'

'ఆమాత్రం వంట నే చెయ్యగలనులే. నీ సలహాలేం అక్కర్లేదు' అని బియ్యం కడిగేసి ఎసరు పడేసాను. బెండకాయలు తరిగి ఉడకపెట్టాను. ఉడికిందో లేదో చూద్దామని మూతతీసాను వేడికి పట్టుకోలేక పోవటంతో కిందపడి పోయింది.

'[illegible]' వెలుపలనుంచి శ్రీమతి గొంతు. అబ్బ ఈ ఆడవాళ్ళకు ప్రతిమూత చప్పుడు గిన్నె చప్పుడు గుర్తే. ఈ ఆడవాళ్ళందరికీ

దశరథుడు శబ్దభేదిని వరంగా ఇచ్చేసి దేమో. జవాబు చెప్పకుండా ఒక ముక్క తీసాను. తీగలు తీగలుగా సాగిపోయింది. కత్తి తీసుకొని తీగలను తెంపుదామను కున్నాను. ఊహు లాభంలేదు. ఇదేం ఖర్మరాబాబూ అనుకుంటూ కూరను తీసుకెళ్లి వేపుడు చేసేద్దామని మూకుడులో పడేసాను.

పోపుకు ఏం సామాగ్రి కావాలో తెలియలేదు. చారు నడక్క తప్పలేదు.

'ఏముంది. నాలుగావాలు. రెండు మెంతులు. ఒకజీలకర్ర ఒకగరిటలో వేసి నూనెవేసి చిటపటలివ్వండి. చప్పుడయిం తర్వాత దించేయండి..' అక్కడనుంచే జవాబు.

అది చెప్పినట్లే నాలుగావాలు లెక్క పెట్టాను. వెధవది మరీ సన్న ఆవాలు. లెక్కపెడుతూంటే చేతు లొంచి జారి పోయేవి. ఎలాగయితేనేం అన్ని లెక్కపెట్టి గరిటలో వేసి నూనెపోసి మూతబెట్టాను. ఓ పదినిముషాలకు చిటపటలాడాయి. ఇంతలో అన్నం ఓమారు తలియబెట్టాను, అన్నం కాదది. పరవాన్నం. ఇంతలో ఇక్కడ గరిటలోంచి పెద్దమంట లేచింది, ఇటు పరిగెత్తుకొచ్చి ఆ నల్లటి ద్రవాన్ని కూరలో కలిపాను.

మా ఆవిడను పిలిచాను భోజనం అయిందని. అదే రేడీ అయిందని. 'అప్పు డేనా?' అందాశ్చర్యపోయి.

ఇదో బ్రహ్మవిద్యా? అని ఆకేసి కూర్చోమన్నాను.

కూరే వడ్డించాను.

'ఏం కూరిది?' నల్లగా, తెల్లగా, ముద్దగావున్న కూరను కలుపుతూ అడిగింది. 'బెండకాయ. పోపు అదీ చూడు మరి' అన్నా గొప్పగా.

'పోపుదీంట్లో కెందుకు? వన్నెందు కడగలేదు. అయినా కనిపించదేం?' వెతికింది కళ్లు పెద్దవిచేసి.

'నువ్వు చెప్పినట్లే ఎంచివేసాను. అంత కొంచెం ఎక్కడ కనబడతాయ్?'

'నేను నాలుగు అంటే నాలుగు లెక్క పెట్టి వేసారా?' అంది నవ్వుతూ..

కూర నోట్లో పెట్టుకొబోయి డొక్కున్నంత పని చేసింది. నేను గమనించనట్టు లోపలికెళ్లాను.

'కూర నాకు సయించలేదు, కాని అన్నం పెట్టండి మజ్జిగ పోసుకుంటా' అంది చారు. 'ఇదిగో గ్లాసులో వుంచాతీసుకో.'

'ఏమిటి అన్నమే' అంది నిర్ఘాంతపోయి.

'సర్లే పెద్ద చేప్పొచ్చావ్. కొద్దిగా ముద్దయిందంతే.' అన్నా వోటమి ఒప్పుకోటానికి ఇష్టంలేక.

'అందుకే మగాళ్లకు పని చెప్ప కూడదు' అంటూ మజ్జిగతాగి లేచింది. నేను కూడా నా స్వయం పాకాన్ని రుచి చూసిం తర్వాత హోటలునుంచి కారియర్ తెప్పించక తప్పలేదు.

ఆఫీసులో ఒకరిద్దరు స్కూటర్లున్న స్నేహితులు దొరికారు. నాకుకూడా ఒకటి వుంటే బాగుండు ననిపించింది. పదిన్నర ఆఫీసుకు పదింపావుకు బయలుదేరవచ్చు. స్కూటర్‌కు డబ్బు ఎక్కడ దనుకుంటు న్నారేమో. మామగారున్నారుగా, అయినా కూతురి సౌకర్యంకోసం ఆ మాత్రం అల్లుడికి కొనివ్వరేరూ? అల్లుడికి స్కూటర్ వుంటే కూతురు ఏం సుఖ పడుతుందనుకోవచ్చు. తీరికగా వంట చేయొచ్చు. సాయంకాలం షికార్లకు తిరగొచ్చు. ఇంకా ఎన్నో...ఎన్నో...

స్నేహితులవల్ల స్కూటర్ నడపటం నేర్చుకున్నాను కొన్నాళ్ళకు. స్నేహితుడు వూరికి వెళుతున్నప్పుడు స్కూటరును మా ఇంట్లో వుంచుకున్నాను.

ఆ రోజు మొదటిసారిగా శ్రీమతిని స్కూటర్‌లో ఎక్కించుకొని సినిమాకు వెళ్లామని నిశ్చయించు కున్నాను. ఇంటికి త్వరగా వచ్చి చారుమతిని త్వరత్వరగా ముస్తాబు కమ్మన్నాను.

'నూనెక్కడండీ?' శ్రీమతి ప్రశ్న.

'ఇదో' పరాగ్గా అందించాను సీసాను పత్రిక చూస్తూ. 'అలాగే నాతలకు రాయి' అన్నా లోపల కెళ్లపోతున్న శ్రీమతితో.

సరేనని చేతిలోకి తీసుకొని తలకు రాసింది అంతే. నురుగునురుగు.

'ఏమిటిది?' కంగారుగా లేచాను.

'నాకేం తెల్సు మీరిచ్చిన నూనేగా' అంది సీసాను చూపిస్తూ.

ఆడవారికి చదువెందుకో ఆక్షణంలో బాగా తెలిసొచ్చింది. మా చారు హెయిర్ ఆయిల్ అనుకొని షాంపూ నాతలకు రాచేసింది. నిజానికి శ్రీమతి తప్పుకూడా లేదు. రెండుసీసాలు ఒకేలా వుండటంతో ఈ అనర్థం సంభవించింది. అప్పటి కప్పుడు పరిగెత్తి స్నానం చేసొచ్చాను.

వచ్చేసరికి శ్రీమతి ఎవరికో లెక్కలు/

డాక్టర్ కబుర్లు

## ఆవేశం - హృదయం

హృదయం మీద ఆవేశాలకి ప్రభావం ఉంటుంది. అది కొట్టుకునే వేగం అధికం అవుతుంది, రక్తపుపోటు ఎక్కువ అవుతుంది, రక్తంలో రసాయనాలు మారిపోతాయి, రక్తం కరుడు కట్టుకునే వ్యవధి తక్కువ అవుతుంది.

ఎప్పుడూ బిగతీసుకుని, చెరుకుగా ఉండే వారికన్నా తమ ఆవేశాలని అదుపులో ఉంచుకొన గలిగిన వారికి గుండెజబ్బు వచ్చే అవకాశం తక్కువ అనవచ్చు, అయితే, ఆదుపులో ఉంచుకొనటం, అంటే ఏమిటి? అంటే— చిన్న చిన్న విషయాలని గురించి అనవసరంగా ఆందోళన పడకుండా ఉండటమే.

లోపల అగ్ని రగులుతూ ఉంటే, బయటికి నిదానంగా కనిపించటానికి ప్రయత్నించి ప్రయోజనం లేదు, ఆవేశం ఉంటేనే చాలు గుండె, రక్తనాళాలు వత్తిడికి లోనవుతాయి.

తరచ ఆవేశాలకి లోనయి బాధపడేవారు డాక్టరుని అడిగి కొన్ని రకాల మందులని పుచ్చుకుని ఉపశమనం పొందవచ్చు, ఆధ్యాత్మికమయిన సలహాని కూడా పొందవచ్చు

ఏది ఎలాగ ఉన్నా, మందులని అధికంగా తినటం మంచిదికాదు. ఎప్పుడో ఒకసారి వాడాలి అంతే. కొందరు ధనవంతులు దేహం ఆరోగ్యంగా ఉన్నప్పటికీ మానసికంగా బాగా చితికిపోయి ఉంటారు, కొందరు పేదవారు ఆరోగ్యం బాగా ఉండనప్పటికీ, ఉదరపోషణకోసం కష్టపడి పని చెయ్యవలసి వచ్చినప్పటికీ సంతోషంగా ఉంటారు. మొదటి తెగవారికి సంతృప్తి లేకపోవటం, రెండవ తెగవారికి ఉన్న దానితో సంతోషపడటం తెలియటం ఈ రకం పరిస్థితులకి కారణం అనవచ్చు. సంతృప్తి అధికం అయిన కొద్దీ హృదయానికి ప్రమాదం .తక్కువ అవుతుంది.

[హెచ్. ఎల్. హెర్షెన్‌సన్.]

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.







# సంసారసాగరంలో...

చెప్తున్నంది. నేను రావటం చూసి నన్ను పిలిచారాయన.

'మీ ఫామిలీ మెంబర్లెంతమంది?'

రేషనుకార్డు సంగతి గుర్తుకొచ్చింది. అప్పుడప్పుడు చెకింగ్‌కు వస్తారన్న సంగతి గుర్తు కొచ్చింది. 'మేమిద్దరం. నలుగురు పిల్లలం' అన్నాను దొంగలా గుంభనంగా. మా ఆవిడ గిరుక్కున లోపలకెళ్ళి పోయింది.

ఆయన వస్తూనూ 'నేను ఎన్నికల లెక్కలు తీసుకోవటానికొచ్చాను. మరి దేనికీ కాదు' అన్నాడు. ఆయనను పంపేసి లోపలికొచ్చాను.

మా ఆవిడ అలకపాన్పు ఎక్కేసింది. సినిమాలోలా దిండులో మొహం దాచుకొని బెక్కుతూంది. నాకేం అర్థం కాలేదు.

'చారూ...చారూ...' అనునయంగా పిలిచాను

'చారూ లేదు పులుసూ లేదు నన్ను పలకరించకండి' విసురుగా అంది.

'అవతల సినిమాకు టైమయిపోతూంది. ఎందుకే అలక?'

మాట్లాడలేదు.

'భార్యారత్నం ... ఎందులకీ కోపం ?' నవ్విద్దామని చూశాను.

'ఎంతమంది భార్యలున్నారేమిటి మీకు? అందులో నేను రత్నాన్ని కావటానికి. ఇంతకీ ఏ భార్య పిల్లలు వాళ్ళు ?' ఏడుపుగొంతు.

'ఓ అదా! నే చెప్పేది విను' నచ్చచెప్పబోయాను.

'మీరెన్ని చెప్పినా నేను నమ్మను. రైల్లో వస్తున్నప్పుడు ఎవరో అమ్మాయిని పిలిచారు.'

ఇంకా మరిచిపోలేదా అది అనుకున్నాను. పరిస్థితి అంతా వివరంగా చెప్పాను. నాదసలే వెన్నలాంటి మనసు. కాటుకంతా కరిగిపోయేలా ఏడ్చేసిన చారును చూస్తే జాలేసి ఏదైనా వరం కోరుకోమన్నాను. మీ పాదాలదగ్గర ఇంత చోటిస్తే చాలంటుందన్న ఉద్దేశ్యంతో. కాని కథ అడ్డం తిరిగింది.

'అయితే టెర్రికాటన్ చీర కొనిపెట్టండి. పక్కింటి పద్మజ కట్టినదే' అంది గోముగా నోరు జారాను. ఇప్పుడే మైనా అన్నానంటే మొదటికొస్తుంది.

'మరి సినిమాకు పోదాం. త్వరగా తయారవు' అన్నా బుగ్గమీద చిటికేసి. ఇదుగో ఇదిగో ఇప్పుడే రెండునిముషా' లంటూ లోపలికెళ్ళి ఇరవై నిముషాల కొచ్చింది.

'స్కూటర్‌లో పోదాం.'

'అమ్మో నాకు భయం.'

'పర్వాలేదు. మెల్లగా తీసుకెళతా. నువ్వు గట్టిగా పట్టుకో' ఎలాగయితేనేం. చారుతో బండి ముందుకురికింది. ట్రాఫిక్‌ను తప్పించుకుంటూ ముందుకెళుతున్నాను. ఆబిడ్సుదాక వచ్చాము. వెనకాల మిగతబండ్లు హారన్ కొడుతున్నాయి.

'చారూ!'

'ఊఁ'

'బండి మరీ ఎద్దుబండిలాపోతూంది: కొంచెం వేగం పెంచుతా. గట్టిగా పట్టుకో' మా ఆవిడ అంటే ఏదో అనుకున్నాగాని గడుసుదే. నా నడుము చుట్టూరా చేతులు వేసింది.

వేగంగా పోతూంది బండి. మా ఆవిడ పట్టు ఎక్కువయింది. దాంతో కితకితలు పుట్టాయి అలా పట్టుకోవద్దని చెప్పాను. కాని గాలిహోరలో వినిపించినట్లు లేదు.

'అంత గట్టిగా పట్టుకోకు చారూ' అరిచాను వాదాప్పు.

వినిపించినట్లుందీసారి. 'అమ్మో నే పడిపోతానండి' అంది చేతులు నడుము మీద మరింత బిగించి.

కితకితలు ఎక్కువయిపోతున్నాయి. నోరుకు పోసుకోవటంవల్ల జుట్టు మొహం పైన పడుతున్నాయి. కళ్ళుమూసుకుపోతున్నాయి. ఆపడానికి వ్యవధిలేదు.

'ఇద్దరం పడేట్టున్నాం. చారూ కొంచెం వదులు' ప్రాధేయపడ్డాను. ఆవిడ ఇంకొంచెం గట్టిగా పట్టుకుంది. కితకితలు మరీ ఎక్కువయింది. బాలన్సు తప్పింది. ఒక్కక్షణం ఏమయిందో తెలియ లేదు. కళ్ళు తెరిచేసరికి ఒకపక్క స్కూటరు, ఇంకోపక్క చారుమతి. ఎదురుగా పోలీసు, చుట్టూ జనం వున్నారు.

పోలీసును చాటుకు తీసుకెళ్ళి ముట్టచెప్పవలసిన లంచం రాటు అనీ ముట్టచెప్పాను. అదృష్టంకొద్దీ స్కూటర్‌కు

ఉద్యాలు వెతకటం తప్పించి మరేం జరగలేదు!

నాకు తగిలినన్ని పోలీసు దెబ్బల్లాంటివి. అంటే పైకి కనబడనివి. నడుము బెణికింది. కాలు మడతపడింది. తల బొప్పికట్టింది. మోకాలు చీరుకు పోయినట్లుంది. ఒకేమంట. జనం సాయంతో స్కూటర్ను పైకిలేపి దగ్గర్లోనున్న సినిమా కెళ్లాము.

అదేదో ఇంగ్లీషు సినిమా. ఆ సినిమాకు వెళ్లివచ్చిన తరువాత, చారు ఇంగ్లీషు నేర్చుకునేంత వరకు సినిమాకు తీసుకెళ్లకూడదనుకున్నాను. ఎందుకంటారా? ప్రతిమాటకు అర్థమడుగుతుంది. అడగటం తప్పు కాదు. కానివచ్చిన చిక్కల్లా నాకు అర్థం కాకపోవటమే. ఏదో గుంభనంగా గంభీరంగా పోజు పెట్టి అర్థమయినట్లు చూపెడుతుంటాను. ఇక దీనికేమని అర్థం చెప్పను? ఆఖరికి అదనే అడిగింది.

'మీకు ఇంగ్లీషు సరిగా రాదా? మీ ఇంగ్లీషు వ్రాతకూడా బాగుండదు. కాపీ రాయలేదా?' ఒప్పుకోవటం ఎందుకో భార్య ముందు ఏంత నామోషి!

కాపీ రాస్తున్నానే బుద్ధి తెలిసినప్పటి నుంచి. లేకపోతే నియ్యోగం ఎలా లాక్కొచ్చాననుకుందో మనసులో అనుకున్నా.

'ఈ సినిమాలిండా అమెరికా మాటలు అందుకే అర్థమవటంలేదు' అన్నా.

'అయితే అమెరికాలో ఇంగ్లీషు మాట్లాడరా?' అందమాయకంగా.

నా పరువు బజారున పడేట్టుంది. 'సినిమా బాగుందా' మాట మార్చేసాను. వెనకెవ్వరో కిసుక్కున నవ్వినట్టు కూడా గుర్తు.

రోజులు, వారాలు నెలలు జరిగి పోతున్నాయి.

ఒకరోజు ఉదయం పేపరుచూస్తుంటే కుటుంబ నియంత్రణ ప్రకటన కనబడింది. అప్పుడు. జనం పెరిగిపోతున్నారు.

అందుకే కదా ఎక్కడ చూసినా నిరుద్యోగసమస్య. ఎక్కడ కెళ్ళినా క్యూలు అనుకోకుండా పిల్లలను కనడంకంటె అనుకుని పిల్లలను కంటంలో ఎంత సుఖం, శాంతి ప్రతివాళ్ళు ఫామిలీ ప్లానింగు ఆచరించవలసిందే.

హాయ్ మా ఆవిడను పిలిచాను. జవాబు లేదు.

'హాయ్‌హాయ్!' గట్టిగా పిలిచాను.

ఊహూ! కనీసం వినబడినట్లు కూడా లేదు. ఏదో కూనిరాగం తీస్తూవుంది. మొగుడనేవాడు పిలుస్తున్నాడనన్నాలేదు,

'చారుమతీ' శక్తికొలదీ అరిచాను.

'ఏమిటి పిలిచారా?' అంటూ తడిచేతులు కొంగుకు తుడుచుకుంటూ వచ్చింది. చూసారా. ఎంత విపరీతకాలం వచ్చిందో. భర్త భార్యను పేరెట్టి పిలుస్తే తప్ప పలకటంలేదు. లాభంలేదు. ఈ పత్రికలు అవీ కొనటం మానిపించేయాలి. చదివి చెడిపోతున్నారు, దీన్నిలా వదిలేస్తే, అదే కుటుంబనియంత్రణ మొదలెట్టకుండా వుంటే పిల్లలను కనేసి నామీదకు తోలేసి తను పూర్తి అధికారం చేజిక్కించుకుంటుంది.

'వంటయి పోయిందా?'

'లేదు. ఏమిటో రాచకార్యం?' అంది క్రీగంట చూస్తూ. కొంటెగా.

అమ్మో ఇక సినిమాలు కూడా మానిపించేయాలి.

'ఆసుపత్రి కెళ్ళాలి.'

'ఎందుకు?' కంగారుగా ఒళ్ళు పట్టుకుని చూసింది. ఏమీలేదే ఆసుపత్రి కెందుకన్నట్లు మొహం పెట్టింది.

అన్నిటికీ అడ్డుప్రశ్నలు దీనితో వేగలేక చస్తున్నాను. ఏంచేస్తాం అర్ధశరీర మాయె.

'తప్పదు రావాలి నువ్వుకూడా' అని ఒప్పించాను కారణం చెప్పకుండా. కారణం చెబితే బ్రహ్మకూడా కదిలించలేడు చారునిక్కడినుంచి.

రిక్షాలో ఆసుపత్రికి చేరుకున్నాము.

కాంపౌండులో నడుస్తూ అన్నాను 'ఎందుకొచ్చామో తెలుసా?'

'ఏమో నాకేం తెలుసు' నిష్ఠూర్యంగా అంది శ్రీమతి.

'ఫామిలీ ప్లానింగ్ అంటే కుటుంబ నియంత్రణ పాటించడానికి,'

బోలెడు సిగ్గుపడి పోయింది చారుమతి.

'వద్దండి మీకు తెలియదు'.

'నాకన్నీ తెలుసు. నువ్వు మాట్లాడకు.' అని లేడీడాక్టరు దగ్గరకు తీసుకెళ్ళి దేశం పరిస్థితులు వివరించి నా శ్రీమతిచే ఫామిలీప్లానింగ్ అవలంబించేలా చేయించమని చెప్పాను.

'ష్యూర్, ష్యూర్' అంది లోని కెడుతూ.

ఓ పదినిముషాల తరువాత ఇద్దరూ బయటకు వచ్చారు. చారుమతి నావైపు చూసి కొత్త పెళ్ళికూతురులా సిగ్గుపడి పోయింది.

డాక్టరమ్మ వచ్చి కంగ్రాచులేషన్స్ చెప్పింది.

ఎలాగైనా చదువుకున్నవాడిని అందులోనూ బాధ్యతగల పౌరుడిని అందుకే అభినందిస్తుందనుకుని—

'థాంక్యూ, థాంక్యూ' అన్నా.

'బలమైన ఆహారం పుచ్చుకోవాలి. టానిక్ వ్రాసిస్తాను' అంది డాక్టరు.

'ఎవరికి నాకా?'

ఆవిడనవ్వి 'మీ ఆవిడకు' అంది.

'చారుమతికేమి? దిట్టంగానే వుంది కదా. ఎందుకు?'

'మీ మిసెస్ ఇంకా చెప్పలేదా. ఆవిడ తల్లి కాబోతున్నారు'

'వ్వాట్?'

ఆవిడ నవ్వుకుంటూ వెళ్లిపోయింది. దేశానుద్ధరిద్దామని నేననుకుంటే నన్నుద్ధరించటానికి ఇంకోడు తయారా?

రిక్షాలో ఇంటికొస్తూ అడిగాను. 'మరి నాకుముందుగా చెప్పలేదేం?'

'చాల్లెండి మీరు మరీను మనమేం ఇంగ్లీషువాళ్ళమా?' అంది చారు.

'అది సరేకాని ఏంపేరు పెడదాం?'

'నే చెప్పనా?'

ఏంపేరు చెప్తుందోనని చెవులు రిక్కించాను.

'బాబయితే...బాలవీర వెంకట సత్య సూర్య వరప్రసాద...' ఆపకపోతే దండకం ఎంతవరకు పోతుందోనని' మరి పాపయితే?'

అన్నా మధ్యలో ఆపేస్తూ.

'బాలత్రిపుర సనకదుర్గ వేంకట సీతామహా...' పాలడబ్బాల గురించిన ఆలోచనలతో సంసారమనే సాగరంలో సగందాక మునిగిన నాకు మిగిలినమాటలు ఏవీ చెవికెక్కలేదు.

# 'హాస్యపాత్రలని ధరించడం మానేశాను' -గీతాంజలి



'ఇల్లాలు' కథానాయిక గీతాంజలి గతవారం కొత్త యింట్లోకి ప్రవేశించింది. గృహ ప్రవేశానికి వెళ్ళి, ఆమెకు 'బెస్ట్ విషెస్' చెప్పి ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు ఆమె యింటర్వ్యూ తీసుకున్నాను.

ప్ర: 'ఇల్లాలు' నాయిక అయిన మీరు ఒక యింటి 'ఇల్లాలు' యెప్పుడవుతారు?

**అంతా వాడి లీల**

జ: నేనలా చెప్పగలనండి. విధి వ్రాత యెలా వుందో, యెప్పుడు జరుగుతుందో. అంతా దైవనిర్ణయం.

ప్ర: మీకు దేముడిమీద చాలా ప్రగాఢ నమ్మకమా?

జ: అవును. నా చిన్నతనం నుండే నేను గుడి, గోపురాలకు వెళ్తోదాన్నట.

ప్ర: మీకు పూజ, పునస్కారాలు చేసే అలవాటుందా?

జ: మా యింట్లో భగవదారాధన ప్రతిరోజూ జరుగుతుంది.

ప్ర: మీరు ఆచరించే వ్రతాలు, పొద్దులేమిటి?

జ: సత్యనారాయణ వ్రతం, సోమవారవ్రతం వుంటాను, ప్రతి శివరాత్రి వొక్కపొద్దు వుంటాను. ఆరోజు పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోను. నాగేంద్ర వ్రతం, రాజరాజేశ్వరి.

ప్ర: ప్రతి శుక్రవారం తలంటు స్నానం చేస్తారా? ఒంటికి పసుపు రాసుకుంటారా?

జ: సంవత్సరానికి ఎన్ని రోజులున్నాయో, అన్నిరోజులూ స్నానం చేసే సమయంలో పసుపు రాసుకుంటాను. శుక్రవారం మాత్రమేగాక మంగళవారం నాడు కూడా తలంటుకుంటాను. (నార్లో వుంటే)

ప్ర: సినిమా తారలకు గ్లామర్ వున్నంత కాలమే మార్కెట్టు వుంటుందా?

జ: గ్లామర్ మాత్రముంటే సరిపోదు. నటన, అదృష్టం వుండాలి. కాలం కలిసివస్తే, ఎంతకాలమయినా వుండొచ్చు.

ప్ర: 'ఇల్లాలు' చిత్రంలో నాయికగా నటించిన మీకు మళ్ళీ హీరోయిన్ ఛాన్సులు రాకపోవడానికి గల కారణం?

జ: నిర్మాతలదృష్టి నాపై పడలేదేమో, లేక నన్ను నటిగా గుర్తించలేదేమో!

**కామెడీ వేషాలు వెయ్యను**

ప్ర: మీరు కూడా బాధ్యులంటే ఒప్పుకుంటారా?

జ: (కాస్సేపు ఆలోచించి) అవును. అందుకే యిప్పుడు కామెడీరోల్స్ వెయ్యడం మానేశాను. ఇకపై హాస్య పాత్రల్లో కనిపించను.

ప్ర: పరిశ్రమలో మంచి, చెడుల నిష్పత్తి ఎంత వుంటుందంటారు?

జ: 1:3 లో వుందండి.

ప్ర: సినీమారంగంలో మీకు ఆప్త మిత్రులెవరయినా వున్నారా?

జ: అందరూ ఆప్తులే. ఇది ఒకరి వుమ్మడి వ్యాపారంగదా.

ప్ర: గతించిన మీ తల్లి స్మారక చిహ్నంగా ఏదేని సత్కారం చేశారా?

జ: తిరుపతి కొండపై ఆమె పేరుతో కాటేజీ కట్టించాము. ఆమె చనిపోయిన రోజున బీదలకు అన్నదానం చేస్తున్నాము.

**చన్నీళ్ళ స్నానం పడదు**

ప్ర: చన్నీళ్ళలో స్నానం చేస్తారా? వేన్నీళ్ళలోనా?

జ: చన్నీళ్ళ స్నానంచేస్తే వెంటనే జలుబు చేస్తుంది. వేన్నీళ్ళస్నానమే.

ప్ర: మీకు ఎన్నికార్లు వున్నాయి? కారు కలర్, నెంబరు ఎంత?

జ: నాకు ఒక్క అంబాసిడరు కారు వుంది. 1967 మాడల్; MSW 2196; నీలిరంగు.

ప్ర: 'ఇంపాలా' మోజు మీకు లేదా?

జ: ఇప్పుడే దేనికండీ. నిదానంగ కొంటాను.

ప్ర: మీరు ఎక్కువగా ఎలాంటి చీరెలను ధరిస్తారు? ఏఏ నగలను పెట్టుకుంటారు?

జ: వాయిల్ చీరెలను కడతాను. నాకున్న నగలన్ని పెట్టుకుంటాను. (ఫంక్షన్, పెండ్లి, పేరంటాలకు)

ప్ర: 'సంక్రాంతి'ని ఎలా జరుపుకుంటారు?

జ: అందరిలాగే మంగళస్నానమాచరించి, కొత్త దుస్తులను వేసుకుని, వుదయం ఫలహారం మా నాన్న చేతిమీదుగా తీసుకుని, మేకప్ రూమ్‌కివెళ్ళి, షూటింగు కోసం స్టుడియోకెళతాను.

**చిలకజోస్యం నిజమైంది**

ప్ర: మీకు చిలకజోస్యంమీద నమ్మకముందా?

జ: వుంది. ఎన్నోసార్లు చిలక పలుకులు ఫలించాయి.

*ఇంటర్వ్యూ — శ్రీనివాస్*



బలం సమర్పించు శ్రీరమణా చిత్రవారి

# మట్టిలో మాణిక్యం

శ్రీఫిలింస్

Kalanikethan

దర్శకత్వం:B.V.ప్రసాద్ రచన:రాజశ్రీ సంగీతం:సత్యం ఛాయ:లక్ష్మణ్‌గోరే ఆర్ట్:B.N.కృష్ణ ఎడిటర్:అంకిరెడ్డి

SUVARNA

# ఉత్తమనటి బహుమతిగ్రహీత జానకితో ఇంటర్వ్యూ

'ఏమిటి జానకిగారూ, మమ్మల్నెవరినీ పిలవకుండానే గృహప్రవేశం చేసేశారు?' అని అడిగాను, ఆమె కొత్త యింటిని పరిశీలనగా చూస్తూ.

జానకి నవ్వి 'ప్రతి సారీ హడావిడి చెయ్యటం నాకు యిష్టం వుండదు. మామూలుగా వచ్చి పాలుపొంగించి గృహప్రవేశం చేశాను. ఈ యింటికి షిఫ్ట్ అయి రెండు వారాలే అయింది. ఇంకా ఫినిషింగ్‌లో వుంది' అన్నారు.

సెనోటాఫ్ రోడ్‌లో ఆధునిక పద్ధతుల్లో కట్టబడిన ఆయిల్లు చూడ ముచ్చటగా ఉంది. నే వెళ్ళేసరికామె, హాల్లో ఎక్కడ వుండవలసిన వస్తువుల్ని అక్కడ ఎంతో శ్రద్ధగా తనే స్వయంగా సర్దుతున్నారు. చక్కగా, కళాత్మకంగా ఉన్న ఆ యింటిని పరికించినవారికి శ్రీమతి జానకికి గల అభిరుచి ఎలాంటిదో అర్థం అవుతుంది. ఆమె అభిరుచులు ఎపుడూ ఒక ప్రత్యేకతను — సంతరించుకుని ఉంటాయి. ఈ మధ్య స్వంతంగా తమిళంలో జానకి ఒక చిత్రం తీశారు. ఆ చిత్రం, చిత్రంపేరు ఆమె చక్కని అభిరుచులకు తార్కాణం. ఆ చిత్రంపేరు కావియతలైవి (కావ్యనాయకి) అలాంటి పేరు పెట్టడానికి మంచి టేస్ట్ ఉండాలి.

కావియతలైవి తమిళనాడంతటా అఖండ విజయాన్ని సాధిస్తున్నది. అందులో ఆమె రెండుపాత్రలు పోషించారు. ఒకటి తల్లి, మరొకటి కూతురు. ఈ రెండూ ఎంతో వైవిధ్యం ఉన్నవేగాక, వయసుల్లో చాలా వ్యత్యాసం ఉన్న పాత్రలు. ఆ పాత్రలపోషణ ద్వారా ఉన్నత ప్రమాణాలు కలిగిన చక్కని నటిగా మరోమెట్టు పైకి అధిగమించారు జానకి.

'ఈ చిత్రం ప్రారంభించే ముందు — ఏం పోతుంది? ఏం చేస్తుంది?' అన్నారు కొందరు. కాని, ఫలితం చూశారా? బ్రహ్మాండంగా క్లిక్ చేసింది' అన్నారామె, మొహంలో సంతోషరేఖలు తారట్లాడుతూండగా.



తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి నుంచి 1969 సంవత్సరపు ఉత్తమనటి అవార్డు అందుకుంటున్న శ్రీమతి జానకి. (చిత్రం : ఇరుకోడుగళ్)

1969వ సంవత్సరానికి 'ఇరుకోడుగళ్' చిత్రంలో 'ఉత్తమనటి'గా తమిళ ప్రభుత్వంచే ఎన్నుకోబడి అవార్డు పొందటం ద్వారా గౌరవించబడ్డారు జానకి. ఈ 'ఉత్తమనటి' అవార్డు కిందటి సంవత్సరాంతంలో వచ్చింది.

'తమిళ చిత్రాలతో పాటు తెలుగు చిత్రాల స్థాయికూడా బాగా పెరిగిందని అంటున్నారు కొందరు. దీనిపై మీ అభిప్రాయం?'

'తెలుగు చిత్రాల స్థాయి నానాటికీ తీసికట్టుగా వుంటోంది. తెలుగువాళ్ళకి టాలెంట్ అక్కరలేదు. కథకున్న ప్రాముఖ్యతను చంపేసి, చవకబారు శృంగారాన్ని ప్రవేశపెట్టి చిత్రాలస్థాయిని దిగజారుస్తున్నారు. నైట్‌క్లబ్బులూ, కెబరాలు మన ప్రాంతాలలో ఉన్నాయా? లేని వాటిని చిత్రాలలో జొప్పించి అసభ్యతను, చవకబారు శృంగారాన్ని చూపుతుంటే — జుగుప్సకలిగి కుటుంబస్త్రీలెవరూ సినిమాలకు రావటానికి బాధపడుతున్నారు. మన చిత్రాలదశ యీ స్థాయిలో వుంటే — పెరిగిందని ఎలా అనగలం?... ఇలా చెప్పవలసి వస్తున్నందుకు నేను చాలా విచారిస్తున్నాను.' అన్నారు జానకి సమాధానంగా.

మూడేళ్ళుగా ఉత్తమ నటిగా వస్తున్న శ్రీమతి జానకి, రెండున్నర ఏళ్ళ తర్వాత యిపుడు శివాజీగణేశన్‌తో రెండు చిత్రాలలో నటిస్తున్నారు. 'మరొక విషయం చెప్పాలనుకుంటున్నాను' అంటూ ఆగారు. 'షూర్, చెప్పండి' అన్నాను. 'ప్రేక్షకుల్లో కొందరు వర్గాలుగా ఏర్పడి — అభిమానుల చిత్రాలను ఆదరించటం, ఇతరులు నటించిన చిత్రాలపై అల్లర్లు లేవదీయటం ఆరోగ్యకరమైన విధానం కాదు. ఈ గ్రూపిజమ్ పోవాలి. వైషమ్యాలు, పక్షపాతాలు వదలి మంచి చిత్రాలు చూడటం అలవాటు చేసుకోవాలి!'

'క్రిటిసిజమ్ స్వీకరిస్తారా?'

'ప్రెస్‌నుంచీ, ప్రేక్షకులనుంచీ వచ్చే విమర్శల్ని ఎప్పుడూ స్వీకరిస్తున్నాను. నాలోని లోటుపాటుల్ని తెలుసుకుని సవరించుకోవటానికి, భవిష్యత్తు అభివృద్ధికి అవి ఎంతగానో తోడ్పడతాయి' అన్నారు.

తీసుకున్న ఏ పాత్రనయినా అవలీలగా పోషించి మెప్పించగలిగే కేరెక్టర్ ఏక్ట్రెస్ జానకి. ఆమె పరిశ్రమకు వచ్చి 23 ఏళ్ళయింది. ఈ ఇరవైమూడేళ్ళుగా ఆమెలో గ్లామర్‌తోపాటు, నటిగా ఆమెకు డిమాండూ పెరుగుతూ వస్తున్నది. నిర్భయంగా ఉన్నది ఉన్నట్టు చెప్పగలిగే చిత్తశుద్ధిగల ఏకైక నటి — శ్రీమతి జానకి. ఆమెనటనలో ఎప్పుడూ నిత్యనూతనత్వం, జీవం తొణికిసలాడుతూ వుంటాయి.

— మోహన్‌కుమార్

సమీక్ష

# ద్రోహి

బిజినెస్ దృష్టితో పుంచుకోకుండా వున్నంతలో ప్రయోగాత్మకంగాను ప్రయోజనాత్మకంగాను చిత్రాలు నిర్మించేవారిలో రామానాయుడు ఒకరు— ఆయన నిర్మించిన చిత్రాలన్నీ టెక్నికల్‌గా పరిణతి చెంది కళాత్మకంగాను ఉన్నతంగాను వుండడం ప్రేక్షకులకు తెలియంది కాదు ఇప్పుడు విజయా సురేష్ కంబైన్స్ బ్యానర్‌మీద 'ద్రోహి' చిత్రాన్ని విడుదల చేశారు.

కథావస్తువు చాలా చిన్నది. కేవలం నటీనటుల సామర్థ్యంమీద నిలబడే చిత్రమిది.

ప్రప్రథమంగా బాపయ్యని దర్శకుడుగా పరిచయంచేస్తూ అతని ప్రతిభని ఈ ప్రయోగాత్మక చిత్రం ద్వారా సవాలు చేశారు నిర్మాత. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవడంలోనే ఈ యువ దర్శకుని శక్తిసామర్థ్యాలు సుబోధకమవుతున్నాయి.

చిత్రానికి విశేషాకర్షణ కూర్చేది యస్. యస్. లాల్. కెమెరావర్కు. సంగీతంలో కొత్తదనం తెచ్చిన రఘువులు కృషి అభినందనీయమైనది.

హీరోయిన్ ఫలానా అని లేని ఈ చిత్రానికి జగ్గయ్య హీరో. అతని నటనాశక్తిని పరిక్షించడానికేనా — అన్నట్టు చిత్రీకరించిన జగ్గయ్యపాత్ర అద్భుతంగా వుంది. (మాటల్లో దీర్ఘాలు లేకపోతే మరింత పసందుగా వుండేది). నాగభూషణం పాత్రలో ప్రత్యేకత లేకపోయినా అతని నటన చిత్రానికి విశేష ఆకర్షణే! వున్నంతలో దేవిక చాలా మధురంగా నటించింది. క్లయిమాక్సు పెద్దదయినా— అది రక్తికట్టడానికి కారణం కేవలం వాణిశ్రీ ప్రేక్షకుల హృదయాన్ని దోచుకోడానికి చిత్రమంతా కనిపించక్కర్లేదు, ఏ కొద్దిసేపున్నా ఫర్వాలేదు అనిపించింది ఆమె సామర్థ్యం. యస్. వరలక్ష్మి, కృష్ణంరాజు, త్యాగరాజు, బేబీరాణి మొదలైన



'ద్రోహి'లో రమాప్రభ.

వారు తదితర ముఖ్యపాత్రలని పోషించారు.

చిన్న కుటుంబకథని క్రయిమ్ ఎలిమెంటుతో థ్రిల్లింగ్‌గాను రసవత్తరంగాను నిర్మించిన ఈ చిత్రం చూడకుండా విడిచిపెట్టతగింది కాదు! నవయుగ విడుదల.

—సికరాజు ●

# సినిమా

## చంద్రకళను కాపాడిన కృష్ణ

ప్రభాకర రెడ్డికి అందమైన అమ్మాయిలతో ఆడుకోవడం అలవాటు. రోజుకొక కొత్త పిట్టను తన బుట్టలో వేసుకునే శక్తి అతనికుంది. అతని కొక క్లబ్బుకూడా వుంది. ప్రతిరోజూ క్లబ్బులో విందులు, వినోదాలు జరుపుతుంటాడాయన. ఆ క్లబ్బుకి, జయకుమారి పర్మినెంట్ డ్యాన్సరు. ఒకనాటి రాత్రి జయకుమారి హుషారుగా ఆడుతూ, నిషా మాపులతో ప్రభాకరరెడ్డిని కవ్విస్తూ, తన తనువును అతని యెదలో యిమడ్చుకోవాలని ప్రయత్నిస్తుంది. ఆటమాత్రం వుంటే సరిపోతుందా? అందుకే పాట కూడా కలిపింది.

'కవ్విస్తా రావోయి
కైపెక్కే అందాలు చూపిస్తా!'

అంటూ పాడుతూవున్న సమయంలో చంద్రవంకలాంటి చంద్రకళ అక్కడికి వచ్చింది. ఆమె రాకను ప్రభాకర రెడ్డి పసిగట్టాడు. అమాయకురాలయిన ఆ అందాలరాసిని నమ్మించి, ఆమెను బలాత్కా



ఈ సంవత్సరం ఊర్వశి మాధవీముఖర్జీతో ఉత్తమనటి అవార్డుఅందుకున్న శారద

## సినిమా

రించబోయాడు. హీరో క్రిష్ణ గబ గబ వచ్చి ప్రభాకరరెడ్డిని దబ దబ బాదాడు. క్రిష్ణ దెబ్బలకు రెడ్డి చిత్తయిపోయాడు. మూలుగుతూ క్రిందపడ్డాడు. చంద్రకళను కాపాడి, ఆమెను ఆమె యింటికి తీసికెళ్లి వాళ్లమ్మకు అప్పగించాడు. అక్కడ వాళ్లమ్మ చెప్పినకథ విని క్రిష్ణ నిర్ఘాంతపోయాడు. ఏమిటా కథ? చంద్రకళ తల్లియెవరు? తన్ను కాపాడిన క్రిష్ణను చంద్రకళ ఎలా గౌరవించింది? అనేది ప్రశ్నలకు సమాధానం దొరకాలంటే శ్రీ కృష్ణా ఫిలిమ్స్‌వారి 'నమ్మక ద్రోహులు' చిత్రం చూడాల్సిందే. మనోహరబాబు నిర్మిస్తున్న యీ క్రయిమ్ త్రిల్లర్‌ను కె. వి. ఎస్. కుటుంబరావు డైరెక్టు చేస్తున్నారు



విజయనిర్మల ఆలోచనలు ఏమయి ఉంటాయో? (నిండుదంపతులు,' చిత్రం.)

## రామారావును ప్రేమిస్తున్న విజయనిర్మల

వటి విజయనిర్మల ఒక 'టీ' కొట్టు పెట్టింది. ఆ కొట్టుపేరు 'అలివేలు మంగ'. ఆమెచేతి టీ త్రాగాలని ప్రతివాడు ఆ కొట్టుకే వచ్చి టీ తాగి వెళ్తుంటాడు. ఆమెకొట్టు కెదురుగా వెంకటేశ్వరా కిళ్లీ కొట్టు ఒకటుంది. ఆ కొట్టుకు యజమాని యెవరో తెలుసా? ఎన్. టి. రామారావే. ఎదురెదురుగా వుండడంవల్ల, ప్రతిరోజూ విజయనిర్మల, రామారావులు కొద్ది రోజుల్లోనే సన్నిహితులయ్యారు. విజయనిర్మల తను యేం చేసినా, ఆయనకు చెప్పితేనేగాని నిద్రపోదు. అంటే రామారావును ఆమె తన మనస్సులో యిముడ్చుకుందన్న మాటేగా. కాని రామారావు మరో అమ్మాయిని ప్రేమించాడు. విజయనిర్మల తన్ను ప్రేమిస్తున్నట్టు రామారావుకు తెలియదు. విజయనిర్మల వూహా ప్రపంచంలో గాలిమేడలు కట్టుకుంది.

విజయనిర్మల ఒకరోజు నదీ తీరానికి వెళ్లింది. పిల్లగాలి సోకింది. చల్లని నీళ్లలో కాస్సేపు విహరించాలనుకుంది. సెలయేటిలోకి దిగింది. జలకాలాడింది. మనస్సులోని భావాన్ని బయట పెట్టింది. ఎలాగో తెలుసా?

'నీటివాటున సొగను దాచుకుందామంటే
గడుసరి అలవచ్చి ఒడలంతా తడిమింది'

అంటూ ఆమె మైమరచి మరింత దగ్గిరగా పాడుతున్న సమయంలో సత్యనారాయణ వెనక[illegible]టుగా వచ్చి, విజయనిర్మలను తన బాహువుల్లో బంధించబోయాడు. అతని చెంప ఛెళ్లుమనింది. రెండు చెంపలు వాయించి, విజయనిర్మల పరుగెత్తసాగింది. 'కట్' అన్నారు దర్శకుడు కె. విశ్వనాథ్. ఈ దృశ్యం 'నిండుదంపతులు' చిత్రంలో కనిపిస్తుంది. ఎస్. వి. జగన్నాథరావు నిర్మించే యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను రామారావు, గుమ్మడి, రాజబాబు, సత్యనారాయణ, చంద్రమోహన్, సావిత్రి, విజయనిర్మల, లక్ష్మి, ఛాయాదేవి పోషిస్తున్నారు.

...ంత గారాబంగా పెంచుతుంటాడు. కాని విధి వైపరీత్యంవల్ల అన్నాచెల్లెళ్ల బ్రతుకుల్లో ఎడారులు యేర్పడ్డాయి. ప్రేమించి పెండ్లి చేసుకున్న భర్తను వెతుకుతూ



# సినిమా

వుంది పద్మిని. సర్వలక్షణ సమన్వితురాలయిన భార్యను యింటినుండి వెళ్లగొట్టినందుకు బాధపడుతున్నాడు శోభన్. అన్నాచెల్లె లిద్దరూ ఒకరికథ మరొకరికి చెప్పుకోక తప్పిందికాదు.

పద్మిని: బ్రహ్మచర్యం పోదామంటే సరితెలియదు అన్నయ్యా

శోభన్: సూటిగా చుక్కానిపట్టి నావ నడపవె చెల్లెలా—అంటూ చెల్లెలిని ఓదారుస్తూ యింకేదో చెప్పబోయాడు. 'కట్' అన్నారు దర్శకుడు చంద్రశేఖరరెడ్డి. ఈ సన్నివేశం 'విచిత్ర దాంపత్యం' లోనిది. పి. చిన్నపరెడ్డి నిర్మించే ఈ చిత్రంలోని ముఖ్య భూమికలను శోభన్, గుమ్మడి, రాజబాబు, ప్రభాకరరెడ్డి, సావిత్రి, విజయనిర్మల, మీనాకుమారి మరియు విజయలలిత ధరిస్తున్నారు.

*　　*　　*

'హీరో' క్రిష్ణ, విజయనిర్మల సిమ్లాకు వెళుతున్నారు. హనీమూన్‌కు అనుకునేరు. షూటింగులో పాల్గొనడానికై వెళ్లనున్నారు. వీరితోబాటు దర్శకుడు దాసు, ఛాయాగ్రాహకుడు స్వామి మరికొంత మంది ఆర్టిస్టులు బయల్దేరుతున్నారు. ఫిబ్రవరి 8 నుండి 28 వరకు సిమ్లా, డార్జిలింగ్, రాజస్థాన్‌లో వుంటారు. ఇంతకి ఏ చిత్రం షూటింగని చెప్పాలిగా. పద్మాలయ సంస్థ నిర్మించే రెండవ చిత్రం. ఈ చిత్రానికి జి. ఆదిశేషగిరిరావు నిర్మాత. రచన ఆరుద్ర. సంగీతాన్ని ఆదినారాయణరావు, ఛాయను స్వామి నిర్వహించే యూ అడ్వెంచరస్ చిత్రానికి కె. ఎస్. ఆర్. దాసు దర్శకుడు. ముఖ్య పాత్రలను క్రిష్ణ, విజయనిర్మల, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు, త్యాగరాజు, రావు గోపాలరావు; ఆనంద మోహన్ అండ్ విజయలలిత పోషిస్తారు.

## కలర్‌లో శశిరేఖాపరిణయం

'మాయాబజార్' చిత్రం ప్రేక్షకుల హృదయాలను విపరీతంగా ఆకట్టుకున్న విషయం, ఆ చిత్రానికి వచ్చిన వసూళ్లను చూస్తే తెలుస్తుంది. ఇప్పుడు అదే కథను 'శశిరేఖా పరిణయం' గా ఎస్. వి. ఎస్. జగన్నాధరావు కలర్‌లో నిర్మించ



రాజ్‌బాబు చెప్పున్నదానిని శ్రద్ధగా ఆలకిస్తున్న రాజశ్రీ 'ప్రేమజీవులు' చిత్రంలో

డానికి నిశ్చయించారు. క్రిష్ణ పాత్రను ఎన్. టి. రామారావు పోషించనున్న ఈ పౌరాణికాన్ని కె. విశ్వనాధ్ డైరెక్టు చేస్తారు. షూటింగు 1971 లో వుండ గలదని తెలుస్తోంది.

## విశ్వజ్యోతి పిక్చర్స్‌లో సావిత్రి

విశ్వజ్యోతి పిక్చర్స్ నిర్మించే చిత్రంలో సావిత్రి కథానాయిక. ఈమె హరనాథ్, చంద్రమోహన్‌కు తల్లిగా నటిస్తుంది. హరనాథ్‌కు జంటగా లక్ష్మి, చంద్రమోహన్‌కు జోడీగా అనిత నటించే ఈ చిత్రానికి సముద్రాల, రాజశ్రీ రచనా విభాగాన్ని, పెండ్యాల సంగీత సారధ్యాన్ని, స్వామి ఛాయను, రాజేంద్రకుమార్ శిల్పాన్ని నిర్వహిస్తారు. చిత్రంలోని సహాయ భూమికలను సత్యనారాయణ, రాజబాబు, రమాప్రభ, ఛాయాదేవి, విజయచంద్రు ధరిస్తారు. దర్శకత్వాన్ని మానాపురం అప్పారావు చేపట్టారు.

